ఈ దున్నపోతులో వున్న శక్తిని దీనికి తెలియజేస్తాను. ఈ పూబి అంతా పక్కకి లాగేసి-దానంతట అదే కదిలి వెళ్లి ఆ యినక నేలమీద నడయాడేలా చేస్తాను.... హేయ్.' అని అరిచాడు కృత నిశ్చయుడైన రాఘవులు.

వస్తువులో వీక్షణలో, విధానంలో కొత్తదనం కోసం చెవి కోసుకునే రచయిత శ్రీ వినుకొండ నాగరాజు. హాలుమకాం హైదరాబాదయినా, పుట్టి పెరిగింది పశ్చిమగోదావరి జిల్లాలో. వయసు ముప్పయి, ముప్పయిరెండు. పాతికేళ్ళ ప్రాయానికే నాలుగయిదు నవలలు వెలువరించిన ప్రజ్ఞాశాలి-"నన్ను పిలిచింది." "ప్రేమికుడు" వంటివి. ఈ నవలలో కథారంగమైన కొత్రాజు గుండాప్పి. దాని పరిసరాలని ఆ గడ్డను పుట్టిన బిడ్డలా అభివర్ణిస్తారు....



# ఊబిలో దున్న

వినుకొండ నాగరాజు

VOOBILO DUNNA

*By*

VINUKONDA NAGARAJU

Publishers :

**M. SESHACHALAM & CO.**

First Edition :

March, 1970

Cover Design :

**Bapu**

Printers :

**Sri Kala Printers**

Madras-33.

Distributors :

ANDHRA PRADESH BOOK DISTRIBUTORS

**Rashtrapathi Road, Secunderabad**

**Rs. 3/-50**

116

# ప్రేమకథ కాదు

ఇది ప్రేమకథ కాదు. కనీసం కాలక్షేపంకోసం చదువుకునేరకం పుస్తకమూ కాదు. ఒక ప్రయోజనాన్ని సాధించే దృష్టితో రచన చేయాలనే వాళ్ళున్నారు సామాన్యంగా ప్రతి రచయితా యేదో వొక ప్రయోజనాన్ని సాధించే ఉద్దేశంతోనే రాస్తూంటాడు. ఈ నవలలో నేను మరింత ఎక్కువగా ప్రయోజనంకోసం రాశానని విమర్శకులు అనకా మానరు. నేను వొప్పుకోకా తప్పదు. ప్రత్యేకంగా, నాకు ఇందులో ప్రస్తావించిన మోస్తరు ప్రభుత్వ మంటే మక్కువా లేదు, మంటా లేదు. ఒక పార్టీమీద అభిమానమూలేదు. మరో పార్టీ అంటే అసహ్యమూ లేదు. ఈ ప్రభుత్వాలూ, పార్టీలూ అన్నీ ఆలోచించి చూస్తే మన శ్రేయస్సుకోసం ఏర్పడినవే. అయితే నా బాధల్లా ఈ తరం వాళ్ళు ఒక కొత్త వొత్తిడిలో నిస్సహాయంగా నలిగి పోతున్నారని. ఆ వొత్తిడి గురించి నేను వివరించి చెప్పగలిగిన స్థితిలో లేను. ఆ వొత్తిడిలో ఇప్పటి వ్యవస్థలన్నీ చేరివున్నాయి. మనలో ఒకరకం స్తబ్ధత ప్రవేశించింది. మన ముందుతరం వాళ్ళకి లేని కొన్ని సమస్యలు మనల్ని ఎదుర్కొంటున్నాయి. వీటిని పరిష్కరించుకోలేక కొందరు విపరీతమైన కష్టనష్టాలకు గురి అవుతున్నారు. మరికొందరు సోమరితనాన్ని పెంచుకుంటున్నారు. ఇంకాకొందరు క్రమశిక్షణ తప్పి చరిస్తున్నారు. ఈ యుగంలో, మిగతా దేశాల్లో లాగా, నవతరంలో ఉండాల్సినంత ఉత్సాహంలేదు. ఏ మాత్రం కూడా స్వశక్తి మీద నమ్మకమూ, ధైర్యమూ లేకపోతున్నాయి.

నేటి ప్రపంచం పోటీతో పరుగిడుతోంది. పోటీలో గెలిచిన వాడే చక్కటి జీవితానికి అర్హుడవుతున్నాడు. మిగతావాళ్ళు దిగాలుపడి పోతున్నారు. తమకీ ప్రపంచంలో తాము వూహించుకున్న స్థానం దొరకడంలేదు. దీనికి బాధ్యు లెవరు? ఈ పరిస్థితిని ఎవరు చక్క

చేయాలి? ఈ విధానాన్ని ఎలా మార్చాలి? రకరకాల ఆలోచనలు. మన కసిని తీర్చుకోవాలంటే వొకే వొక లోకువయిన సంస్థ కనిపిస్తుంది. మనం ఎన్నుకున్న ప్రభుత్వం. దానిని తిట్టి, విమర్శించి, దిగజార్చి, తృప్తిపడుతున్నాం.

నేను ఈ నవలద్వారా చేయ సంకల్పించిన ప్రబోధం యువతరాన్ని జూలుదులుపుకుని, గర్జించమని కాదు. భావి భారత పౌరులు మీరంతా అనే ప్రభుత్వం ఇచ్చే బహుమతి కోసం నేను అరిచే అరుపు కాదు ఇది. మన నవభారత నిర్మాత, తను ప్రధానమంత్రి అయిన వెంటనే ఒక మహానాటక కర్తదగ్గరికి వెళ్ళి—స్వామీ! మీ రచనలవల్ల ఉత్తేజితుడయిన వాణ్ణి నేను. నేను మీ పుస్తకాలు చదివి జీర్ణించుకున్న సామ్య వాదతత్వాన్ని నా దేశపరిపాలనలో ప్రతిఫలించేలా చేస్తాను—అని గురుదక్షిణ పలికాడుట. అలా నేను, కాబోయే ప్రధానమంత్రుల, భావి భారత నేతల జీవితాల్ని ప్రభావితం చేయాలన్న తలంపుతో వ్రాసినదికూడా కాదు ఇది. నా సమకాలీన యువతరం పడుతున్న బాధలకి ఇదొక కన్నీటిబొట్టు. నా పూర్తి సానుభూతి! వీళ్ళు జడత్వాన్ని నింపుకుని, జీవితాల్ని ఎక్కడికక్కడే పరుచుకుని, తృప్తిగా బ్రతుకుతున్న వాళ్ళు. కొత్తకోసం పాకులాట లేదువీళ్ళలో.

ఈ నవల సామ్యవాద సాహితికి చెందినదంటున్నాను. ప్రజాస్వామ్యవాద (వ్యాఖ్యానించనవసరం లేదనుకుంటాను) రాజకీయాలున్నాయి, అలానే ఇది సామ్యవాద సాహిత్యకల్పన—సాహిత్యం ద్వారా సామ్యవాదం; రచనద్వారా సమతనుగూర్చి విడమర్చి చెప్పడం. జమీందరీలు ఎప్పుడోపోయినా, మన నాటకాలూ, నవలలూ, కథలూ, సినిమాలు ఇంకా జమీందారులతోనే నిండివుండడం—మనకి జుగుప్సను కలిగిస్తోంది. నేను డబ్బుగల వాడిని అని చెప్పుకోవడంకన్నా—మరో డాంబికం లేదు ఈ రోజుల్లో. నా తండ్రి తాతలు సంపాయించిన ఆస్తి నాకు తరతరాలుగా అనుభవించినా తరగనంత వుంది, అని అనడంకన్నా—నేను అప్రయోజకుణ్ణి అనడం బావుంటుంది. 1947 ఆగస్టు తర్వాత మార్పులు అనేకం వచ్చాయి. అయినా మనం ఇంకా ఈ కొత్త వాతావరణాన్ని ప్రతిబింబించడంలేదు. మన

రచనలో. కొత్తగా వస్తున్న రచయితలు పాతవాళ్ళ భావాల్నే కొత్తగా చెపుతున్నారు తప్పితే. కొత్తజీవితాన్ని గురించి రాయటంలేదు. ఈ దేశ చరిత్రలో ఎప్పుడూ ఎరగని మార్పు ఇరవై ఏళ్ళక్రితం వచ్చింది. ఈ దేశప్రభుత్వం ప్రజాయత్తమైంది. జాతి మత కుల ప్రాంతీయ విభేదాల్ని త్రోసి రాజనే ఒక మహత్తర ప్రాతిపదిక ఏర్పడింది. ఇంతటి గొప్పమార్పు ప్రపంచ చరిత్రలో బహు అరుదుగా జరుగుతుంది. మరి మన రచయితలు. ఈ మార్పుల్ని ఎందుకు పట్టించుకోడం లేదో, తమ రచనలో ఎందుకు ప్రతిఫలింపజేయడం లేదో! అయితే మన ప్రజలలో కొందరు మాత్రమే తమంతతాము తెలిసికోగలిన వాళ్ళు. చాలా మందికి ఘోషపెట్టి తెలియజెప్పాలి. ఒక వార్తాపత్రిక దేశంలో కరువు అంటే, తామంతా కరువు అనేస్థితికి మరో వార్తాపత్రిక దేశంలో తిరుగుబాటు అంటే, తామంతా ఒక్కసారే తిరుగుబాటు అని అరిచే స్థితికి ప్రజలు వచ్చారు. బాధ్యతా రహితమైన అనేక వినాదాలూ. ఉద్యమాలూ లేస్తున్నాయి. మన ఉనికిపట్టునీ, మనచుట్టూ ఉన్న వాతావరణాన్నీ తెలుసుకుంటే ఇంత తొందరతొక్కుడుగా మనతరంవాళ్ళు నడవరేమో! వీటన్నింటి గురించి, వీటిని పరిశీలిస్తూ రాయటమే సామ్యవాద సాహితీ రచనలంటే. మన కొత్త జీవిత విధానాన్ని ప్రతిబింబింపచేయడమే-సామ్యవాద సాహిత్య కల్పన అంటే.

ఈ నవలలో రెండేరెండు పాత్రలు. అందులోవున్న రెండు పాత్రలకే ప్రాముఖ్యం వుంది. అయితే ఒకపాత్ర ఒకరకం విధానానికి రూపకల్పన, రెండోపాత్ర మరో రకానికి. ఇందులో రాఘవులి పాత్రలో బలహీనతలకీ రచయితకీ సంబంధంలేదు; అలాగే అతని జీవిత వేదాంతానికీ రచయితకీ. ఆ పాత్ర ఈనాటి వాళ్ళలో కేటాయింపుగా కనిపించే వ్యక్తి. రాఘవులు ఆదర్శపాత్రమాత్రం కాదు. సామాన్యుడు. సహృదయులయిన పాఠకులు ఈ నవలని ఆదరిస్తారని నమ్ముతాను.

—రచయిత

వయసు మళ్ళిన అజ్ఞానానికి మొక్కే నిర్భాగ్యులకీ, వయసు మళ్ళని ప్రతిభను అభినందించలేని దౌర్భాగ్యులకీ, ఆదశవాదికీ, అసమర్థతకూ, అల్పత్వానికీ, నిరుద్యోగులకీ, పిరికి పందలకూ, పరాన్నజీవులకూ....గత చరిత్రకు బాకాలూదే విషేపరాయుళ్ళకూ, చేవలేని యువరక్తానికీ, నా తరం పరవళ్ళ జీవనదిలో గల అట్టడుగు పాకుడుకూ-

ఈ పుస్తకాన్ని సానుభూతితో

అం కి తం

చేస్తున్నాను.

ద్రావికళ్ళు మూసుకుని వున్నాయి. అలికిడి తెలుసుకోగలిగిన స్థితిలో లేదది. కాళ్ళు. పూర్తిగా చట్టలవరకూ వూబిలో పాతుకు పోయాయి. వల్లరాయిలా వుంది-అది దూరానికి.

రాఘవులు చూశాడు. మొదట్లో అతనికి. అది ఏదో పడుకుని విశ్రాంతి తీసుకుంటున్నట్టు తోచింది.

కొర్రాజుగుండం 'డామ్' దిగువలో వుంది. కాలవ బాగా పల్చబడిపోతూ. జాలుగా వస్తోంది. పాయలు పాయలుగా. అతిపల్చగా. సన్నగా వస్తోంది. గుండంలో మాత్రం చలమనీరు వుంది. వూబి కంతటికీ మధ్యగా. వానాకాలంలో. పడింది-గుండం. ఆ గుండంలో నీళ్ళు తాగేందుకు వెళ్ళబోయి. అది. అలా వూబి మధ్యలో దిగబడి పోయి వుండాలి.

రాఘవులికి దాని వెనుక పేడ కనిపించింది. దాన్ని చూడగానె రెండు రోజులనుంచి అని...(గేదో. దున్నపోతో?) అలా దిగబడి పోయిందనిపించింది. గొబ్బి మండలు కాలువకు అటువేపు పొదల్లో వుంటాయి. అతని చేతిలో వంకి పికత్తి తెల్లగా మెరుస్తోంది ఎండలో. అతని నీడ అతని కాళ్ళ కింద బహు చిన్నదిగా అయింది. ఎత్తయిన తన చెప్పుల్ని విడిచి. రెండో చేత్తో పట్టుకుని కాలువను దాటాలనుకున్నాడు.

అప్పుడు.—

వంద గజాల్లో. కాలువ వంపుగా తిరిగేచోట: ఊబిలో దిగబడి పోయి. విశ్చింతగా నిలబడిపోయిన. ఆకలు చచ్చిన వల్లటి ప్రాణి

కనిపించింది. తెల్లటి, ఎర్రటి పూలలో దాని వెనుక నల్లగా పేడ కనిపిస్తోంది.

రాఘవులు బట్టతలమీద చేత్తో రాచుకున్నాడు. కొంచెంగా తలకి చలనం కలిగింది. చేతి చెమట అంటి, చల్లగాలి తగలడంతో రాఘవులికి తల మీద చల్లగా అనిపించింది. కనుబొమల పక్కన చెమర్చిన చెమటను కూడా తుడుచుకున్నాడు. ఊబి దగ్గరకు వెళ్ళి, పరిశీలించి చూడా లనిపించింది.

ఏత్తుగా వుంది కాలవ గట్టు. వాలుగా దిగాడు రాఘవులు, కాలవ లోకి. ఒక చేతిలో వంకిపిడితో బరువైన కత్తి. రెండో చేతిలో బరువుగా వున్న మందపాటి చెప్పులు. అతని కాలి పిక్కలకు, ఎండలో వెచ్చగా కాగిన వుమ్మెత్త ఆకులు తగిలి, జిగురుగా అంటు కుంటున్నాయి. కళ్ళు మైకంగా తిరుగుతున్నాయి.

అతనికి తను చదువుకునేటప్పటి అద్దె రూము పక్క వాటాలో వుంటున్న ఆఫీసరు భార్య జ్ఞాపకానికి వచ్చింది. అతని మెడ పక్క నరం కదిలింది-అసహ్యాన్ని భరించలేనన్నట్టు. రాఘవులి కాలికి వెచ్చటి నీరు తగిలింది. నీళ్ళు గలగలమని చెవుల్లో వూదుతు న్నాయి-నడుస్తోంటే-నీరు దాటాడు. రాళ్ళ ఇసుక. గంద్ర ఇసుక. చెప్పులు అలవాటయిన కాళ్లు, పాదాల్ని సున్నితమైన చేతులు వొత్తు తున్నప్పటిలాంటి అనుభూతి లాంటిది. మైకం పుడుతోంది. మాలీసు చేస్తున్నప్పటిలాగా-మాంద్యం కమ్మిన వాతావరణంలో వొళ్ళు కుంచించుకున్న స్థితిలాగా. అతను కళ్ళలోకి శక్తిని బలవంతంగా లాక్కు తెచ్చుకుని సాఫీగా చూడాలనుకున్నాడు. కాని కంటి చుట్టూ మత్తు, నల్లమందు పట్టు వేసుకుంది. తాగినప్పుడు, బాగా తాగినప్పుడు వచ్చే తిప్పులాగా వుంది.

రాఘవులు మళ్ళీ బట్టతలను చేత్తో తడుముకున్నాడు. గాలివేసి, వెచ్చటి కండువా ఎగిరిపోబోతే; ఆదుర్దాగా పట్టుకుని, దాన్ని భుజాల చుట్టూ, తెల్ల బనీను మీద సర్దుకున్నాడు. హుందా కలిగిన అతని ముఖంలో రాత్రి నిద్రలేనితనం కనిపిస్తోంది. స్వేచ్ఛను కొట్టవచ్చినట్టు చూపే అతని మొహంలో మత్తుదనం బాగా వుంది. మెత్తటి ఇసుక

మీద వొండ్రు పాకుడులా కట్టింది. పాదాలకి అంటుకొంటోంది. జారేట్టు వుంది. అందుకని, అతను జాగ్రత్తగా నడుస్తున్నాడు.

అతని కళ్ళకి, వూబిలో యిరుక్కుపోయిన, కదల్లేని నల్లటి జీవి, కళ్ళు తెరవడం కనిపించింది. ఇరవై గజాల్లో వూబిలో చిక్కుకు పోయిన ప్రాణం. మరోపక్కన, ఊబిమీద, దేనివో అర్ధచంద్రాకారపు పక్క యెముకలు కనిపించాయి. అసహ్యంతోనూ, మనస్సుకు నొప్పి కలిగే అతని కళ్ళు చికిలించాయి. కళ్ళ చివర చర్మం ముడుచుకుంది. ముడతలు పడింది, సున్నితమైన రేఖల్లాగా.

... కొర్రాజు గుండం వేపు ఎవ్వరూ ఎక్కువగా రారు. పైరు పొలాలన్నీ వూరికి తూర్పునే. కొర్రాజు గుండం వేపు, కాలవకు అవతల అడవి బీళ్ళుంటాయి. దట్టంగా గడ్డి పట్టి వుంటుంది. మందు వేసవికాలంలో గొడ్లను వదిలేస్తే, అవి అడవంతా తిరిగి మేసి. పొలాల కొచ్చేస్తాయి కొర్రాజుగుండం వైపు గడ్డి బహు దట్టంగా పడుతుంది. వానాకాలంలో, శీతాకాలంలో, ఆ బీళ్ళలోకి పశువులు కూడా పోలేవు. ఏ తిండి గడవనివాళ్ళో ఏదయినా కలప నరుక్కునేందుకు ఎప్పుడయినా పోవడం కద్దు. తోడేళ్లు, నక్కలు, పాములు విచ్చలవిడిగా తిరుగుతూ వుంటాయి. అడవి పందులూ, లేళ్లూ, దుప్పులూ కొల్లలు. వేసవికాలంలో ఎన్నో పాములు, గొడ్లు మందలు మందలుగా తిరుగుతోంటే, వాటి కాళ్ళ కిందపడి నలిగి చచ్చి పోతూంటాయి. వాటివల్ల గొడ్లు కూడా విపరీతంగా చచ్చిపోతూంటాయి. తోడేళ్ళు గొడ్లని మందలుగా చూస్తే దగ్గరకు రావు; కాని వొక్కటొక్కటే వేరయితే, చంపి, తినేస్తాయి. కొర్రాజుగుండం వైపు పొద్దుగూకితే, ఎవ్వరూ జాగుచేసి. వెనకబడరు. ఖూనీలకి నెలవనీ, దయ్యాలు తిరుగుతాయనీ, పోలీసుల్ని తప్పించుకు తిరిగేవారి గుట్టుపట్టనీ చాలా కథలు ఆ అడవిని గురించి అల్లబడి వున్నాయి.

అది అలికిడి తగిలి, బొత్తిగా కదలలేని స్థితిలో. తలను కొద్దిగామనిషి వస్తున్న వేపు నెమ్మదిగా తిప్పి. ఏకొద్ది మార్పూలేని ఆ అవస్థలో దీనంగా చూసింది. దాని చెవులు క్షణాల లెక్కింపుతో నిక్కపొడిచాయి. పొడవుగా, వొంపు తిరిగిన దాని కొమ్ము, మెడను పక్కకు తిప్పడంతో, మూపుకు తగిలి తలను తిప్పనీయడం లేదు.

అది అలికిడి విని, సహాయం కోసం అరవాలనుకున్నట్టుంది ఎండి పోయి, పీలంగా ముడ్డ గట్టుకున్న నాలుక బయటకు కనిపించేలా, దాని నోరు కొద్దిగా విడివుంది. చచ్చిపోతున్న పేద ముసలి తండ్రి, తన కొడుక్కి ప్రాణం వదిలే ముందు, ఏదో చెప్పాలని చెప్పలేక పోయినట్టు అది అరవలేకపోయింది.

"ఇది దున్నపోతు" అనుకున్నాడు రాఘవులు.

అతని ముక్కుపుటాల్ని దాని కొచ్చు వాసన కలియబెట్టింది. అతను ముక్కు చీదుకుని వెనక్కి రెండడుగులు వేశాడు. చూస్తు న్నాడు...దాని కన్ను ఎర్రగా వుంది. విశ్చలంగా వుంది. తళుక్కు మన్నట్టు కదుల్తోంది-మెరుపులాగ. నక్షత్రంలాగ. మసి ఎగిరి పోతోంచే నిప్పులాగ. ఎక్కడో దూరంగా వున్న మంటలాగా. నల్లటి దాని చట్టమీద ఎర్రటి పుండు వుంది. నల్లటి పుచ్చకాయమీద గంటుపెట్టి పెచ్చు తీసినట్టు దాని ముందు కాళ్ళకు పైగా. సన్నటి ముడతఇన్న లావుపాటి బోరమీద; జానెడు పైగా పొడవున్న జలగ వేలాడుతోంది. దున్నపోతు గాలి పీలుస్తోంది. దాని మూతిమీసి వెంట్రుకలు, బారుగా వున్నవల్లా, అది శ్వాస విడుస్తున్నప్పుడల్లా కదులుతున్నాయి. అది ఎండలో పడుతున్న ఆయాసం. దాని శ్వాస కంచే బాగా వినపడుతోంది. రాఘవులు దానివంకే చూసూ బట్టతలమ కత్తి పుచ్చుకున్న చేత్తో తుడుచుకున్నాడు. తలను గోళ్ళతో గీరు కున్నాడు-చిట చిటలు తగ్గేందుకు.

నీటి వసరు చుట్టూ రకరకాల పక్షుల ఈకలు-నీలివీ. ఆకు పచ్చవీ రెండు మూడు రంగులు సగం సగం వున్నవా. సన్నగా. వంకరగా, గీతల్లాగా పాముల జాడలున్నాయి. గుండంలో నీళ్ళలో వుండి వుండి కదలిక ఏదో తెలుస్తోంది. బురదపామో, బొచ్చు చేపో తిరుగుతూ వుండాలి. రివ్వుమని వేసేగాలి ఆ నీళ్ళమీద ఎలాంటి కెరటాల్ని కలగజేయడం లేదు.

రాఘవులు దున్నపోతు వంక చూశాడు. దాని కారునలుపు ముఖం మధ్య-తెల్లగా, వెడల్పుగా దీపపు వెలుగులాంటి, ముత్యం బొట్టు లాంటి, పుట్టుకతో వచ్చిన-బొల్లి. మూతపడుతున్న కళ్ళు. కళ్ళ వెంట నీరు కారివుండవచ్చు-పసుపు పచ్చగా కంటినుంచి చారిక

కట్టింది. పీలిగా కూడా వుంది-చారిక. కంటి మూలల పుసి బాగా పేరుకుంది-నురగలా. దున్నపోతు ఆయాసంకొద్దీ గుర్రుమంటోంది-కళ్లు అరమూతలు పడుతోంటే. మంద మందంగా.

"ప్చ్" అనుకున్నాడు రాఘవులు "....జైల్లో పెట్టిన మనిషి లాగా వుంది పాపం-" అని నిట్టూర్చాడు.

దున్నపోతు వోపికలేని తనంతో, తలను ముందుకు చాచి, విదిలించింది. లంఖణాలు చేస్తున్నవాడు బాధగా కదిలినట్టుందది.

అంత లోతుపరకూ ఎలా వెళ్ళిందీ?" అని ప్రశ్నించు కున్నాడు రాఘవులు. దున్నపోతు వెనుక అది వచ్చిన గుర్తులు న్నాయి-చెరిగిపోబోతూ. దాని వీపుమీద, తోకతో కొట్టుకున్నప్పుడు పడిన వూబి బురద చారికలు తెల్లగా వున్నాయి. ఊబిలో నుంచి బయట పడాలని తెలివిమాలి, ముందుకు వురకబోయి. అది పడిన అవస్థ రాఘవులికి అర్థమయింది.

రాఘవులికి చెరో చేతులో బరువు. చేతులు బాగా తీపులు పెడుతున్నాయి.

దున్నపోతు కనురెప్పలు కదిలి, కళ్ళు కొంచెంగా బయట పడ్డాయి. చూస్తోందది. నిరాశ, నీరసం, కనిపిస్తున్నాయి దాని మొహంలో-కూడగట్టుకున్న శక్తంతా వృథా అయి. తపశ్శక్తి కోల్పోయిన పురాణాల్లో మునిలాగా, తరతరాలుగా అనుభవిస్తూవచ్చిన ఎస్టేట్లు పోయిన తర్వాత నడుములు విరిగిన వాళ్ళలాగా, కుక్కి మంచంలోంచి లేవలేక చావును కోరుకుంటున్న ముసలాడిలాగా వుంది అది. ఆరోగ్యం లేని అనాకారి చంటిపిల్లాడు చూస్తున్నట్టుంది దాని చూపు....

హెల్తు విజిటరు రంగమ్మ....కుటుంబ నియంత్రణం గురించి వినని అంబయ్య సంసారం....నగరంవరకే రాళ్ళుకొట్టించిన చట్టూ చితచితలాడుతూండే బురదతో వుండే వూరి బయటి మంచినీళ్ళ నుయ్యి...పాతకాలవు వ్యవసాయ పద్ధతి...సొల్లుమాటలు....పూర్వపు బజారు....ఇప్పటి బజారు....

రాఘవులి ఆలోచన ఎక్కడెక్కడో తిరిగి మళ్ళీ దున్న పోతు దగ్గరికి వచ్చింది. అతనికి, దున్నపోతు చూపుకీ, ఈ

ఆలోచనల అంతిమ పర్యవసానానికీ మధ్య చాల వ్యత్యాసం కను పించింది.

....దున్నపోతు ఇంకా చూస్తోంది. కాలవకు మూలగా వుంది. ఊబి మధ్య నొక్కుకునే జంతువు. రెండు మూడు రోజులుగా వున్నట్టు ఎదురు చూస్తోంది. తలను దుఃఖంతో వాల్చుకుంటోంది. ఏడుస్తోంది; తనలో తను ప్రకంపించి, గుర్రుపెట్టి ఏడుస్తోందా; తన గ్రహపాటును తల్చుకుంటూ కుమిలి ఏడుస్తోందా... చుట్టూ చూస్తోంది. తిండిలేక, నీళ్ళులేక, ఎండలో. నిలబడ్డ చోట్లోంచి కదల్లేక, స్వశక్తితో బయటికిరాలేక—అలాగే గడుపుతోంది .. చావకుండా అలానే బ్రతక కలిగినంత సేపూ, దానికదే మంచి జీవితం....ఒకవేళ మరో పది దున్నపోతులు ఆదారిన వచ్చినా, అవి దాన్ని పట్టించుకోవు. వాటి దారిన అవి పోతాయి. పోనీ....ఇది అరచి వుంటుంది దీనంగా, దీనాతిదీనంగా. మరీమరీ దిగులుగా అరచి వుంటుంది. వాటి మన స్సులకి ఆ దైన్యం హత్తుకుని, అవి అలాగేనని, రాబోతాయి దగ్గరకంటా. కాని కాళ్ళు దిగబడి పోతూండడంచూసి, లోపలికి వచ్చేందుకు బెదిరి, సంశయించి, బయటికి పరుగులెత్తి, నిలబడి పోతాయి-దాన్ని చూస్తూ—దున్నపోతు వాటివంక జాలిగా చూస్తుంది. కన్నీళ్ళు కారుస్తుంది—తనకిక గత్యంతరంలేదని మూలుగుతుంది— తను అలా చచ్చిపోవాల్సిందేనని, అది విని, అప్పుడు అవీ అరు స్తాయి. తలలూపుతాయి రమ్మని. వాటిలో అవి తలలు కుమ్ముకుని, ఎగిరి, కంగారుపడి, అరుస్తూ; వూబిలో వున్న దున్నపోతు తనంత తనుగా ప్రయత్నించే బయటికి రాగలిగేందుకు ఉత్తేజన మిచ్చి బోతాయి. కాని, దున్నపోతు రాలేదు. దాని అశక్తత దానికి అర్థ మయిపోతుంది. మిగిలిన దున్నలు ఎంతోసేపు అక్కడే వుంటాయి. దున్నపోతు మనస్సు ఆందోళన చల్లబడి, తిరిగి మొద్దు బారుతుంది. నిశ్చలంగా వుంటుంది. బాగా ఉద్రిక్తత చెందిన మెదడు, కొద్దిసేపు చురుగ్గా పనిచేసి, వెంటనే కుచించుకుపోతుంది. అవి, వెళ్ళిపోబోయి అరుస్తాయి అది కళ్ళు తెరవదు. అవి వెళ్ళిపోతాయి, అవికూడా దాన్ని గురించి వెంటనే మర్చిపోతాయి. పొలానికి తిరిగిపోతాయి. వాటికని వేసిన దొడ్లలోకి వెళ్ళి బందాలు వెయ్యమని నిలబడతాయి.

వాటితో అవి కుమ్ముకుని, కలబడతాయి. ఒక్కోసారి రాత్రుళ్ళు దొడ్లు తొక్కి పక్క చేలల్లో పడతాయి....

...దున్నపోతు కాళ్ళు ఊబిలో వాలిపి పోయాయేమో! దాని చట్టమీద పుండు కత్తితో పొడిచి కెలక దీసినట్టువుంది—నల్లటి చట్టమీద. లోతుగావుంది. పీరు కారుతోంది. పుండులోనుంచి రసి. ప్లాజ్మాలాంటిది. రాఘవులికి తనకే గాయమయి, పుండుగా మారి నట్టూ, సలుపుతున్నట్టూ అనిపించింది. అతను మళ్ళీమళ్ళీ దున్నపోతు వంక పరీక్షగా చూశాడు. దొక్కలు చాలలోతుగా వున్నాయి.

"ఎవరి దబ్బా?" అనుకున్నాడు.

ఊళ్ళోకి వరద మందల వాళ్ళు-పైన, డెల్టా సాగులో ఊడ్పు లవగానే తోలిపెడతారు దున్నపోతుల్ని మందలకొద్దీ ఇటువేపు. భూములు లేనివాళ్ళూ, వూరికే తిరిగేవాళ్ళూ, వాటిని వప్పజెప్పుకుని; బంజరు బీళ్ళల్లో, అడవుల్లో మేపుతారు. దానివల్ల వాళ్ళకు వరద మందల్ని తోలిన వాళ్ళు డబ్బుకొంత ఇస్తారు. అంతేకాకుండా, వూళ్ళో రైతుల పొలాల్లో దొడ్డిపెట్టి, పెంట తొక్కించి, పుల్లరిని కూడా లాభం పొందుతారు. కొత్రరాజు గుండం వేపు అడవిమాగాణి కాళీ గనుక అందులోకి తోలేస్తారు పొద్దుటపూట—మందల్ని. సాయంత్రానికి అవి మేసి, కాలవదాటి తిరిగి వస్తాయి. వాటిని వెతికి గుంపుచేసి, తోలుకొచ్చి పొలాల్లో దొడ్లలో పెడతారు. ఒక వేళ ఏదయినా ఒకటి చచ్చిపోతే, దాని కొమ్ములు జాగ్రత్తచేసి. వరద గొడ్లవాడు వచ్చినప్పుడు, ఆనమాలుగా వాటిని చూపించేస్తారు. ఒక్కోసారి బ్రతికివున్న దాన్ని చంపి. మాంసం అమ్ముకుని, తిని, డబ్బుచేసుకుని కొమ్ముల్ని ఆ విధంగా చూపించేందుకు జాగ్రత్త పెట్టడంకూడా కొంతమందిలో వుంటుంది.

రాఘవులికి దాన్నిచూస్తే జాలివేసింది. గేదె జాతి అరచి నట్టు,— "ఈ....య్యా య్యా య్యా" అన్నాడు. గొంతు జీరగా వచ్చేట్టు, గొంతునరాలు బిగబట్టి, మళ్ళీ అన్నాడు—"ఈ...య్!" దున్నపోతు చూస్తోంది. దాని కళ్ళల్లో ముందుగా వచ్చిన కాంతి మళ్ళీ వచ్చింది. అతను మళ్ళీ అన్నాడు.

అది నాలుక కదిలించింది. చెవులు కొంచెం కదిలాయి. మూలుగు వినిపించడం లేదు.

రాఘవులికి ఒట్ట తలమీద సూర్యరశ్మికి మంట పుట్టింది. చేత్తో తలను నిమురుకుని, కండువాను తలమీద వేసుకున్నాడు. దున్నపోతు రొప్పుతూ ఆయాసపడుతోంటే అతనికి వినిపిస్తోంది. దున్నపోతు అతన్నే చూస్తోంది. బాగా దైన్యం. శూన్యం కనిపిస్తోందీసారి.

రాఘవులు మళ్ళీ "యీ....య్య" అన్నాడు. దాని చెవులు మళ్ళీ కదిలాయి.

"దీన్ని ఎంతమంది కలిస్తే తీయగలరు?" అతను ప్రశ్నించుకున్నాడు. సుమారు గజంలోతు దిగబడిపోయిన దున్నపోతు వంక కనురెప్పలు కదలని ఆశ్చర్యంతో చూశాడు. నల్లటి మట్టితో, సన్నగా బొమ్మను తయారుచేసి, కాళ్ళులేకుండా, బురద నేలమీద కూరుకుపోకుండా పెట్టినట్టు వుందని.

....వూబి చాలలోతు వున్నట్టువుంది. ఎలా వస్తుందది? వూబికి మూలగా నడిచి వెళ్ళడం మూలాన, చాలదూరం నెట్టు కెళ్ళింది. దాన్ని తియ్యాలంటే కనీసం పదిమందయినా వుండాలి. పదిమంది, నాలుగు గంటలు, సమష్టిగా కష్టపడితే, అది బయటికి వస్తుంది. దాని ప్రాణం నిలబడుతుంది. ఒక జీవి బ్రతుకుతుంది. (అతనికి నవ్వు వచ్చింది అనుమానం కలిగింది తన ఆలోచనమీద)
... పదిమంది ఒక దున్నపోతు కోసంరారు. అది ఎవరిదో! ఒకవేళ ఎవరికయినా సంబంధించినదైనా, దాని కొమ్ములతోనేగాని, దాని ప్రాణంతో అతగాడికి సంబంధంలేదు.

రాఘవులు చెప్పుల్ని, కత్తినీ నేలమీద పడేశాడు. అతని రెండు చేతులూ ఇప్పుడు తీరికయినాయి. అతను చేతుల్ని నలుపుకున్నాడు.

....మోకును దున్నపోతు కొమ్ములకి కట్టి, గట్టిగా లాగుతోంటే నడచి వస్తుందేమో!...అంత నీరసంగా వున్నది నడవగలదా? తను దాని దగ్గరకెళ్ళాలంటే అంత లోతు వూబిలో దిగబడిపోవాలి. తమా నడవలేడు. దాన్ని నడిపించలేడు. తనే దిగబడి

పోతే దానినేం బయటికి లాగ్గలడు తను! తన కాళ్ళు ఊబిలో పైకి కిందికీ లాక్కుంటోంటే, కాళ్ళూ పాదాలూ నొప్పి జేస్తాయి. బల వంతంగా లాగాలి. బురదకూ. బురదలాంటి వూబికీ చాల తేడా. ఒక్కోసారి మామూలు బురదలోనే దిగబడిపోయి, బెణుకు పడ తాయి కాళ్ళు. దమ్ముర్రోజుల్లో నాగళ్ళు దున్నేప్పుడు, పలగొర్రు తోలేప్పుడు—ఆ పనికి అలవాటు పడ్డ శరీరం వేరు; ఇప్పుడు వేరు. అసలే అది దున్నపోతు...తోలితే రావద్దా బయటికి! ఎన్నిరాళ్ళు విసిరినా, చచ్చేందుకయినా మొండికేసి నిలబడుతుందిగాని, ఒక్క కాలు కదపదు—వూబిని విరగలాక్కుని బయటపడదు. అదే ఎద్దు జాతి అయితే, చురుకు ఎక్కువ. కాని....ఇంత నీరసపడితే, అవి కనీసం తలనైనా ఎత్తలేవేమో. వూబిగట్టి పడిపోయినట్టు వుంది చాలమటుకు...

"దాని కర్మ" అనుకున్నాడు రాఘవులు.

'జిల్లా ఆహార సమస్యా వారం' చింతల కుంటలో జరిగిన మూడోరోజుకుగాని, రాఘవులికి తీరిక చిక్కలేదు. మూడవరోజు సభకు అధ్యక్షత వహించాల్సిన బాధ్యత అతని మీదపడింది. అది కాకుండా, ఆ వారంరోజుల కార్యక్రమ నిర్వహణకూ సమితి అధ్య క్షుడిగా, తన సమితిలో జరుగుతున్న సభలకి బాధ్యుడయ్యేడు. ఇవ్వాళే, కొద్ది రోజుల తర్వాత పొలం రావడం. పాలేర్లంతా కోడి పందేల కెళ్ళాలంటే, సరేనన్నాడు. అందుకని—

రేపు పొద్దుటే వాళ్ళని తీసుకువచ్చి, దీన్ని బయటికి తీయిం చాలి—అనిపించింది.

అతను వంగి, దాని బొరవేపు చూశాడు. ఇంకా జెలగ వేళ్ళాడుతూనే వుంది. జెలగ చిన్నపాటి రేలకాయలాగా వుంది. నల్లటి జెలగ, దాని శరీరంలోంచి చిన్న తొండంలా వేలాడుతోంది.

అతనికి బయల్దేరి, తన పనిమీద పోవాలనిపించింది. నీళ్ళ మీద వేసిన నిలవ వాసనకూ, చౌడు మట్టిమీది ఉక్క వాసనకూ, అతని ముక్కు లోపల చలనం వచ్చి, శ్వాసను తికమకలుపెట్టి—తుమ్మాడు ...తుమ్మి, బయల్దేరేందుకు వెనుకాడాడు. కాస్సేపాగి బయల్దేరుదా మనుకున్నాడు. ఆ ప్రదేశమంతా పాముల మయం.

రోజూ ఏదో వొకటి అతనికి ఎక్కడో చోట కనిపిస్తూనే వుంటుంది... బజారు తనను పామునుంచి కాపాడడం...నూతిలోనుంచి బజారు వదిలిన పాము...

—తను కదలగానే, దున్నపోతు తనను పరీక్షగా చూస్తూన్నట్టు అనిపించింది. దాని తల తన వేపు బాగా నిగిడ్చి పెట్టి, పరిశీలిస్తున్నట్టు కనబడింది.

అతను అన్నాడు: "లేదు. రేప్పొద్దున్నే పాలేర్లను తీసుకొస్తాను. తప్పకుండా తీసుకొస్తాను. నన్ను నమ్ము; నేను రాఘవయ్యను. ఈ ప్రాంతానికి నేను పాలకుడిని. నాయకులకు నాయకుడివి. నన్నంతా నమ్ముతారు...ఏనాడు ఏ జన్మలో ఎవళ్ళనిలా అవస్థపెట్టావో, అనుభవించు."

దున్నపోతు కళ్ళను వొకసారి పూర్తిగా మూసి, పూర్తిగా తెరిచింది. తర్వాత నెమ్మదిగా కళ్ళు ముడుచుకున్నాయి. అతను మాట్లాడుతోంటే. తలను ఆడించింది, ఉండి ఉండి.

"....భయపడకు. ఇప్పటికయినా కనిపించావు. లేకపోతే, ఇలా నిలబడే ప్రాణాల్నొదలుద్దువు."

ఈ సారి అది శరీరం కదల్చలేదు. చూపు అతనిమీదే వుంది.

రాఘవులు నేలమీద పడవేసిన చెప్పుల్నీ, కత్తినీ తీసుకుని, వాటి కంటిన ఇసుకను దులిపి, వెనక్కి తిరిగి వెళ్ళబోతున్నాడు. దాని, మూలుగు వినిపించింది, నడక సవ్వడి మధ్య. దాని మెడా, తలా, కిందికి; వూబి మట్టిమీదకు వంగాయి. వెనక్కి తిరిగి చూసి, రాఘవులు ఆగిపోయాడు. రెండు అడుగులు వెనక్కి వచ్చి, చూసి; అది నీరసంకొద్దీ అలా తల వంచిందనిపించిన తర్వాత మళ్ళీ కదిలాడు.

అతను కాలవ మరో వేపు గట్టు ఎక్కాడు. గట్టుమీద వొత్తుగా గరిక మొలుస్తోంది. గరిక చివర్లు సూదుల్లా వున్నాయి. వో పక్క చిన్న చీపురుదుబ్బులోంచి, 'గుర్రు గుర్రు' మని, తర్వాత రెక్కలు పెద్దగా తాటించుకుంటూ, పూరేడు పిట్ట అతను వస్తున్న అలికిడికి లేచిపోయింది. అది పోయినవేపు, అతను, హఠాత్తుగా

వినవచ్చిన శబ్దానికి నిలబడిపోయి, చూస్తోంటే.—మళ్ళీ అదే చోటునుంచి ఇంకో పూరేడు దానిలాగే ఎగిరిపోయింది. వెంటనే కదల్లేకపోయాడు అతను. బిగబట్టింది ప్రాణం. పరిశీలనగా చూడాలనుకున్నాడు ముందు వెనుకలు. ఈ వేపు అతను ఎప్పుడూ ఎక్కువగా రాడు. పూర్వం ఈ ప్రాంతంలో ఖూనీలు దొమ్మీగా జరిగేవని ప్రతీతి. అతను తన కెదురుగా ముందుకు నడుస్తోంటే, రెండో అడుగు కింద పడబోయేసరికి ఊసరవెల్లి - కనిపించింది. అతని గొంతుకు తెమడ అడ్డుపడింది - పొడిగా. తమాయించుకుని సకిలించాడు. అది అక్కడే కదలకుండా నిలబడి వెనక్కి, ముందుకీ వూగుతోంది. అది అలా వూగడం చూసి, అతనికి అంత బెరుకుదనంలోనూ నవ్వు వచ్చింది. అతని వొళ్ళంతా దాన్ని చూస్తూ, భయంగా, ఒకేసారి గార దేలిపోయింది. అతను వెనక్కి తగ్గి, చెప్పుల్ని నేలమీద వదిలి, తొడుక్కున్నాడు. కుడికాలి వుంగరం మామూలుగా బిగుతుగా పట్టింది. గొబ్బి మండలకోసం, నిలబడ్డ చోటినుంచి కళ్ళతో వెతికాడు; ఊసరవెల్లిని తప్పించుకుని దూరంగా నిలబడి. కళ్ళలోనుంచి చూపులు సెర్చిలైటు వెలుగులా తిరుగుతున్నాయి, ఆ చుట్టుపక్కల పొదలన్నీ చూస్తున్నాడు....తొందరగా వచ్చిన పని చక్కబెట్టుకుని, మరుక్షణం ఈ ప్రదేశాన్ని వదలి పోవాలని. దూరంగా ఒక నక్క, పొదలమధ్యనుంచి, ముందు వెనుకలు చూసుకుంటూ పోతోంది. దానిని చూడగానే రాఘవులికి తలమీద అక్కడక్కడా వున్న వెంట్రుకలు నిక్కబొడుచుకున్నాయి. నక్కను చూడగానే అతనికి తలంతా జివ్వుమంటుంది. అలా అవడం, నక్కల్ని గురించి చిన్నప్పుడు కుర్రాళ్ళుగా చెప్పుకున్న భయంవేసే కథలేనని అతను సరిపుచ్చుకున్నాడు.

అతను ఇంకా కొంచెం లోపలికి నడిచాడు. గడ్డి జివ్వుమంటోంది. గడ్డిలోనుంచి మోకాళ్ళమీదికి గడ్డి పురుగులు లేస్తున్నాయి. గొబ్బిమండలు కనిపించడం లేదు. ఒక డొంక ముందు ఎవళ్ళో పొద్దుట వచ్చి, నరుక్కెళ్ళినట్టు, పచ్చిగా నరుకుడు కనిపిస్తోంది. ఎదురుగా డొంకనిండా గండు పిచ్చుకలు ఆకులు కనబడకుండా కూచున్నాయి - ఏదో సభచేస్తున్నట్టు, సంతాప సభలాగా.

అతను వాటిని బెదరగొట్టాడు. రెండు మూడు లేచాయి, పిరికివి. మిగతావి లేవడం లేదు. మళ్ళీ బెదిరించడానికి అతనికి ధైర్యం చాల లేదు. బలహీనమైన ప్రాణులమీద అధిక్యం చూపెడుతున్నాననే సంకోచంవల్ల - అగ్గిపుల్లకున్నమందు అంటుకుని వెంటనే ఆరిపోయినట్టు. అవి అన్నీ చిన్న చిన్న కళ్ళతో అతనివంక చూస్తున్నాయి. అతను నడుస్తోంటే, చెప్పు పక్కనుంచి దూరి, తేలు కొండికాయ గుచ్చుకుంది దాన్ని వూడదీసి. విసురుగా, కసిగా, గిరాటేశాడు పిచ్చుక పొదలవేపు.

“ఈ ప్రాంతం కొత్త.” అనుకున్నాడు.

పిచ్చుకలవేపు అతను చూసేందుకు జంకాడు. తను విసిరిన తేలు కొండికాయ మాత్రానికి అవి లేవవని అతను అనుకున్నాడు.

దూరంగా శాఖోపశాఖలుగా విస్తరించుకున్న మర్రిచెట్టుమీద కొండ ముచ్చులు. మర్రిచెట్టును చూడగానే, దాని శాఖలు కనిపించగానే రాఘవులికి రాజ్యాంగ యంత్రం జ్ఞాపకం వచ్చింది. ఎన్నో వూడలు భూమిలోకి దిగినాయి. దానినిండా తేనెపట్లు, పెద్ద పెద్ద తెరలు. ఇంకా ముందుకు నడవాలని లేదు రాఘవులికి. ఇంకా ముందుకు నడిస్తే, గడ్డీ కోపిరి దుబ్బులూ, చీపురూ, కాళ్ళకు అడ్డు పడతాయి. ఎగుడు దిగుళ్ళు కనిపిస్తోంది ముందంతా. కాలు దేనిమీద వేస్తున్నట్టో కూడా తెలియడం లేదు. ఇంకా లోపలికి వెళ్ళాలనిపించడం లేదు. కాలవ గట్టు పక్కనే వుంటాయి గొబ్బిమండలు. అంచేత వెనక్కి తిరిగి జాగ్రత్తగా వెళ్ళి. అక్కడక్కడే వెతకాలనుకున్నాడు. తను ఇంతలోపలికంటా రావడం అనవసరమనుకున్నాడు.

అడవి కాలుతున్న వాసన వేసింది. పచ్చిదనం వుడుకుతూ మండుతూ వున్న వాసన. ఇంకా జాగ్రత్తగా నిలబడి పరిశీలిస్తే, మందలుగా ఏవో పరుగెత్తి ఇంకోవైపుకు పోతున్నట్టు కూడా తోచిందతనికి. అకస్మాత్తుగా అతని ఆలోచన మేలుకుని, వుట్టినే అక్కడ నిలబడుతున్నట్టు హెచ్చరించింది. అతని నెత్తిమీదనుంచి పకిలపిట్ట రివ్వుమంటూ దూసుకుపోయింది - వోడిసెలరాయిలాగా. మైకం నిండుతున్న కళ్ళలోంచి, దారిని చూసుకుంటూ నడవాలని

తన్ను తాను హెచ్చరించుకున్నాడు. కుడిచేతికున్న సన్నటి బంగారపు గట్టి కడియం, అతను చేతిని పైకెత్తితే వెనక్కి జారింది.

....బద్ధకంగా వుంది. అతనికి అలసటగా వున్నట్టు అనిపించింది. కాస్సేపు నిద్రపోవాలనిపించింది. మందల్ని నరికిన తర్వాత, పొలాన పాకలో మంచం వుంది...పక్క కూడా మెత్తగానే వుంటుంది...హాయిగా వొళ్ళు మరచి నిద్రపోవాలి - అనుకున్నాడు. గొబ్బిమందలు కనుపించాయి. చిన్నవి, సన్నగా వున్నాయి. చివుళ్ళు పడుతున్నాయి, అవి, బాగాలేవనిపించింది. పెద్ద వేవయినా ఆ చుట్టు పక్కలే ఎక్కడయినా వెతికితే వుండవచ్చునేమో ననిపించింది పొదలో పూరేడు కూస్తున్నచప్పుడు. పాములు పూరేళ్ళు కూస్తున్నట్టు కూసి, పూరేళ్ళను దగ్గరకంటూరానిచ్చి, పట్టుకుని తినేస్తాయి పొద పాములు. రాఘవులికి, ఆ కూస్తున్నది పూరేడో, పామో అంతుపట్టక, పొదచుట్టూ తిరిగాడు...తన కాళ్ల అలికిడికి కూత ఆగిపోయింది. ఆ రెండిటిలో ఏ దయి వుంటుందో!

"నేను కూడా భయపడుతున్నాను! !" అనుకున్నాడు.

పొదపక్కన, రెండు ముదురుపాటి మందలు, లోపలికంటూ తీగల్లో అల్లుకుని కనిపిస్తున్నాయి. పొదమీదికంటూ ఎక్కాలి వాటి కోసం. పుల్లచీమలు. ఎర్రటివి, పెద్దవి. తీగలమీదకు పాకుతున్నాయి. అవి పాకుతోంటే మాట్లాడుకుంటున్నట్టున్న ధ్వని.

...పోనీ ఏ సాయంత్రమో, రేపు పొద్దుటో, ఎవర్నో పంపి మందల్ని తెప్పించుకుందామనుకున్నాడు. పండుగ వేడుకకి పిల్లలు సరదాపడి తెచ్చి పెట్టమంటే, తన ప్రయాస ఇదంతా. ఇటువేపు బాగా పరిచయమున్న వాళ్ళయితే, వాటి అను తెలుసుకుని, వెంటనే వరుక్కు రాగలరు...రాఘవులకి వెనక్కి తిరిగి పోవాలనిపించింది. అతను వెనక్కి తిరిగాడు.

....ఇంట్లో చాలా సందడిగా వుంటుంది. ఉద్యోగాలు చేసుకుంటోన్న ఇంటి అల్లుళ్లు బహుప్రయత్నంమీద తీసుకొస్తే వచ్చారు. చూడగా, వాళ్ళే సుఖపడుతున్నట్టు కనిపిస్తున్నారు తనకంటే, తనూ ఉద్యోగం చెయ్యాల్సింది. నీడపట్టున బ్రతికి వుండేవాడు. జీవితం బావుండును. ప్రమీల సుఖపడును. ఆధునిక సుఖాన్ని. పద్ధతుల్ని

అనుభవించగలుగును. మరో రకం సంఘంలో ఐక్యమయిపోను. ఆమెకసలు అటువంటివి చాలా తెలియవు. బ్రతికే వొక్క బ్రతుకులో ఆమెకు తను భర్తగా ఏ మాత్రమో ప్రపంచాన్ని చూపి, దాని వోకదల్ని తెలియజెప్పకుండానే. —ఇంక కొన్నాళ్ళలో ఆమెలో ఉత్సాహం చచ్చిపోతుంది.......కాని—

ఆ వాతావరణంలో బ్రతకాలంటే తను అందరిలా ఒకళ్ళ కింద బ్రతకాలి. ఒకళ్ళ కోపతాపాన్ని జీవితంలో ముఖ్యమైన ధ్యాసగా పెట్టుకుని. భయపడుతూ కూర్చోవాలి. ప్రకృతిలో పురుములూ. ప్రకృతిలో వేడీ। జీవితాన్ని గడుపుకునేందుకు నెలసరి సామాన్య భత్యాన్ని పుచ్చుకుంటూ. ఆ ఇచ్చే వాడి హావభావాలికీ. కోపానికీ గురవుతూ. దయకీ ఎదురుచూస్తూ బ్రతకాలి. ఒక సామాన్య మానవుడికి. బ్రతకలేని తనంతో భయపడడం। ఏ మాత్రం స్వతంత్రము లేకుండా. ఆ అన్నదాత ఆలోచనలు తన ఆలోచనలుగా. ఆ మహామహుని అభివృద్ధి తన అభివృద్ధిగా జీవించడం। కనిపించినప్పుడల్లా. మనస్సులో అనిష్టమయిన చేతులెత్తి నమస్కారం చెయ్యాలి. అచ్చుయంత్రం. చక్రం తిప్పి వదిలే. కాగితాలమీద అక్షరాల్ని వొత్తి ఇచ్చినట్లు - చైతన్యంలేని యంత్రపు బ్రతుకు। తను ఉద్యోగంలో ఇంత విలువయిన జీవితాన్ని బ్రతకాలి. తన్ను గురించి తను తెలుసుకోగలిగిన మహోత్తమ మానవజీవి బ్రతుకును అనుభవించడం ఇలాగా। అయినా ఉత్తమమైన బ్రతుకు కోసం తను ఎన్నో ప్రయత్నాలు చేశాడు. ఏది ఉత్తమైనది? ఏది కాదు?

ప్రపంచంలో ఎన్నో దేశాలు. అన్ని దేశాల్నిండా ఒకే మాదిరి అవయవాలూ. ఒకేరకం కోరికలూ కలిగిన మనుష్యులు. అందరూ. ఆనందంగా. సంతృప్తిగా బ్రతకాలని. అనేక సిద్ధాంతాల్ని చేసుకుని. వినాదాలతో కొట్టుకు చస్తున్నారు. సామాన్య ప్రజలు గొర్రెలు. వినాదాలు అరుస్తున్నవాళ్ళు గొర్రెల కాపలాగాళ్ళు. గొర్రెల మీదా గొర్రెల ఆజమాయిషీగాళ్ళ మీదా అధికారం చెలాయించే పైవాళ్ళున్నారు. వాళ్ళు స్వార్థపరులు। దేశం నిండా ఎన్నో రాష్ట్రాలు. రాష్ట్రం నిండా ఎన్నో సమస్యలు।। మనిషి నాగరికత తెలిసిననాటినుంచి. సుఖజీవితం కోసమని చేసిన మహా ప్రయ

త్నాల్లో పేర్లు మారుతున్నాయి; సుఖజీవితం మాత్రం లభ్యం కావటం లేదు. తను —

అందరు ప్రాంతీయ సమకాలీన విద్యావంతుల్లాగా రాజధానిలో డిగ్రీ కాగితం పుచ్చుకుని, అన్ని ప్రజోపయోగం కోసం యేర్పడిన రంగాలూ, వాటి కార్యాలయాలూ చూశాడు - అందరిలాగా జీవితాన్ని గడుపుదామని. రెండు సంవత్సరాలు గుమాస్తా వుద్యోగం కోసం తిరిగాడు - అన్ని ఆఫీసుల చుట్టూ - పైరవేటూ, పబ్లిక్కూ. ఆ ఆఫీసులూ, ఆ మనుష్యులూ, ఉద్యోగాలిచ్చే సంస్థ అన్న చోట సంవత్సరం కాపలా కాశాడు. ఆ బోధి వృక్షం క్రింద తనకు జ్ఞానోదయమే అయింది.... ఉద్యోగం రాలేదు. ఇంటి దగ్గర నుంచి డబ్బు తొందరగా రాకపోవడం... తిండిలేని పూటలు. ఒక్కపూటే తిన్న రోజులు. టీ డికాషనుతో గడిపిన రోజులు. ప్రజా ప్రతినిధులు. ప్రజా నాయకులు అనబడే వాళ్ళవెంటబడ్డం, సమర్థులు కలిగిన బ్రతుకును అనే సిద్ధాంతం ప్రకారం, వాళ్ళ వాళ్ళ ప్రభావాల్తో, శక్తియుక్తులతో కావాలన్నది సాధించుకోవడం. సార్వభౌముల ఉత్తరాలు ఫర్మానాలు, ఆదేశాలు. కారులో చక్రవర్తుల్ని వెంట దీసుకుని వెళ్ళే వాళ్లూ, డబ్బు యిచ్చి ఆ మహాయంత్రాంగంలో చేరిపోయేవాళ్లూ...

ఇవన్నీ లేకుండా తన డిగ్రీ కాగితంతో ఒక జీవనోపాధిని సంపాదించగలననుకున్నాడు రాఘవులు. చివ్వరివరకు అరటిపళ్ళు కొనుక్కుతింటూ అభిమానం తెచ్చుకుని సమర్థత లేనివాణ్ని - అనుకున్నాడు. కళ్ళంట నీళ్ళు సుడి తిరిగాయి. అతను అభిమానంతో ముక్కు లెగరేశాడు. పెదవులు నీరసంతో వణికాయి. పక్కనో దున్నపోతు తను తింటున్న అరటిపండు వేపు (ఇటువంటి దున్నపోతు కాదది. బాగా తారు రోడ్లంట, సిమ్మెంటు రోడ్లంట తిరిగి, ఆత్మస్థైర్యం వచ్చిన దున్నపోతు. దానికి బ్రతుకు విలువే తెలియదు. కనీసం దీనికి మందలో కలిసి, బ్రతకడం తెలుసు) చూస్తోంది. తను ఒక పండు గిరాటు వేశాడు (తనకలా ఎవరూ ఒక ఎంగిలి జీవనాధారమయినా చూపలేదు) ఉండబట్టలేక గట్టిగా ఏడ్చాడు. దారే పోతున్న వాళ్ళు, ఆకలేసో, ఏదో పోగొట్టుకునో ఏడుస్తున్నాడను

కున్నారు. తన్ను చవట అనుకున్నారు. కాని, ఇవ్వాళ తను టాపు లేని కారుమీద పోతోంటే, ఆ ఆలోచనలు లేని మొద్దుబారిన ప్రాణు లన్నీ పువ్వులు కురిపిస్తాయి తన మీద. దానివల్ల వాళ్ళకొచ్చేదేమీ లేదు. తన దయార్ద్రపు చూపుతో బ్రతకాలని. మరొకళ్ళ మీద ఆధార పడి జీవించే ప్రాణులు!! వ్యక్తిత్వం లేనివాళ్ళు! తమ చేతకాని తనంతో ప్రభుత్వాన్ని తిట్టే వాళ్ళు!

డిగ్రీ కాగితాన్ని చించి, అజ్ఞానాన్ని తుడిచిపెట్టినట్టు నేల రాచాడు తను. ఉద్రేకమే కావొచ్చు-అది. పిచ్చి యెత్తిందను కున్నారు అక్కడున్న ఇద్దరు. సరాసరి ఇంటికొచ్చి—

"నాకు వుద్యోగం చెయ్యడం ఇష్టం లేదు. కావలిస్తే నేనే వుద్యోగాలు వేయిస్తాను. దున్నపోతు బ్రతుకు బ్రతకడం అంటే వుద్యోగం చెయ్యడం" అన్నాడు.

రాఘవులు తండ్రి కొడుకు ప్రయత్నాలు విఫలమై మాట్లాడు తున్న ధోరణిని, విని, నవ్వాడు ఆయన శాపీ స్వభావం మనిషి. తన కొడుకు ఉక్రోషపడుతున్నాడనుకున్నాడు.

"సరే-నేను రేపు మన ఎమ్. ఎల్. ఏ. సూరన్నగారి దగ్గిర కెళుతున్నా. రమ్మని చాలసార్లు కబుర్లు చేస్తున్నాడు. నువ్వూ రా చెపు తాను" అన్నాడు.

రాఘవులికి, తన తలను నరికి అవతలిగా పెట్టి, తన మొండేన్ని.-"ఇప్పుడు తిన్నగా నడుపు నేచెప్పినట్టు" అన్నట్టు అయింది. ఆ స్వాభిమానంతోనే, ఇంటికి తన బాధలు తెలియజెయ్య కుండా అన్ని యాతనలు పడ్డానని గుర్తుకు తెచ్చుకున్నాడు. అతని మెదడులో అగ్నిలాంటి ప్రజ్వలనపు కలిగింది.

"ఒక ఎమ్. ఎల్. ఏ నాకు వుద్యోగం వేయించేదేమిటి-నేనే ఎమ్. ఎల్. ఏ. అయి వుద్యోగాలు వేయిస్తాను. ఎవళ్ళకన్నా కావ లిస్తే" అన్నాడు రాఘవులు.

"ఏమిటోయ్!!" అన్నాడాయన పెద్దగానవ్వుతూ.

ఆ తర్వాత—

రాఘవులు తన పడికట్టులోనే మార్పు తెచ్చుకోలనుకున్నాడు. తన వేషం, తన ప్రవర్తనా తన భావాలు ఫలించేవిగా ఉండాలను

కున్నాడు. మూడేళ్ళలో రాఘవులు ఆ వూరికి బాగా సన్నిహితు డయాడు. వ్యవసాయం మాట వస్తే ప్రతిరైతూ, పాలేరూ తాను సాధించింది నిదర్శనంగా తీసుకునేటట్టు చేశాడు. పొలం రాబడి హెచ్చింది. మూడేళ్ళలోనే. అతను పొలాలు వెళ్ళని రాత్రి పగలూ లేదు. భేష్ - అంటున్నారంతా. ఈ సారి తను కొత్తరకంగా వ్యవ సాయం ప్రారంభిస్తానన్నాడు. ఇంకా రాబడి పెరగడం అందరూ చూస్తున్నారు. నవ్వారు. మిల్లు కాలువ పక్కన పొలంలో బిగించారు. పదిహేను మంది కూలీలూ, ముగ్గురు అక్షరజ్ఞానం వున్నవాళ్ళూ పని చేస్తున్నారు. మూడు సంవత్సరాలనుంచి సమష్టి వ్యవసాయం ప్రారం భించాడు రాఘవయ్య. పనికి రావనుకున్న భూముల్ని కొనడం, సాగు చేయడం జరుగుతోంది.

తండ్రి ఇంటి దగ్గర కూర్చున్నాడు. రైసుమిల్లు చూస్తున్నాడు. కొడుకు చేసిన ఏ పనికి తప్పు అని అనడాయన.

ఉద్యోగం చేసి ఎవడు సంపాయించాడు? స్వేచ్ఛగా వ్యవ సాయం చేసి నేనింత సంపాయిస్తున్నాను'' అంటాడు రాఘవులు.

మినిస్టర్లది తప్పులేదు. ఎమ్. ఎల్. ఏ. లదీ తప్పు లేదు. ఎన్నుకున్నవాళ్ళు ఏవేవో పనులు చేసి పెట్టమంటారు. చేసి పెట్టక పోతే రేపటినుంచి వీళ్ళమీద విషప్రచారం చేస్తారు. మళ్ళీసారి వోడి స్తారు. మొహమాటంకొద్దీ. స్వార్థంకొద్దీ వాళ్ళు వీళ్ళ పనులు చేసి పెడుతూండాలి మరి...కాని మనవాళ్ళ దారి వేరు. 'గీత' పుట్టిన దేశం యిది అందులోనూ ప్రజా ప్రభుత్వమంటేనే అంత-అని మన వాళ్ళంతా అంటారులే. అసలు బ్రతిరుగుడుతనమంతా ప్రజల్లో వుందంటాను నేను...'' రాఘవులు నిట్టూరుస్తాడు. రాఘవులు ఆ వినేవాళ్ళకు అర్థం కాడు. కాని రాఘవులు మాత్రం ఏదో విధిసంకల్పం కొద్దీ ఈ వూళ్ళో తమ మధ్య పుట్టాడని, లోలోపల అనుకుంటూంటారు. ఆ వూళ్ళోవాళ్ళు చాలామంది.

తనలో, భావాలకు పూర్తిగా రూపం ఇవ్వగలిగిన శక్తిలేదను కున్నాడు రాఘవులు. మాట్లాడేప్పుడు కూడా తను ప్రత్యక్షాన్ని గురించి ఆలోచించడంతో, చెప్పవలసిందల్లా మరుగున పడిపోతున్నట్టని పిస్తుంది. తను 'వక్త' కాకపోవడం గురుకు తెచ్చుకుని, వెలితి

పడతాడు. కాని, తను ప్రజల్ని ఆకర్షించగలడు. తన మాటలు తూగితూగి మరీ వాళ్ళకు నచ్చ జెపుతాయి. తను కార్యవాది

—కాలవకు అటువేపు నిలబడ్డ రాఘవులు, చేతనున్న కత్తితో, నిటారుగా పెరిగిన అల్లికర్రను, బారెడు పొడవుండేలా నరికి, కాండ్రేగి ముళ్ళ మధ్యనుంచి తప్పిస్తూ దాన్ని బయటకు లాగేడు, ఏమాత్రం వంపులేకుండా, చువ్వలా పెరిగిందని, చివర్న తెగవేశాడు. గుబురంతా లేతగా తెగింది. కమ్చీకర్రకు పనికొస్తుంది.

....పూసరవెల్లి వుండి వుండి జ్ఞాపకాన్నికొచ్చిం దతనికి అది ఎదురుగా పడుకున్నట్టూ, దారి మధ్యవుండి వూగిసలాడు తున్నట్టూ.

అతను పొడిగా దగ్గి, అటువేపుగట్టుమీదనుంచి కాలువలోకి దిగాడు. అక్కడ పూర్వం 'డాము' కట్టడం మూలాన, కాలవంతా బాగా వెడల్పు అయి, మెరకపోసి వుంది. రాఘవులు దిగుతూ, అప్రయత్నంగా దున్నపోతు వేపు చూశాడు...తలమట్టి మీదకు వంచి, ఇందాకటిలానేవుంది. కదలడంలేదు ఏమాత్రంకూడా. చచ్చిపోయి వుంటుందనిపించింది. అతని కళ్ళు చికిలించాయి. గొడ్డుజాతి అంత తొందరగా చచ్చిపోతుందా అని సందేహం తోచింది. కాళ్ళు కదుల్చు కోడానికికూడా అనుకూల్యం లేకుండా నిలబడితే చావడం ఏమంత విశేషంకా దనిపించింది. మళ్ళీ రాఘవులకి. దాని దగ్గరకు....దాని వేపు వెళ్ళాలనిపించింది.

అతని కాళ్ళక్రింద గులకరాళ్ళు 'జవ్వు జవ్వు' మంటున్నాయి. చెప్పులు తీయకుండా నడుస్తున్నాడు తడిపొడి ఇసుకమీద. దున్నపోతు చచ్చిపోయి వుంటుందనుకున్నాడు....ఇందాక తను వూబిచుట్టు తిరిగిన చోట పాదాల ఆనమాళ్ళు వున్నాయి...తనువచ్చిన చప్పుడు విని దున్నపోతు కదలడంలేదు. చచ్చిపోయిందా? అతనికి గొంతు లోనూ, జాలి ఉట్టబయలయే చోట్లలోనూ రక్తం వొక్కసారిగా పొంగి, గొంతును పూడ్చేసింది అతలపుతో. గొంతులో నొప్పి పుట్టింది; దగ్గాడు.

...ఇంత సేపూ దానిలో కదలికలేదు. చచ్చిపోయి వుండాలి. అలా అనుకోగానే, మళ్ళీ అతనిలో బాధ కలిగింది. కంఠం మళ్ళీ

పూడుకుపోయింది. ''ఏయ్య'' అనబోయాడు గొంతు పెగుల్చుకుని. గొంతు నొప్పి పెట్టింది 'ఏయ్య' అనలేకపోయాడు. గాద్గద్యం వచ్చింది.

....అనవసరంగా విరాళపడి చచ్చిపోయింది. రేపొద్దుటికి బయటికి తీయించేవాడు తను. తన వొక్కడివల్ల అయ్యే పనికాదది. తను వొక్కడే ఇంత జంతువును బయటకు లాగలేడు. ఎలాగోలా వుపాయంచేసి తను తీయించేవాడు .... ఎంతలో చచ్చిపోయింది! తన్ని చూసిన తర్వాత, తాను పలకరించి, పట్టించుకోక పోవడంచూసి చచ్చిపోయి వుంటుంది! .... అది కదలడంలేదు. ఎప్పుడో తాను ప్రమాణం చేసుకున్నాడు—అనాధజీవుల్ని, నిస్సహాయ ప్రాణుల్ని తన జీవితాన్నయినాసరే అడ్డువేసి కాపాడతాను—అని. తను ఏమాత్రం ఉపేక్షించలేదు. ఇది తనకి సమయంకాదు—రక్షించే టందుకు....మళ్ళీ—

గొంతు పెగుల్చుకుని అతను దాని భాషలో అరిచాడు. దున్నపోతు కదలలేదు. అతను పరీక్షగా చూశాడు,....ఎంతో పరీక్షగా. దానికి శ్వాస ఆడుతున్నట్టు వినిపించింది, 'హమ్మయ్య' అనుకున్నాడు. తీర్థంలో తప్పిపోయిన పిల్లాడు హఠాత్తుగా దొరికిన తర్వాతలాగా. మెడ ఎత్తి వుంచడం మూలాన నొప్పులు పుట్టి, వోపికలేక అలా వంచుకున్నదనిపించింది. అయినా మళ్ళీ అనుమానం వేసింది. మళ్ళీ అతను 'ఏయ్య' అన్నాడు. ఈసారి దాని చెవులు బహుకొద్దిగా కదిలాయి.. బ్రతికివుంది!!!! కాని, మెడ కదల్చడం లేదు...నల్లటి కాకి దానిమీదుగా తిరుగుతోంది, మరో బూడిదరంగు కాకికూడా వచ్చింది, దాని చట్టమీద పుండును రుచి చూడాలని రెండూ వచ్చి, అనువుగా వాలాలని దానిచట్టూ తిరుగుతున్నాయి. రాఘవులు కిందికి వంగి, రెండు రాళ్ళు పుచ్చుకుని ఆదుర్దాగా విసిరాడు. బూడిదరంగు కాకి రెక్కకు ఒకరాయి తగిలింది. రెండూ అరుస్తూ, పైకంటా ఎగిరి, గాలిలో తేలిపోతూ, ఊరు వేపు పోయాయి. అతను చేతి నంటిన మట్టిని దులుపుకున్నాడు.

...ఈ పూట దున్నపోతును బయటికి తియ్యకపోతే, దాని ప్రాణం పోతుంది. దాని ప్రాణం ఒక విధంగా తన చేతిలో వుంది.

ఒకసారి ఇలాగే ఎవరిదో ఆవుపెయ్య నూతిలో పడింది. ఇరుకు నుయ్యి. ఆ నూతిలోనే ఒక తాచుపాముకూడా పడింది. ఎవరొచ్చి ఏమీ చెయ్యలేకపోయారు, తను పురమాయించాడు ఇద్దరు ఈత గాళ్ళను. అయినా వాళ్ళు సాహసం చెయ్యలేకపోతున్నారు. తనే దిగబోయాడు, "వొద్దు రాఘవయ్యగారూ" అన్నాడు బజారు. వాడు దూకాడు. ఆవుపెయ్య నడుముకు తాళ్ళు కట్టారు. దాని కాళ్ళు గోడకు కొట్టుకోకుండా. దగ్గరికి బిగలాగి కట్టాడు. నూతిమీద తాడివి అడ్డు వేసి. అందరూ పట్టి, ఆవును బైటికి లాగేశారు. బజారు, తాచు పాము గొంతు పుచ్చుకుని, వొడుపుగా బయటికి తెచ్చి, వదిలాడు. దాని కంగారులో అది, మళ్ళీ నూతిలో పడింది. ఆవు పెయ్యను వేలంపాట పెట్టాడు తను. అది మరో వూరు వాళ్ళది. తన సమితి ప్రాంతంలో వూరుకాదది....

.. ఇది జంతువయింది. ఇదే మనిషి అయితే, తన్ను చూసి ఎన్నో ప్రార్థనలు చేసేవాడు. తీసి బొమ్మనీ, ఆజన్మాంతం పాదసేవ చేస్తాననీ అనేవాడు. బొట బొటా కన్నీరు కారుస్తూ, పీకలోకి వూబిలో హృదయ విదారకంగా కనుపించేవాడు.

....ఇదే వొక ఆవుపెయ్య అయివుంటే—దాన్ని ఈ స్థితిలో చూసి, బయటికి తియ్యకపోతే బ్రహ్మహత్య చేసినట్టు అవుతుంది. దాన్ని అలా కష్టంలో వదిలిపోగూడదు. అలా అయితే పుట్టగతు లుండవు....ఆవుకీ దీః కీ తేడా యేమిటి? అదీ పశువే, ఇదీ పశువే. ఎద్దయితే తీసేవాడేమో తను? ఇది మాత్రం ఎద్దు చేసేటంత పని చెయ్యడం లేదా? దీనిదికూడా ఆ జాతే, అమెరికా వాళ్ళూ, ఆఫ్రికా వాళ్ళూలాగా—ఈ రెండు జాతులూ మరి వాళ్ళూ వీళ్ళూ సమానమని ఋజువు చేసుకోలేదా?

....తను దీన్ని తీసే శ్రమనుంచి తప్పించుకునేటందుకు, దున్నపోతును నీచమైన జంతువుగా లెక్కపెడుతున్నాడు. ఒక ప్రాణం! ప్రాణం! జీవి! ...దీన్ని బయటికి తీస్తే....అంతే...దీన్ని బయటికి తీస్తే!! దీన్ని బయటికి తియ్యాలి. కాని, ఇవ్వాళ్ళ ఎవ్వరూ దొరకరు. పొలాల్లో చుట్టుపక్కల ప్రాంతాల్లో ఎవళ్లూ లేరు. తనొక్కడే పొలంలో వున్నవాడు ఈ రోజున, ఈ పండుగ

రోజున. అదయినా గొబ్బి మండలకోసమని ఈ దారిన వచ్చాడు. ఇది కనిపించింది ఎదురుగా....ఇదెందుకు కనిపించింది? ఒకవేళ తనవల్లనే ఇది తియ్యబడాలేమో? పండుగ రోజున ఒక జీవిని బ్రతికిస్తే?....రేపటికయితే ఇది చచ్చిపోతుంది. తీస్తే ఈ రోజే బయటికి తియ్యాలి. ఎవరు వస్తారు? వూరువూరంతా, తిని తాగి ఆనందంలో తేలిపోతోంది. కోడి పందాలు వూరికి మైలుదూరం తూర్పున. అక్కడికి వెళ్ళి వాళ్ళను తీసుకొచ్చే సరికి పొద్దు ఏమంత వుండదు. జీపుమీద ప్రయాణంకాదిది. తను వొక్కడివల్లా సాధ్యం కాదు. పోనీ ప్రయత్నించి చూస్తే? మనిషి అయితే తనలా వదిలి పోడు. మనిషి తన బాధను చెప్పి, పరిస్థితిని అర్థమయేలా చేయ గలడు. మరో ఆవో ఎద్దో అయినా తను వెళ్ళిపోడు గదా? ఇది దున్నపోతు. జడత్వానికీ, మూర్ఖత్వానికీ చిహ్నం. దీన్ని పూజించ మనలేదు ఏ శాస్త్రమూ, నల్లగా వుంటుందని. ఇదంటే అసహ్యం. మడ్డిగా వుంటుందని, బురదలో దొర్లుతుందని అయిష్టం. వెధవల్ని, వికృతుల్ని. మరీ హీనంగా తిట్టదల్చుకున్న వాళ్ళను; దున్నపోతు వెధవా అనేందుకు చక్కటి ఉపమానం. కాని, ఒక ప్రాణం. బ్రతికివున్నంత కాలం మాత్రం దీనిచేత సేవ చేయించుకుంటారు. పెంపుడు జంతువు ఇది నాగలి లాగడానికి పనికొస్తుంది. బండి లాగు తుంది. ఎద్దు చేసే అన్ని పనులూ చేస్తుంది. మరి ఏమిటి ఆ తేడా?.... పరంపరాగతంగా పెద్ద వాళ్ళు దాన్ని అసహ్యించుకుంటూ రావడం వల్ల తనని సంక్రమించిన చిన్నచూపు—పూర్వం బ్రాహ్మణులనే వాళ్ళు పూజనీయులు....హరిజనులనబడే వాళ్ళు అంటరాని వాళ్ళు. తెల్లజాతి నల్లజాతిమీద అధికారం చెలాయించే వాళ్ళు. సాంఘిక వ్యవస్థ అర్థమయిన తర్వాత, పరిశీలన జరిగిన తర్వాత, మానవత్వం మేలుకున్న తర్వాత,—అన్ని విషయాల్లోనూ అందరికీ సమాన ప్రతిపత్తులు వచ్చాయి. ప్రపంచం సామ్యవాదాన్ని జీర్ణించు కుంటోంది...ఎద్దుకన్నా ఇది మాత్రం తీసిపోయిందేముంది? ఎద్దు చర్మంకంటే దీనిదే గట్టి చర్మం. దానికంటే ఇదే బాడవల్లో ఎక్కువ సేపు దున్నగలదు. ఇది ఎద్దుకంటే గొప్పదికాదా?....దానితో సమాన

మైనదయినా కాదా?...రాఘవులి మనస్సు కొన్ని క్షణాలపాటు ఆవే శంతో దున్నపోతును గురించి తర్కించింది.

"—దీన్ని ఎలాగయినా బయటికి లాగుతాను" అనుకున్నాడు.

దాన్ని బయటికి తీసి, పంచాయితీ సమితి ఆస్తిలో నమోదు చేయించాలనిపించింది అతనికి. ఒక బండి చేయించి; దున్నపోతునూ బండినీ ఒకదికిచ్చి, ఆ మనిషికి పోషణ కలుగజేయాలని ఆలోచన వచ్చింది. తమ వూరునుంచి, సమితి వూరుకు, ధాన్యం, అపరాలు బాగా ఎగుమతి అవుతున్నాయి. లేకపోతే ఎరువుల సీజనులో సమితి ఆపీసునుంచి ఆ బండిమీదే అందరికీ ఎరువుల్ని తోల వచ్చనిపించింది. దున్నపోతును అతను పరిశీలనగా చూస్తూ, మేపితే బాగా పనికి వస్తుందన్న నిర్ణయానికి వచ్చాడు. తలపంకించాడు ముందుకు. ఎవడయినా నాదీ అనివస్తే, పరాభవంచేసి పంపాలనిపించింది. తన మాటకు ఎవడూ ఎదురు చెప్పలేడన్న ధీమా కలిగింది.

....అది ఏం చేస్తోంది? ఇంకా తలవాంచుకునే వుంది. ఏదయినా ప్రార్థన చేస్తోందేమో! ఏమని ప్రార్థన చేస్తుంది? దానికి దేవుళ్ళ విగ్రహాలూ, గుడులూ, రాళ్ళలాగా, గుట్టల్లాగా కనిపిస్తాయి. దానికి రాతి విలువ, కుంకుమ పవిత్రత, పసుపు మహిమ, దేవాలయం అంటేనూ, ఏమీ....ఏమీ తెలియదు. యుగాలూ, సంవత్సరాలూ, క్షణాలూ, గడియారాలూ తెలియవు. అదిపడుతున్నది 'బాధ' అని అయినా తెలుసా?....'దాని భాషలో' ఈ బాధ పోగొట్టు సర్వేశ్వరా —అంటుందా?...ఏదో అంటుంది. దాని మొర దేవుడికి వినబడుతుందా? ఏమో!...దున్నపోతు మొరబెట్టడం విడ్డూరం! అంతే.... దున్నపోతుకు ఏమీ తెలియదు.

దున్నపోతు మొరపెట్టడ మేమిటి? ఏదో ఏనుగు జన్మాంతర విశేషంతో పద్యాలు చదివినదనే పురాణం. జంతువులు మాట్లాడుతాయని కథలు చెప్పుకునే రోజుల్లోది. కాని, వాటికి భావన లాంటిది వుంటుందేమో. చెట్లు కత్తితో నరుకుతోంటే కంగారు పడిపోతున్నట్లూ, సంగీతానికి వివశత్వం పొందినట్టూ కనుపించే ఈ రోజుల్లో దున్నపోతు ఎందుకు అటువంటి భావన పొందగూడదు! మరో జీవి

కల్పించి వప్పుడు. సహాయం చెయ్యమని ఒక రూపానికి అది తల వొంచి ఎందుకు మనవి చేలుకోగూడదు?....రూపం నిలబడేటంత సున్నితమైన మెదడు వుండదేమో. దాని నిర్మాణం వేరు. 'అంబా' అనడంతో కట్టడిపోతుంది దాని జిజ్ఞాస...

అయినా దాన్ని ఎలా తను రక్షించగలడు?....దీన్ని రక్షిస్తే ఒక వేళ తన భార్య సుఖప్రసవ మవుతుందేమో! లేకపోతే దీన్నిలా చూసి, ఈ స్థితిని లెక్కచెయ్యకుండా వెళ్ళిపోతే. దాని వుసురు, తన భార్య గర్భంలో మున్న పసికందుకు తగుల్తుందేమో! (అది తన భార్య కెందుకు తగల గూడదు? తను కర్త గనుక తనకెందుకు తగలగూడదు? ఏమిటో ఈ అనుమానాలు!) తను ఇప్పుడు ఈ దున్నపోతుకు ఏం చేయగలడు? ఏదో మాత్రం చేయాలి. అది తలను మాత్రం ఎత్తడం లేదు. కాని, ఒక ప్రాణిగా మాత్రం దాని బాధను తీర్చాలి తను. తను కంకణం కట్టుకున్న సిద్ధాంతాన్ని. ఈ దున్నపోతు స్థితి సవాలు చేస్తోంది.

ఆకాశం మీద మబ్బులు కదుల్తున్నాయి. ఒక దట్టమైన నల్లటి మబ్బు సూర్యుడికి అడ్డు నిలబడింది. నీడ పడింది. కాలవ నిండా. చల్లగాలి తిరిగింది. రాఘవులు చేతికి ఆ గాలి చలచల్లగా తగిలి, చేతిమీది వెంట్రుకలు గగుర్పొడిచాయి.

దున్నపోతు కదలడం లేదు. ఒక వేళ నెమ్మదిగా ప్రాణాల్ని విడుస్తో బిగుసుకుపోతూండే మోనన్న భయం పట్టుకుంది అతనికి. కత్తినీ, చెప్పుల్నీ, ఆల్లికర్రనూ అక్కడ పెట్టి, తలకు కండువా చుట్టుతున్నాడు. అతని అదుర్దాలో, ఉద్యోగాలు చేస్తున్న తమ ఇంటి అల్లుళ్ళు, ఈ పరిస్థితిలో వున్న దీన్ని చూస్తే, ఏమి చేద్దురు - అన్న ఆలోచన వచ్చింది. (ఎవళ్ళూ కూడా పట్టించుకోరనిపించింది)... వాళ్ళు అసలు పట్టించుకోరు. తను వీటి మధ్య తిరగడం మూలాన, తనకూ వీటికీ వున్న సంబంధం కొద్దీ, తనింత బాధపడుతున్నాడు గాని; వాళ్ళు పట్నపు జీవులవడం మూలాన, ఏమంత పట్టించుకోరని పించింది. పట్నాల్లో బిచ్చగాళ్ళు ధర్మం అని అరుస్తూనే రోడ్లమీద పుట్ పాత్ ల మీద ప్రాణాలు విడుస్తూంటారు (....ప్రజాస్వామ్యం తమకేమీ చెయ్యలేదనరు. తమ కేమాత్రం ప్రజాస్వామ్య సామ్య

వాదంలో సహసం క్తీ రాలేదనరు....పుట్టినే అలా ప్రాణాల్ని వదిలే స్తారు. గడ్డి పుట్టింది. గడ్డి చచ్చింది. కుక్కపిల్ల పుట్టింది. కుక్క పిల్ల చచ్చింది. మనిషి పుట్టాడు....పుట్టాడో లేదో...మనిషి చచ్చాడు.) అదొక సామాన్యమయిన సంగతి. ఆ మొద్దుబారిన మెదళ్ళకు. కాని పల్లెటూళ్ళో వూరంతా పోగుపడి చూస్తారు. ఆ మనిషిని గురించి చెప్పుకుంటారు కొన్నాళ్ళు. తమకూ అతనికీ చావుకూ గల సన్నిహితత్వం వాళ్ళకు తెలుసు. బ్రతుక్కి అటువంటి చోట విలువ ఎక్కువ. తోలుబొమ్మల జీవితం.పట్నపు బ్రతుకు అనిపించిం దతనికి!

...దున్నపోతు నిద్రబోతుందా? అలసిపోయి. మనిషి వొళ్లు తెలియకుండా నిద్రబోతున్నట్టు అదీ నిద్ర బోతుందేమో ఒకవేళ! సొమ్మసిలి తెలివి దప్పిందేమో! మెడలు నొప్పి చేసి. తలెత్తలేక అలా వుందో!

రాఘవులివి తెల్లటి బట్టలు. అతని వొళ్ళు చామన చాయ. కోల ముఖం, కోల ముక్కు. నీలి పెదవులు. అల్లికర్రలాంటిమనిషి. చేవగల బిల్లుడు కర్రలా నునుపు దేలిందతని శరీరం. అతని మెడ మీద తెల్లగా శోభి.

అతని వెనకవేపు అడుగు నీడ పడింది. అతను పొద్దువేపు చూశాడు. కుడిచేతి కడియాన్ని వెనక్కీ ముందుకూ లాక్కున్నాడు. ఏదో తోచి. అల్లికర్రను చేత్తో పట్టుకున్నాడు. ఆ కర్రతో వూబి లోతు కొలవాలని.

అతను గట్టిగా సకిలించాడు. పనికి వుపక్రమిస్తూ. పంచెను తొడమీదికంటా ఎగగట్టాడు. పంచె చెంగుల్ని నడుం చుట్టూ తిప్పి కట్టాడు. కండువా బట్టతల మీంచి జారిపోకుండా, తలంతా కప్పి, గట్టిగా చుట్టాడు. మళ్ళీ నిలబడి ఆలోచించాడు ...చేసిన ప్రయత్నం వృధా అయిపోతుందేమో! చచ్చిపోతుందేమో బయటికి తీసేటంతలో అయినా, తనొక్కడే బయటికి లాగలేదేమో!

ఊళ్ళోవాళ్ల జుట్టు పట్టుకోవడానికీ. సమితివాళ్ళను హడల గొట్టడానికీ, ఎమ్. ఎల్. ఏల్ని గుప్పిట్లో పెట్టుకోడానికీ. వున్నప్రజ్ఞ; దున్నపోతును బయటికి లాగడానికి లేకపోవడం అతనికి ఏదో

తోపంలా తోచింది. మరొకళ్ళ సహాయం లేకుండానే తనింత బలం సంపాయించాడు. ఆ ప్రాంతం అంతా తన ముందు తలను వంచుతుంది. గట్టిగా ఎదురు చెబితే హూంకరిస్తాడు-వస్తాదుల మనుకునే వాళ్ళను. దున్నపోతును తీయలేడా—తను! ఒక మనిషిలాంటి కళ్ళూ, ముక్కూ, చెవులూ, వొళ్ళూ, కాళ్ళూ వున్న జంతువు! .... అవతలి వేపున 'చావు' గేలం వేసుకుని కూర్చుంది. వలను విప్పుతోంది విసిరేందుకు. ఇవతలి వేపు తను. ఎవళ్ళు గెలుస్తారు?

"ఎలాగయినా దాన్ని రక్షించాలి."

అతను వూబిలో దిగాలని నిర్ణయించుకున్నాడు.

...దున్నపోతు నీటికి అలవాటు పడిన జీవి. మూడు రోజుల బట్టి, ఎండలో నిలబడడం మూలాన కొంత అయాసం వచ్చి వుంటుంది. తన కండువాను, కాలవ పాలిపోయిన వెల్లువలో తడపి, దాని ఒంటిమీద నీరుపిండి, చెమ్మగా చేస్తే కొంత పని చేస్తుందేమో ననిపించింది. చిన్నప్పుడు, కొంటె గిత్తదూడను బలంకొద్దీ తల మీద బాది, అది కళ్ళు మూసుకుపోయి గిరగిరా తిరుగుతూ పడిపోతోంటే చేసిన ఉపచారం జ్ఞాపకం వచ్చింది. అప్పటి కప్పుడు తట్టి, గిత్త చెవుల్ని మూశాడు తను గట్టిగా. అది నిలబడి, కాళ్ళమీద నిలబడలేక ముందుకు పడింది. నీళ్ళు తెచ్చి చెవుల్లోనూ, ముక్కులోనూ పోసి, దాని వొళ్ళంతా పట్టాడు. తర్వాత రెండు రోజులకు తేరుకుందది. తను రెండు రోజులు స్కూలుకు రానందుకు మాస్టరు అడిగితే, కారణాన్ని యథాతథంగా చెప్పాడు.

"....నువ్వు వ్యవసాయం చెయ్యడానికి పనికి వస్తావు" అన్నాడు. ఆయన మాట నిజమయింది.

రాఘవులికి నవ్వు వచ్చింది. ఈ క్షణంలో తనను యిలా చూస్తే తను బాగా తెలిసిన పెద్దవాళ్ళనబడే వాళ్ళంతా ఏమనుకుంటారు?

....తను వ్యవసాయదారు. వీటికి తనకూ, వాళ్ళకూ తనకూ కన్నా సన్నిహిత సంబంధం వుంది. ఇవి వుండి, తనకు తోడ్పడితేనే, ఆ పెద్దవాళ్ళనబడే వాళ్ళందరికీ పదవుల కోసం తన అండ కావాల్సి వచ్చింది—తన అభిమానం కోసం ఎదురు చూస్తున్నారు.

తనతో ఫోటోలు తీయించుకుంటున్నారు. తన చుట్టూ తిరుగుతున్నారు. తనను గురించి పెద్దవాడిగా, సమర్థుడిగా ప్రచారం చేస్తున్నారు. 'ప్రెస్సు రిపోర్టర్లు' పని పెట్టుకుని తన సమితి అంతా తిరుగుతూంటారు. ఇన్ని కారణాలకు మూలం—

ఈ దున్నపోతు. దీని సంతతి. దీని జాతి.

....పని చేయించుకున్నంతసేపూ చేయించుకుని ప్రపంచం మీదికి గడ్డి తిని ప్రాణాల్ని పోషించుకుంటూ రమ్మని వదిలేస్తే. సాయంత్రం మళ్ళీ వొచ్చి రైతు చూట్టూ తిరుగుతుంది. దీనివల్ల వ్యవసాయాభివృద్ధి....పాడిపంటలు....అన్నీ. నీళ్ళు తాగేందుకనో ఎండవేడిమి భరించలేక నీళ్ళలో నిండుగా పడి మునగాలనో, దిగి నిస్సహాయంగా దిగబడి పోయిన పెంపుడు జంతువు. ఇదే వొక ....పెద్ద ఇంటి వాళ్ళ పెంపుడుకుక్క అయితే. వెంటనే రెండు మూడు వందలు ఖర్చు అయినా జంకకుండా దీనిని బయటకు తీయించే వాళ్ళు....తను దీనికి తప్పకుండా సహాయం చేయాలి. దీన్ని ఇంతటి దీనావస్థలోంచి బయటికి లాగాలి. తనకొక కథ జ్ఞాపకం....ఆంద్రోక్లేసు అనే ఒక బానిస యువకుడు....సింహాన్ని కాపాడడం, తిరిగి సింహం అతన్ని కాపాడడం. అది జరిగి వుంటుందా? ఏమో! మొన్న మొన్న తోడేళ్ళు మనిషి పిల్లాడిని పెంచడం తనకు తెలిసిన విషయం...జంతువుకూ మనిషికీగల అనుబంధాలు అట్లా వుంటాయి. రాఘవులకు అపాయంలోనూ, ఆవేదనలోనూ వున్న, చచ్చిపోబోతున్న దున్నపోతును చూడగానే, దాన్ని బయటకు నెట్టుకురావాలని పిచ్చి ఆవేశం వచ్చింది.

కాని పిక్కలపంక చూసుకున్నాడు. వెంట్రుకలు సుడులు తిరిగి నిటారుగా వున్న కాళ్ళు. అతను కాలవవేపు నడిచి, కాలవ మధ్య...వొంట్రుమట్టి పక్కగా అరడుగులోతు ప్రవహిస్తున్నచోట మప్పటంత పల్చటి కండువాను విప్పి తడిపేశాడు. నీళ్ళోడుతోంది అతని చేతుల్లో. ఇసుక కద్దంపడి, నడిచివెళ్ళి, ఊబిలోకి సంశయిస్తూ—

దిగా డతను. చీకట్లోకి పోతున్నట్టు అతని కాలు. జర్రుమంటూ మొదటి అడుగే మోకాటి లోతు దిగబడిపోయింది. ఊబిలో మూడు

బారల కవతలగా వుంది-దున్నపోతు. అడుగున చల్లగా వుంది. ఒక అడుగు లోతువరకూ వెచ్చగా వుంది. ఎండకు భూమి కాగింది. రెండో కాలును కూడా, ఇసుక నెరసులుమీంచి వూబిగుండంలోకి దించాలి...దించాడు. మోకాలు కూరుకుపోయి, ఇంకా దిగిపోతూంది. అతనికి బెరుకుతనం కలిగింది...తను కూడా దున్నపోతులాంటి అవస్థకు గురికావలసి వస్తుందేమోనని. ముందు వేసిన కాలు తొడ కిందివరకూ ఇరుక్కునిపోయి, అతనిలో ఎగువ దిగువల సర్దుబాటు లేక, నిలకడను తప్పించింది. వెనక్కి కూలబడిపోయి, సర్దుకున్నాడు—చేతిలో వున్న నీటి కండువా బరువును ముందుకూ పైకీ వంచాడు—తాడుమీద నడిచే వాడు చేతులో కర్రను ఊపుతూ బ్యాలన్సు నిలుపుకున్నట్టు. శరీరం వొణుకుతూంది. అతనిలో పట్టు తప్పి ముందుకు నడిచిన కొద్దీ లోతు వుంటుందనిపించింది. ఇంత కంటే లోతు అయితే; కాలు లాక్కోడానికి కూడా వీలు దొరక్కపోతే—తనూ అందులో చిక్కడిపోతాడు. ముందెంత లోతుందో... వెనక్కి వొడ్డుమీదికి వెళ్లిపోయి, మరోలా దాన్ని చేరేమార్గం ఆలోచిస్తే బావుంటుందనిపించింది. మళ్ళీ అంతలోనే తను వెనక్కి వెళ్ళడం అంటే వెనుకంజ వేసినట్టవుతుందేమో! అన్న ఆలోచన వచ్చింది....శిశువు పుట్టేప్పుడు ఆడదాని అవస్థ జ్ఞాపకం వచ్చింది. సుఖంగానూ, బాధ లేకుండానూ, వీలుగానూ, బాధ ఓర్చుకోగలిగిన స్థితిలో నేను వున్నప్పుడే నాకు శిశువు ప్రసవమయ్యేలా చూడు—అంటే అలా జరుగుతుందా? అంతే, అలా జరిగిపోవాలి. ఛ స్తే అ స్త్రీ చ స్తుంది. స్పృహ తప్పితే తప్పుతుంది, 'కానీ, స్త్రీ ఇష్టానికీ, ప్రసవానికీ, సంబంధమూ అన్యోన్య భావమూ వుంటే, ఇప్పటికి బహుతక్కువ మందే పుట్టివుండే వాళ్ళు.' అనుకున్నాడతను. తను కార్య రంగంలోకి దూకాడు. కార్యం ఆలోచనా, సంకల్పాల్లోంచి బయల్దేరింది బయట పడాల్సిన శిశువులాగా. అందులో తను దారి తప్పినా దాన్ని చేరుకోవాల్సిందే. తను లావు స్పీకర్లలో, యువ జన్లను ఉద్బోధించడం, తన హుంకరింపులు....అన్నీ జ్ఞాపకం వచ్చాయి రాఘవులికి, జ్ఞాపకం తెచ్చుకుంటూ తను ముందుగా వేసిన కుడివేపు కాలును పైకి లాక్కొని, మళ్ళీ మరో అడుగు ముందుకు

వేశాడు....దిగబడి పోతూంది....ఇంకా దిగబడిపోతూంది...అడుగు కంటా తను వెళ్ళిపోతానేమోనని ...లోతు తెలియని వూబి....దిగబడి పోతూంది...పంచెవరకూ....తొడలు కూడా దిగబడి పోతాయేమో నని భయపడ్డాడు. చేతులో నీళ్ళోడుతున్న కండువాజారి వూబిలో పడేట్టుంది. బ్యాలెన్సు నిలుపుకోవడానికి చేతులు అవస్థ పడుతున్నాయి. కుంటివాడు సాధన చేసుకుం నిలబడబోయినట్టు ...కాలు దిగబడడం ఆగింది. రెండో అడుగు అంతగా దిగబడలేదు. అడుగువేసినచోట కాలు పక్కగా, బురద కదిలి స్తంభిస్తోంది.

రాఘవులు రెండో అడుగును తీసి, దాన్ని నాలుగో అడుగుగా వేశాడు...తను పొరబాటు చేశాననుకున్నాడు. తను బాగా ఆలో చించి, ఒక కార్యక్రమం తయారు చేసుకుని పనిలోకి దిగాల్సిందను కున్నాడు...తన దగ్గర కత్తి వుంది. దాంతో రెండు వాదిబడితె ల్లాంటి వాటిని నరికి, వాటిని వూతం చేసుకోవాల్సిందన్న ఆలోచన వచ్చింది. అలా అయితే తను పూర్తిగా దిగబడకుండా. బడితెల్ని అంచెలుగా నడిపిస్తూ, వాటిమీద కొంత బరువునానుకుని చేరుకో వచ్చు. అంటే—

దున్నపోతు అది నిలబడినంత బరువులో కాకుండా పొట్ట అడ్డు రావడం మూలాన, అలా వుంది గాని లేకపోతే. ఇంకా చాల లోతువరకూ ఊబి గుండంలోకి కూరుకుపోయి వుండేదనిపించింది రాఘవులికి. అక్కడి ప్రాంతంలో దాని పొట్టకింద గట్టి వూబి వుండ టము మూలాన, అలా ఆగి వుందనిపించింది. తను చేయగూడనిదీ చేయలేనిదీ, ఇది. పర్వతాన్ని మోసేందుకు భుజం కాపి సిద్ధపడినట్టు, కనిపించింది....సంశయం పెరుగుతూంది....

ముందుకు కదలలేకపోయాడు. పోనీ అని సాహసం చేసి ముందుకు సాగుదామనుకున్నా, కాళ్ళు పట్టు చేసుకుని నిలబడడం లేదు....చౌడుతో నిండిన వూబి ఇది. మెత్తటి బురదలో గరుక ఇసుకను కలిపినట్టు కాలికి చౌడు రాసుకుపోతూంది. వూబిలో కదల నీయని శక్తి వుంది... ఎట్లా?....ఎట్లా?...ఎట్లా వస్తుందీ దున్నపోతు బయటికి? ఇంక తను ముందుకుపోలేడు. వెనక్కి రాలేడేమో? దీన్ని తీయటం కష్టం. అది అలా చావడానికే అలా చిక్కుకుపోయింది.

దాని కటువంటి చావు రాసివుంది. దాన్ని రక్షించబోయి తను చావ లేదు...అతని మనస్సు రెపరెప లాడింది - బయటకు రావాలని. ఎండ తీవ్రంగా కాస్తూంది. మధ్య మధ్య గాలి రివ్వ వేస్తూంది. పక్షులు ఎగురుతున్నాయి.

వూబి కవతల నీళ్ళ మడుగులో....పక్కన తళ తళలాడు తోంది. ఎండపడి—పాము నీళ్ళు తాగుతోంది. తల ఎత్తి చూస్తూంది. ఏమి పామబ్బా?...రాఘవులు ముఖాన్నపట్టిన చెమట తుడుచుకున్నాడు. ఒకవేళ ఆ పాము, కావాలని తనవేపు వస్తే తనీ క్షణంలో ఏమీ చేయలేనని భయం వేసింది వెనక్కి వచ్చేసే ప్రయత్నానికని, తిరిగి వెనక్కి కదిలాడు. కాలు రావడంలేదు. బలంకొద్దీ లాగాడు. లోపల ఏదో తగులుతోంది కాలికి. ఏదో కర్ర. పాదాన్ని లోపలికి వాలుగా నెట్టి పాదంపైకి ఆ కర్రను వచ్చేలా చేశాడు.

తర్వాత నెమ్మది నెమ్మదిగా నెమురుస్తూ అడుగు లోతులో వదిలేశాడు. ఒక చేతిని బురదలోకి దూర్చి కెలికి. దాన్ని పిడికిలి బలంతో పట్టి పైకి లాగాడు. బురదతో నిండిన గజంపాతిక పొడుగు వంకర కర్ర. దాని వొంపు చూడగానే అది ఎముక అని అర్థ మయ్యింది అసహ్యం వేసింది. వొళ్ళు గగుర్పొడిచింది. చేతులమీది వెంట్రుకలూ, చేతి వేళ్ళూ మరింతగా అసహ్యాన్ని వ్యక్తపరచాయి. దాన్ని అవతలికి విసిరివేశాడు. అది వూబిమీద పడి, బురదలో కది లింది వికారంగా అపహాస్యం చేసినట్టు. పెద్ద అడుగువేసి, చేతుల్ని వొడ్డుమీదికి వంచి, అతను పాక్కుంటూ, కాళ్ళను లాక్కొని బయట పట్టాడు. అతను అంతకు ముందు వొడ్డుమీది ఇసుకలోకి గిరాటు వేసిన తడి కండువాకీ బాగా బురద అంటుకుంది.

అతను వొడ్డుమీద నిలబడి. వరసగా గబ గబా నాలుగు తుమ్ములు తుమ్మాడు. తూలిపోయాడు. ఇంకా ముక్కు రంధ్రాల్లో పేరుకున్న అతి సన్నని తుంపరలు శ్వాసను తిన్నాగా పీల్చనీయడం లేదు. అతను పొద్దువంక చూసి, కళ్ళలోనూ, ముక్కులోనూ గుర గురలు రప్పించుకుని గట్టిగా తుమ్మాడు. ముక్కును నులుము కున్నాడు. కళ్ళు తుడుచుకున్నాడు. అతని చేతుల్ని వున్న మట్టి ముఖానికి అంటింది.

అతను వెనక్కి తిరిగి, బురద పూసుకుని వున్న కర్రలాంటి ఎముకను చూశాడు. మరో పక్కగా వున్న దేనివో అర్ధచంద్రాకారపు పక్క టెముకలు వూబికి మీదుగా వుంటే, చూడకూడదను కుంటూ చూశాడు. వాటికీ దీనికీ సంబంధం లేదు. రెండూ వేరు జంతువులవి.

'కస్' మనే శబ్దం వినిపిస్తోంటే అటు చూశాడు. పాము పిల్ల తాగి, బుస కొడుతూ పోతోంది, రక్తపింజేరు. వొద్దు ఎక్కుతోంది. అటువేపు అడవికి పోతోంది. దాన్ని చూస్తోంటే అతనికి బజారు జ్ఞాపకం వచ్చాడు.

''ఎవడినెలా మట్టుకు రావాలో నాకు చాతనవును'' అతను తనకు తెలీకుండానే అన్నాడు.

బట్టతల మీద ఎండ కాస్తోంది. చిర్ర పుడుతోంది. చెమ్మ పక్కన నిలబడడం మూలాన ఉక్కగా వుంది. బనియనుకు బాగా చెమట పడుతోంది. అతనికి చికాకుగా వుంది. అతను ఎముకలవేష్ట అదేపనిగా చూస్తున్నాడు... దున్నపోతు చావును వూహించాడు.... చావు తర్వాత ఎముకలు మిగలడం....

ఉరిశిక్ష విధించబడ్డ ప్రాణిని, చిత్రహింస చేసేందుకు మల్లే దీని చావుకిదో ప్రక్రియా? ఖూనీ చేసి; మనిషిని ఈ వూబిలో పారేస్తే అంతు చిక్కడు-అనుకున్నాడు రాఘవులు. చిన చంద్రయ్య ఖూనీ జ్ఞాపకం వచ్చింది. ఒకవేళ అది మనిషి తొడ ఎముకేమోనని పించింది. తొడ ఎముక అంత పొడవు వుండదనీ. వొంపు వుండదనీ తోచింది. వెన్ను అయితే పూసలుగా విడిపోతుంది.... అదీకాదు.

''ఇన్ని ఆటంకాల మధ్య చిక్కడి వుంది. ఎలా తియ్యడం దీన్ని?'' అతను అన్నాడు గాలిలోకి.

దున్నపోతు ఇంకా అలానే తలొంచుకుంది—చావాలని నిశ్చయించుకున్నట్టు. బలికి సిద్ధపడ్డట్టు. తన్నెవ్వరూ బ్రతికించలేరన్నట్టు. ఆఖరి నిముషంలో. ప్రపంచాన్ని మరచి. తన తప్పుల్ని వొప్పుకుంటూ. ప్రార్థన చేసుకుంటున్నట్టు. స్పృహ తప్పినట్టు. వచ్చి బిగిసిపోయిన జంతువులాగా. చావు కనిపించని కొరడాతో బాదుతోంటే కిక్కురుమనకుండా. పోల్చుకుంటున్నట్టు. పిశాచాలు

దాని చుట్టూ నాట్యం చేస్తూంటే చూడలేక, అలా తలను నేలమీదికి వేలవేసినట్టు...

రాఘవులి మనస్సు చలించింది దాన్ని చూసి. ఆ స్థితిలో వున్న నికృష్ట జీవిని చూసి అతనికి అపరిమితమైన జాలితో కూడిన బాధ కలిగింది. తనే దాని స్థితిలో పడ్డాడు, దాన్ని చూస్తూ.

మిట్ట మధ్యాహ్నపు ఎండ.

వర్షాలు తగ్గిపోయాయి. పంట చేలు కోసేశారు. పని పాటులు తగ్గాయి. శీతకాలపు ఆఖరి రోజులు. పల్లపు పొలాలు బాగా బీటలు వారుతున్నాయి. ఎండ చురుకుదనం రోజు రోజుకూ హెచ్చుతోంది. అడవిలో గడ్డి గొడ్ల తిరుగుడుకు నలుగుతోంది.

....తనకు రాత్రి నిద్ర సరిపోలేదు.

రాఘవులు దాన్ని వదిలి వెళ్ళలేననుకున్నాడు. రూపు మారి పోయిన తడి కందువా వంకా, పంచెకు అంగుళంన్నర కిందివరకూ పూసుకున్న బురద వంకా చూసి; ఏం చెయ్యడానికి నిర్ణయించుకో లేకపోయాడు. నూతిలో దున్నపోతు అలానే వుంది. అతనికి అను మానం వేస్తూంది-అది బ్రతికి వుందో లేదోనని

అతను ఆలోచననూ జంకునూ దగ్గరకు రానీయగూడదను కున్నాడు. ఆలోచనవల్ల తర్కం పెరుగుతుంది. జంకు ఆలస్యం చేయిస్తుంది. తియ్యాలని పథకం వేసుకుని, తియ్యడమే మంచిపని. అతను ముందుకు వంగి పిడికత్తిని చేతిలోకి తీసుకున్నాడు. ఆ కత్తితో, కొంత గడ్డి కొయ్యాలనీ. తీగల్ని తెంపుకు రావాలనీ. నాలుగయిదు పెద్ద దుంగల్నీ, పది పదిహేను బడితెల్నీ, కొంత గొలిగి కంపా నరికి ఈడ్చుకురావాలనీ. నాలుగు పెద్ద తాటాకులూ, మూడు నాలుగు తాటి మట్టలూ నరుక్కురావాలని.

రాఘవులు అటువేపు, అడవివేపు తిరిగి నడిచాడు. ఒడ్డుపైకి ఎక్కాడు. కత్తి నూరుకోవాలన్న దృష్టి. అతనికి శివలింగంలా వున్న రాయి కనిపించింది—తెల్లటిది. దాని చుట్టూ వున్న గడ్డిని పక్కలకు పీకి, కొంత యిసుకను రాతిమీద చల్లి, కత్తిని నూరుతు న్నాడు. బనియను చెమటతో వెనుకంతా తడిసింది. కత్తిని మరో వేపుకు తిప్పి నూరుతున్నాడు. నిప్పు పుడుతోంది వుండి వుండి-పలు

తుల్లాగా, కాకర పువ్వొత్తి వెలిగినట్టు. టూకుపుల్ల పొయ్యిలో చిట చిటలాడినట్టు. కోపంలాగా. అతను లేచాడు. కూర్చున్నప్పుడు. మడమ దగ్గర వున్న బురద తొడలపై కంటా వున్న పంచెకంటింది. అతను పట్టించుకోవడం లేదు. చేతిలో కత్తివి బరువుగా చూసాడు. కత్తి మెరుస్తూంది ఎండపడి. బాగా పదునయిన నాడి వచ్చింది.అతను నాలుగయిదుసార్లు, చూపుడు వేలుతో కత్తి పదునునూ, పళ్ళదనాన్నీ స్పృశించి చూశాడు.

...కాలువ వొడ్డుకు కొద్ది గజాల దూరంలో గొలికి కంప, అడవికి కంప గట్టినట్టు. అతను తిన్నగా వెళ్ళి. మండల్ని పొద ల్లోంచి వేరు చేస్తున్నాడు. కత్తి బాగా తెగుతోంది. అతను చేయి ఎత్తడం, గొలిగి మండ మొదట్లోంచి తెగి నేలమీదికి జారి విల బడడం, అతవికి హఠాత్తుగా రక్తపింజేరు జ్ఞాపకం వచ్చింది. నీళ్ళు తాగి బుసకొడుతూ వెళుతున్న రక్తపింజేరు, ఎర్రగా, లావుగా, నల్లటి మచ్చల్తో వున్న పాము...

అతను నరికిన కంపవేపు చూశాడు. రెండు పెద్దమోపుల మండ తెగింది. అతవి దృష్టిలో....అతవి తొడలావు వేప మొక్క పడింది. అతవి తొడ పొడవుగా, పుష్టిగా వుంది. అతను విబ్బరంగా వున్న వేపమొక్క చుట్టూ గంటు పెట్టాడు. తియ్యటి చేదువాసన. గొలిగి చెట్ల పసరు వాసనకు ఇష్టపడలేక పోయిన అతని ముక్కు వేప వాసనకు అభ్యంతరం చెప్పలేదు. వేపమొక్క సునాయాసంగా తెగిపోయింది చుట్టూతా. మధ్య మాత్రం పట్టు వుంది. చేయి మంట పుడుతోంది. అరచేతిలో నీటి బుగ్గలు లేచాయి....గట్టిగా ఇద్దరు ముగ్గురు పట్టి. పక్కకు తోసే స్తేగాని అది విరగదు అతను ప్రయ త్నించాడు. విరగడం లేదది. వూగుతోంది. ఇందాక అతను చూపిన తీగెలున్న డొంక దగ్గిరికిపోయి, మొదళ్ళను తప్పించి. పదింటిని లాక్కువచ్చాడు. చెట్టు పంగలలోకి, తీగలికి చివర్న కర్ర కట్టి - విసిరి వూపి చూశాడు, కర్ర పంగల మధ్య పట్టింది—జారిపోకుండా. వూచి లాగాడు. వూపు సరిపోవడం లేదు. చిన్న చిన్నగా చెట్టును వూపుతూ, తీగల్ని చేతికి చుట్టుకుని శక్తికొద్దీ లాగుతూ, వొక్కసారిగా

వెనక్కి తిరిగి, భుజం మీదికి తీగల్ని అదుముకుని, గుంజిలాగాడు. అది ఛెళ ఛెళమని విరిగి పడింది.

తానొక సాహసకార్యం చేస్తున్నాననుకున్నాడు రాఘవులు. తాను పూర్వకథలో వీరుడిలాగ ఒక మహాప్రయత్నం చేస్తున్నానను కున్నాడు. భీముడు కొండచిలువతో పోరాడుతూ, పడిపోవడం, రావణుడు కైలాసాన్నె త్తడం, వామనుడు బలిని పాతాళానికి తొక్కెయడం....ఇటువంటి కథలన్నీ జ్ఞాపకానికి వచ్చాయి.

కొంచెం దూరంలో ఏపుగా పెరిగి వుంది ఒక కుంకుడు చెట్టు. కుంకుడు చెట్టును నరక్కూడదనుకున్నాడు. కాని, దుంగల కోసం తను ఇంకా దూరం వెళ్ళి తిరగలేదు. వొడ్డుదాకా వాటిని మోసుకు పోయి అక్కడ నుంచి వొర్లిద్దామని అతని ఆలోచన...'ఛట్ ఛట్' మంటోంది...ఒకపక్క గంటు పెట్టి నరికి, తీగవేసి విరగలాగాడు. ముష్టివి, పొదల్లా కాకుండా, బరిసెల్లా వేరు వేరుగా పెరిగి వున్నాయి. అతని భుజాలు వాటిని చూడగానే పొంగాయి. కత్తికున్న పదును వేప్పు తృప్తిగా చూశాడు అతను ముష్టిబడితెలు రెండు కత్తి దెబ్బలకు ఒకటి చొప్పున తెగిరాయి చేతులు విపరీతమయిన మంటలు పుడుతు న్నాయి...అడవిని వొకపక్కనుంచి మరోపక్కకు నరికే పందెం పెటుకున్నవారిలాగా వున్నాడతను....పురాణాల్లో పరశురాముడు తన గండ్రగొడ్డలితో పాలకుల్ని అందర్నీ ఇలానే నరికాడన్న ఆలోచన వచ్చిందతనికి, చదువుకునే రోజుల్లో పాలేర్లు పొలాలకు రామని రైతులతో ఘర్షణ పెట్టుకున్న రోజుల్లో, ఎనిమిదెకరాల పుగదంటు ఒక్క రోజున మొదళ్ళకంటా నరికి, ఒక్క రోజున లాఖిగా పోగుచేసిన రోజు జ్ఞాపకం వచ్చింది.

ఈ మధ్య కొంచెం సుఖపడుతున్నాను. పైపైపనులు పెట్టుకుని, శరీరానికి బద్ధకం అలవాటు చేస్తున్నాను" అనుకున్నాడతను.

దూరంగా టేకు మొక్క కనిపిస్తూంది. మంచిదుంగ అవుతుంది. చవరుగా వుంది....నునుపుగా....పెరగనిస్తే చక్కని మాను అవుతుంది, కాని, ఇప్పుడు ప్రయోజనానికి అక్కరపడాలి.... రాఘవులు ముందుకు నడిచాడు. చెప్పులులేని కాళ్ళకు, నడక అలవాటు లేనితనంగా, కొత్తగా వుంది—గడ్డి కడ్డంబడి వెళ్తోంటే

"జివ్వు" మంటోంది చెట్టుమీద...చెరకు మొక్కమీద తేనె పట్టు పడుతోంది. పెద్ద తెర. దాన్ని కదిపితే ఈగలన్నీ వచ్చి తన్ను కుడతాయి. అతనికేమీ తోచలేదు. వెంటనే తోచింది....బనియను జేబులో అగ్గిపెట్టె తీసి, కొంచెం పచ్చగడ్డీ, ఎండుచీపురూకోసి, మంటచేసి, ముట్టించి, పొగపెట్టి ఈగల్ని ఎగర గొడదామను కున్నాడు. అతను మండుతున్న చేత్తో అగ్గిపెట్టెను తీశాడు. పుల్లలు తీసి గీశాడు. వెలగడంలేదు, అగ్గిపెట్టె చెమటకు నానిపోయింది.

"ఛీ...ఛీ అవసరానికి పనికిరానివన్నీ" అని చీదరించుకుని, అతను దాన్ని గిరాటేశాడు.

వెనక్కి పోయి. నరికిన వాటిని ఊబి దగ్గరికి చేర్చాలని పించింది. కార్యక్రమం ఎంత తొందరగా జరిపితే అంత మంచిది. సుమారు మూడుమోపుల గొలిగి కంపా, రెండు దుంగలూ, పదిహేడు బడితెలూ, పెద్ద తీగలగుంపూ....వాటిని, ఇంకొంచెం ముందుకంటా, కాలవ వాటులో లాక్కుపోయి, పైనుంచి తోసేస్తే,—వూబికి మరో పక్కన దగ్గర్లోకి దొర్లిపోతాయి, ఆ వుపాయం మెరుగ్గా కనిపించింది. అంచేత అతను తీగల్తో మొత్తాన్ని ఒకేమోపుగా కట్టాడు. మండలకి మధ్యగా, బడితెల్నీ దుంగల్నీ పరిచాడు. వరుసగా మూడుకట్లు వేశాడు....తీగను భుజంమీద వేసుకున్నాడు. బరువుగా వుంది. కదలడం లేదు మోపు. మళ్ళీ లాగాడు....కొంచెం కదిలింది. మోపుకింద వున్న ఏవో నేల పట్లు ఇంకా వదల్లేదనిపించింది. అతను శక్తినికూడ గట్టుకుని, వూపి, ముందుకు వంగి ఈడ్చే స్తున్నాడు...అరడుగుల ఎత్తుమోపు .. బండెడు కంపను లాక్కు పోతున్నట్టు వుంది. మధ్య తరగతి కుటుంబీకుడు. కుటుంబ నియంత్రణ లేనివాడు. సంసారాన్ని లాగలేక లాగినట్టువుంది. పగలంతా మబ్బులు పట్టిన రోజున సూర్యుడి కదలని గమనంలాగా. పట్టుదల హెచ్చుతోంది. పంతకం పట్టినట్టు, పందెం వేసుకుని అందరి ముందూ అలా చేస్తున్నట్టు....భుజంమీది కండ నలుగుతోంది. తీపు పెడుతోంది. అతని నడక వేగ ప్రమాణం బాగా తగ్గినా, లాక్కు పోతున్నాడు. ఆ కదిలివచ్చే జరజరల్లో అతనికేమీ బయటి శబ్దం వినిపించడంలేదు. చీపురు దుబ్బులమీంచీ, మొదళ్ళు మిగిలిన ఎండు

తంగేడు తుప్పలమీంచీ వొరిగిపోయిన తాటి బొదర్ల మీంచీ.... అతను లాగేస్తున్నాడు. చేతులు భగభగమని మంటలు పుడుతున్నాయి. కళ్ళు నొప్పితో చికిలించుకుని వున్నాయి.... ముందుకు లాక్కు పోతున్నాడు. పెద్ద పొద, బాగా విస్తరించుకుని కదిలి వస్తున్నట్టు వుంది.

"హమ్మయ్య" అనుకున్నాడు. ఇంత బాధపడడం జీవితంలో ఇదే మొదటిసారి అనిపించింది. అయినా చాలీచాలని బ్రతుకుల్తో పోల్చుకున్నప్పుడూ, ఆ బ్రతుకుల్ని గౌరవంగా ఎంచుకునే వాళ్ళను తల్చుకునీ,—వాటికంటే ఇటువంటి కష్టాలు తను ఎల్లకాలం అను భవించగలననుకున్నాడు. ఇటువంటి పనులన్నీ గుంపులో చేసేవాడు తను. కాని, ఇది తన వొక్కడికే పరిమితం అయ్యింది. మించిన బరువు మోశాడు. కాని, శరీరంలో ఎక్కడా పట్టుపట్టలేదు. ఇటువంటి శక్తికి మించినవి చేస్తే,—అవయవాలు దెబ్బతింటాయి.

....కాలవ వొడ్డుకు కొసగా మోపును ఆపేడు—

మోపులో నుంచి కత్తిని వెతికి తీసి, మొలలో వీపు వెనకా తల పెట్టుకున్నాడు. మరో బడితెలాగి, వొడ్డు మీదికి, చివరి.... కంటా తిప్పేడు మోపును. చాలు. ఇప్పుడు ఎంత గట్టిగా తోస్తే, ఫలితం అంత దగ్గరిగా వెళ్ళి పడుతుంది మోపు. ఒకవేళ మధ్యలో గాని, వాని పోతదమారి, కుడివేపుకు వంగితే, వూబిలోకి వెళ్ళిపడుతుంది. ఒకవేళ మధ్యలో ఏదయినా తగిలి మోపు పైకెగిరినా, వెళ్ళి, వూబిలో పడిపోతుంది. మోపు మాత్రం తెగదు. అంచేత, వీలయినంత శక్తిని వుపయోగించి తోసెయ్యాలి.... తుఫానులో వోడను వదిలి, గుడ్డిగా నడుపుతూ క్షేమంగా వున్న వేపు జేరమన్నట్టు.... తను కావాలన్న చోటుకు రెండుమూడు బారల దూరంలో పడుతుంది.

అతను మోపు కిందికంతా బడితెను జరిపి, పోటిచ్చి పట్టు పట్టాడు. కాని, ఒక్క బడితెతో లేవనెత్తబోతే, శక్తి తగినంతగా సరిపోదనిపించింది... ఒక పక్కకు తేలిపోవచ్చు. మరో నిడుపుపాటి బడితెను కూడా— మోపును దొర్లకుండా కదలకుండా పట్టుకుని, బయటకు లాగాడు. దానినీ మోపు కిందికి సర్దాడు రాఘవులు. చేతులో అరచేతుల్లో 'ఛుప్, ఛుప్' మని వుమ్ముకున్నాడు.... చెయ్యి తడిగా

అయి, పట్టు దొరకాలని, రెండు చేతుల్నీ నలుపుకుని....మంట... వంగి, రెండు కర్రల్నీ పట్టుకుని వొక్కసారే పైకి ఎత్తేశాడు. మోపు...తనకన్నా యెత్తుగా వున్నట్టున్న దాన్ని - గటుమీంచి... వేగంగా దొర్లుకుపోతోంది. తను అనుకున్న చోటికంతా దగ్గరకు పోయింది. దాన్ని అక్కడ విప్పేస్తేచాలు. ఇంక ఏమాత్రం కదల్చ నక్కరలేదు. తను దిగాలి...అతడు ఏనుగు పల్లేరుకాయులకు భయపడుతూ పదమల్ని ఎత్తివేస్తూ దిగేడు (ఒక్క పల్లేరుకాయ కూడా అతనికి గుచ్చుకోలేదు) నడిచాడు.

దున్నపోతు అలానే వుంది.

అతని మనసులో ఆతురత హెచ్చింది

ఎలాగయినా దాని దగ్గరకంటా వెళ్ళి, దాన్ని తడిమి, తగినంత హామీ ఇచ్చి దానిలో ఒక కొత్త ఆశ పుంజుకునేలా చేయాలలి తన తోడ్పాటు దానికి తెలియజేయాలని తను దానికోసం కృషి చేస్తున్నట్టు దానికి అర్థం కావాలని, తను దానికి తెలియజెప్పాలంటే అదొక్కటే పద్ధతి. దానికి తన మాటలు తెలియవు. తను మాటలతో తన ప్రేమను వ్యక్తం చెయ్యలేడు. (ప్రమీలలో తను మొదటి రాత్రి ఒక్కమాటే మాట్లాడేడు. ప్రమీలా అని పిలవడం మాత్రమే చేశాడు అదయినా ఎంతసేపో స్పర్శా సుఖాల తర్వాత, ఎంతో సన్నిహితత్వం పెంపొందించుకున్న తర్వాత ఏవేవో అనుభూతుల తర్వాత)

ఆ విధంగా స్పర్శా మాత్రంగా ఆదరించి చెప్పి దాన్ని, తిరిగి బతికేలాగా...ఆశ కల్గించే ప్రయత్నం చెయ్యాలనిపించింది... అప్పుడే తనలో వున్న ప్రత్యేకత బయటపడుతుంది. జీవితం అనేది ఇవ్వగలగడంలోనే వుంది. ఏ రూపంగానైనా. ప్రత్యక్షంగా జీవితాన్ని నిర్మించగలిగితేనే తగినంత సంతృప్తి. రాళ్ళు, కాలి వెంట్రుకలమీది బురద, ఎండి, బట్టి, తను కదిలినపుడు కదుల్తోంటే వెంట్రుకలు వేలాడుతున్న మట్టి పెదపలు కాళ్ళమీద కదుల్తోంటే— చేత్తోపైనుంచి రెండుసార్లు కాళ్ళను తుడుచుకుంటూ—ఏమిటి దీనికి గత్యంతరం? అనుకున్నాడు.

అతని నీడ అడుగున్నర దూరంగా అతని వెనకకు తూర్పుకు పాగింది.

ఊబి వొడ్డంట, పక్కవేపుగా వెళ్ళి. అతను దున్నపోతు ముఖాన్ని వంగి చూశాడు. అది శ్వాస పీలుస్తోందన్న నమ్మకం తనకుతాను కుదుర్చుకున్నాడు. అది ఏడవడంలేదు...కంటి వెంట ఏ మాత్రం తడివారాలేదు. శ్వాసను బరువుగా, ఇబ్బందిగా పీల్చుకుంటోంది. బాగా దాచుకుపోయిన డొక్కలు. అది శ్వాస పీల్చినప్పుడు మెల్లగా కదుల్తున్నాయి. అతను చేతుల్తో గట్టిగా చప్పట్లుకొట్టాడు. అరచేతులు కొంచం నొప్పెట్టాయి. అతని చేతి బంగారపు కడియం వెనక్కివచ్చింది. దున్నపోతు చెవులు కొంచెంగా కదిలాయి. అతనికి అప్పుడు చల్లటిగాలి తగిలి, కొంత సేదతీరినట్టనిపించింది. భుజాల నిండా రక్తంనిండినట్టయి, భుజాలు అదిరాయి. తనలో బద్ధకం తగ్గుతున్నట్టు తోచింది. శ్రమపడి దున్నపోతును బయటికి తీయగలనన్న పెద్ద విశ్వాసం కలిగింది తనకి.

అతను వెనక్కి నడిచివచ్చి, మోపుకున్న తీగల్ని చురుగ్గా వూడదీశాడు. మోపు ఒక్కసారే సడలి, విడి, అతని వేపూ మరో వేపూ విచ్చుకుని పరచుకుంది. తను తాటాకులూ, పచ్చగడ్డీ తెస్తేనే తనకు వచ్చిన వూహకీ, తను వేసుకుని – పరించాలనుకున్న ప్రణాళికకీ, సరిపోతుంది. ఒకవేళ అవన్నీ చేసేసరికి పొద్దు చాలదేమోనన్న ఆలోచన వచ్చి మనసును వెనక్కిలాగింది. మళ్ళీ తను గట్టిగా ప్రయత్నం చేస్తే, తప్పకుండా పని జరుగుతుందన్న నమ్మకం, కాని, వూబి అంచనాకు మించి ఎక్కువగా లోతు వుందేమో అన్న తలపు వచ్చి నిరుత్సాహం కలిగించింది. ఇంతలో....మళ్ళీ....మొండితనం ప్రవేశించింది. ఇంత ప్రారంభంచేసి వూరుకోడమా?

మోపును వదిలి, అతను గట్టువేపు గబగబా కాలువలో నడుస్తున్నాడు అలా నడుస్తూంటే పాదాలు జాడలు పడి తడిగా పొడిగా ముద్రలు వేసినట్టున్నాయి ఇసుక మీద. అతను గట్టుయెక్కాడు. మొలలో కొడవల్ని తీసుకున్నాడు. ఫర్లాంగుదూరం పొదల్లో చొచ్చుకెళితే తాటి చెట్లున్నాయి. లోపలకు వెళ్ళినకొద్దీ పల్లుకు. దూరిపోతూ పొదల మధ్య నడవాలి. అతను, నిర్ణయాన్ని అమలుచేసే ప్రయత్నంలో ముందుకు నడిచాడు. అక్కడే గడ్డి కొయ్యాలని....

తను ఏంచేసినా విచిత్రమే. ప్రజాస్వామ్యం ఇంకా బిగుసు

కుని, తన్నుతాను బాగా అర్థం చేసుకోని అవకతవకల్లోనే, అంత మొట్టమొదటి అనిశ్చిత కరణంలోనే, చదువుకుని వ్యవసాయం చేస్తున్నాడతను. తను అగ్రగామి. తను మార్గదర్శి. తను వైతాళికుడు. తను ఒక పదకావికి ప్రధానకర్త. ఇంక ముందు ముందు ఎంతమంది పుట్టబోయే కోట్లాది వ్యక్తిత్వంగల వీరుల తన్ను అనుసరించాలో!!! జడత్వాన్నుంచి మేల్కొనే ఎంతమంది సమకాలీనులు తన వెంట నడవాలో!! కట్టుతప్పని పద్ధతిలో మార్పులు ప్రవేశపెట్టి వ్యవసాయాన్ని చేస్తూ, రాజకీయాల్ని ధ్యేయం కోసం నడిపిస్తున్నాడు తను. రాజకీయ వ్యవహారాల్లో పరపతి సంపాయించాడు. తను రాజకీయంగా పరుసవేది, తను ఈ కోవకు మొట్టమొదటివాడు. ఒక వ్యవస్థాపకుడు....అటువంటి తను (వుండి వుండి కత్తి అతని చేతిమీదికి వస్తుంది-తొందరపాటువల్ల. అతని గుప్పిళ్ళలో....గడ్డి పనలు పడుతోంది. ఒక సామాన్య జంతువు కోసం...ఒక-అందరి దృష్టిలోనూ- నీచమైన దున్నపోతు కోసం; ఒక పెద్ద పండుగ రోజున. అందరిలా ఆనందించకుండా ఏకాకిగా, ఎక్కడో ఆ జంతువుతోపాటు బాధపడుతున్నాడు. ఏ వొక్కడూ కూడా చెయ్యనిది...

మునసబూ. వెంకటరత్నం, బ్రహ్మన్నా. తాతా, వీళ్ళంతా మామిడి తోటలో కోడి పందాల్లో వుంటారప్పుడు. సాయంత్రం ఏపొద్దు పోయో, పిచ్చాపాటీ చెప్పుకుంటూ, తాగి తూలుతూ ఇళ్ళకొస్తారు. తిని. తాగి నిద్రపోతారు. రేపు మళ్ళీ వెళతారు...ఇలా చాలానాళ్ళు జరుగుతాయి పండుగ వెళ్ళిన తర్వాత కూడా....వ్యవసాయాలు తోటలు ఇప్పుడే పాడయిపోయేది!! ఇప్పుడు కోళ్ళు పోట్లాడుతూంటాయి. కోడిపుంజులు మెడలెత్తి కేరింతాలు కొట్టడాలు వోట్లరోజున మూకల్లాగా. కాళ్ళకు కత్తులు. ఒక్క దెబ్బలో తిత్తి తెగి, తిండి బయటి కొచ్చి, రక్తం కారుతూ. వూపిరిపోతూ తల ముందుకు వాల్చి (దున్నపోతు!!) కోడి పడిపోతుంది. (అతను గడ్డిని తొందరగా కోస్తున్నాడు... ) బరిగీస్తూంటాడు కల్లు సుబ్బన్న. వోడినదాన్ని కాలు కింద తొక్కిపట్టి కత్తి విప్పుతాడు. గెల్చినదాన్ని ముద్దెట్టుకుంటాడు. రాత్రికి కోడిమాంసం....ఇవ్వాళ రాత్రికి తమ ఇంటికి ఎవళ్ళో వొకళ్లు రెండు మూడు కోళ్ళను పంపుతారు. ఏమిటో

వాళ్ళకూ వాటిని దెబ్బలాడించి చంపితే అదొక సరదా. పూర్వం రోజుల్లో మనుష్యుల్ని కూడా అలా రెండు కత్తులిచ్చి. దెబ్బలాడుకుని చంపుకోమనే వాళ్ళట. అటువంటి వాటిని చూడలేదు వీళ్ళు. ఇవన్నీ అంతుపట్టని ప్రభావాలు. ఇలాంటి మనస్తత్వాలు ఎలాగో రూపొందుతుంటాయి.

...పొద్దుటే వచ్చి పాలేర్లను కోడిపందాలకు పంపకపోతే, వాళ్ళ పుత్రాహాన్నంతా పోగొట్టినట్టు వుంటుంది. ఆ వ్యవసాయంలో వాళ్ళకెంత బాధ్యత వుందో తనదీ అంతే. కాని వ్యవహారం చక్కదిద్దేవాడు తను కావడంవల్ల అంతా తన నెత్తిమీద పెడుతున్నారు వాళ్ళు. సమష్టిగా చేసుకునేప్పుడు అంత బాధ్యత లేకుండా వాళ్ళనింకా పాత పద్ధతికి దాసోహ మనవివ్వ కూడదు. వీళ్ళకు యింకా చాల నేర్పాలి... పెందలాడే భోజనం చేసి వచ్చాడు తను. ఎప్పుడో తెల్లారుఝాము మూడు గంటలకు పొలాన లేచిన చిన్నా పెద్దా పాలేర్లు తనొచ్చేసరికల్లా పదిహేను ఎకరాల బత్తాయి తోటకు నీళ్ళు పెట్టి స్నానాలు చేస్తూ కేరింతాల్లో వున్నారు. తన్ను చూడలేదు వీళ్ళ.... బూతుల్తో వేళాకోళమాడుకుంటున్నారు. ఒకడికి గోచీ వూడదీసేశారు. వాడు గోచీ లేకుండానే ఇంజనులోనుంచి వచ్చే గొట్టం పీద్ని కింద నిలబడి స్నానం చేస్తున్నాడు...ఆ సన్నివేశాన్ని తను పన్నెండు సంవత్సరాల క్రితం అయితే అసహ్యించుకొనేవాడు. కాని తను ఇప్పుడు పూర్వం రాఘవేంద్రరావు కాదు; ఉట్టి సామాన్య రాఘవులు. వ్యక్తిత్వాన్ని విలువకున్న రాఘవయ్య. తన డిగ్రీ చదువు జరుగుతున్న సమాచారాన్ని తెలుసుకోవడానికి. పత్రికల్నీ. పుస్తకాల్నీ తిప్పడానికీ ఉపయోగపడుతోంది. అవసరమొస్తే అంకెలు కూడడానికి, వుత్తరాలు వ్రాయడానికి. తనకొచ్చిన ఇంగ్లీషు మాటలు కలిపే శక్తి అవతలివాడు ఇంగ్లీషులో మాట్లాడుతోంటే. అర్థం చేసుకోవడానికి; తిరిగి భావాల్ని వ్యక్తం చేసేటందుకు చాలు. అంతే చాలు. కాని తను సహించలేని దొక్కటే: గ్రామీణులు డిగ్రీ వున్న వాళ్ళను గౌరవిస్తారు. ప్రభుత్వం వుద్యోగులకు జడుస్తారు. వాళ్ళేం చేయగూడదో అవి చేస్తారు. ఎంత మారుద్దామన్నా మారరు.

ఇంగ్లీషు వాళ్ళ యింట్లో పని చేసే ఒక తెలివి తక్కువ వాడెవ డయినా వచ్చి, పల్లెటూళ్ళో ఆ భాష మాట్లాడితే, అతనికి బ్రహ్మ రథం పడుతారు. వాళ్ళకు తెలియదు: రామచిలుకకు రోజూ నేర్పితే బి. ఏ. పరీక్ష సమాధానాన్ని కంఠతాపట్టి అప్పజెప్పగలదని. కాన్వొకేషన్‌లో కూర్చుని డిగ్రీ తీసుకోగలదని. ఈ మూగ ప్రజకు, ప్రభుత్వం అనేది ఎందుకు ఏర్పడిందీ, ప్రభుత్వం తరపుగా అంకెలు కూడే ఈ వుద్యోగస్థులంతా ఎవళ్ళ సేవలూ. ఏవిధంగా బ్రతుకు తున్నారూ అన్న ఆలోచన కలుగదు. వీళ్ళంతా మీరిచ్చే పన్ను డబ్బుల్లోనుంచి జీతాలివ్వబడి బ్రతుకుతున్నవాళ్ళు- అని చెపితే నమ్మరు. మెతక బుర్రలు. గొర్రె మెదళ్ళు ....అసలు ఇంగ్లీషు మాట్లాడితేనేం. ఉర్దూ మాట్లాడితేనేం. తెలుగు మాట్లాడితేనేం. రష్యా ప్రధానికి ఇంగ్లీషు రాదు. అంతటితో అతను పనికిరాని వాడేనా? అమెరికన్ ప్రెసిడెంటుకు రష్యన్ రాదు. అంచేత అతను వాజెమ్మా? భాషల్లో ఏముంది? బ్రతుకు సాఫీతనం తెలియనివాళ్ళు? తెల్లగా వున్నవాళ్ళను గౌరవించడం. మరోదేశపు వాణ్ని దేవలోకం నుంచి దిగినట్టు చూడ్డం, ఇంకో దేశంలో చదివి వచ్చినంత మాత్రాన అతగాడి పాదతీర్థాన్ని సేవించడం ....

పెద్దవాళ్ళను గౌరవించి. అతిథుల్ని పూజించి. పెద్దాళ్ళు చెప్పినట్టు విని. పెరుగుతున్న భారత నవతరంమీదవున్న బూజు, దుమ్ము ....ఈ చదువుకున్న, చదువుకుంటున్న అహంభావ వ్యక్తిత్వాల విపరీతులపు నడవడు... వీటన్నింటినీ తను సహింపలేడు. తను మాత్రం.... అటువంటి అలవాట్లకు మొదట్నుంచీ తనలో వున్న బిడియంవల్ల దూరమయ్యాడు. కాలేజీ చదువునాడు జరిగిన సంఘటన తన శారీరక వాంఛకు, బలహీనతకు సవాలు చేసింది. తర్వాత.... ఉద్యోగంకోసం పడ్డ ప్రాకులాటల్లో, కొన్ని కొన్ని అధోగతికి అణగ ద్రొక్కే భావాలు నశించి తనలో క్రొత్త క్రొత్త ప్రేరణ శక్తులు పెంపొందాయి. కొన్ని కొన్ని నిత్యజీవితాల్లో పనికిరానివి దిగజారి అదృశ్యమైపోయినాయి. అది తనలో జరిగిన మహత్తరమైన మార్పు. అప్పుడు స్వతంత్ర నేర్చుకున్నాడు- తను. మరొళ్ళ

సాయం లేకుండా తనుగా బ్రతకాలనుకున్నాడు. పదిమందిచేత తనకు నమస్కారం చేయించుకోవాలనీ, పదిమందినీ తను పోషించాలనీ, పదిమందిలో తను ముఖ్య వ్యక్తిగా పరిగణింపబడాలనీ, ప్రకృతి తనకు ప్రత్యేక పరిగణన ఇచ్చి తన చుట్టూ పరిభ్రమించాలనీ అని పించింది. అప్పటికి తనకున్న ఆశయాలవి. ఆరిపోని నిప్పురవ్వలు. అప్పటికి తనకు ఇరవై మూడు సంవత్సరాలు. తను కొందర్ని విసుక్కుంటూ తిట్టి, కొందరిముందు సాష్టాంగపడే పెద్ద ఉద్యోగాలు చేసేందుకు వీలయినన్ని ప్రభుత్వం పెట్టే పరీక్షలు రాయగలిగిన తరుణం. తను ఆలోచించాడు.... చిన్నప్పట్నుంచీ బానిసత్వానికి అల వాటుపడి, సగంతిండే తింటూ. కండల్ని రాళ్ళలాగా పనిచేసి పెంచు కున్న పాలేర్ల పక్కన తీసికట్టుగా లేకుండా, సమర్థుడిగా మెలగాలనీ తనకు తోచింది. తను చెయ్యాల్సింది, తను ప్రారంభించాల్సింది... చాలా చాలా వుంది. అందుకని తను కష్టపడుతోంటే, అందుకని తను పేగులు జీర్ణాశయంలో తెగిపోయేలా పడుతున్న శ్రమను చూసి——

"నీ కెందుకొచ్చిన కర్మ యిదంతా." అన్నాడు తండ్రి. స్వాతంత్ర్యంరాక పూర్వమే ఆశయాన్ని సృష్టించుకున్నవాడు. సంస్థానాధీశుల్ని కుర్చీల్లోంచి నెట్టకముందు జీవితపథాన పడ్డవాడు. మార్పు ఎరుగని జీవితం. ప్రపంచాన్ని గురించి, ముందు జరిగేవి అక్కరలేనివాడు. సాంఘిక సంక్షేపంమీద. సామ్యవాద సిద్ధాంతాల మీద మక్కువలేనివాడు.

తను మాట్లాడలేదు.

తను పెట్టుకున్న ఆశయాలూ. వేసుకున్న ప్రణాళికా ఫలవంత మయితే, ఆ రోజుని ఈ తండ్రికి, తన పథకం సూత్రప్రాయంగా తెలియజెప్పాల. వీళ్ళంతా తన శక్తికి ఆశ్చర్యపడతారు. కాగితాల్లో రాసి, చట్టాల్లో తెలివిగా బిగించిన దానికి తను అద్దం పట్టినప్పుడు... అప్పుడు!! ఇంకా తనలో స్వార్థంకోరుతున్న...తనలో తను చెప్పు కునే - కోర్కెలున్నాయి. తన చుట్టూ తిరిగే ప్రజానీకాన్ని ఇంటి చుట్టుపక్కల పెంపుడు జంతువుల్లా తిప్పుకోవాలి. తన చిరునవ్వుకు వీళ్ళంతా ప్రాధేయపడాలి. తన జన్మదినోత్సవాలూ. తన షష్టి

పూర్తులూ, వీళ్ళు చేసుకోవాలి. తన చిత్రాన్ని 23 తపాలా బిళ్ళలమీద ముద్రించుకోవాలి. తన బొమ్మ ప్రతి యింట్లో మహానాయకుడిగా చలామణి అవ్వాలి....తను వీళ్ళ పీకలు కొయ్యడు. వాళ్ళ బ్రతుకుల్ని వాళ్ళను బ్రతకమంటాడు. కాని, వాళ్ళలోని జడత్వానికి శిక్షగా, తన చుట్టూ వాళ్ళు తిరిగేలా చెయ్యాలి. పీకలుకోసే పద్ధతి తనకు నచ్చదు. కాని తను వీళ్ళ జుట్టు పట్టుకోవాలి. అదే తనకు కావాల్సింది. తను సామాన్యంగా వుంటే వీళ్ళు పరిహసిస్తారు. పరిహసించకుండా వుండే టంతమార్పు వీళ్ళలో చాలాకాలానికి వస్తుంది. వీళ్ళకు చాతనయింది ఇప్పుడు వొక్కటే....చుట్టూ తిప్పుకుంటే పూజిస్తారు....కాని, మీరంతా గొర్రెలు అని వాళ్ళ ప్రవృత్తి గుర్తించి వాళ్ళకు వివరించి చెపితే, సహించలేని తనంతో—నువ్వూ గొర్రెవే అంటారు. డబ్బున్న వాడుంటాడు. వాడి చుట్టూ ఆశగా తిరుగుతారు. ఇస్తాడేమో నని ఆశ. వాడు యివ్వడం ప్రారంభిస్తే, వాడి దగ్గర ఆ ధనం ఏప్పుడో ఖర్చయిపోతుంది. ఖర్చయిపోతే వొక్కడు తిరుగడు వాడి చుట్టూ. ఇప్పుడున్న తీరు యిది..తను దీన్ని దాటి పోలేకపో తున్నాడు. ఎమ్. ఎల్. ఏ. జగన్నాధం. తన వెనకాతల తన అడు గులో అడుగు వెయ్యాలి. ఎమ్. ఎల్. ఏ. సర్వారాయుడు తనతో వచ్చి సంప్రదించిపోవాలి. ఇద్దరు ఎమ్. ఏల్. ఏ. ల జుట్లు గుత్తంగా ....తన నొప్పి పుడుతున్న చేతుల్లో....వున్నాయి.

అతను గడ్డి నాలుగు పనలు కోశాడు. నవనవలాడే గడ్డి. ఉల్లికాడల గడ్డి. అతను దాన్ని కట్టేందుకు—ప్రయత్నంలో....

...పరిషత్ ప్రెసిడెంటు అయ్యేవరకూ తనకు సుఖంగా నిద్రపట్టదు. తన చిత్ర పటాన్ని మీటింగు హాల్లో విలువెత్తున పెట్టు కుని. వీళ్ళంతా పూజించాలి. భవనాలకు తన పేర్లు పెట్టాలి. గుడ్డి ప్రజ. బెట్టు సరిజేసే లోభిని, చేతకాని వాణ్ణి గౌరవించి, పూజించే మతిలేని బికారిగా తిరిగే ప్రజ!!...ఎవడి పొట్టతిప్పలకు వాళ్ళు పాట్లు పడుతోంటే. ఒకళ్ళు మరోళ్ళకు పూజలెందుకు చెయ్యాలి? పాద తీర్థాలెందుకు పుచ్చుకోవాలి!

అతను పచ్చిగడ్డిని పనల్ని ఎదురు బదురుగా ఒకదానిమీద ఒకటివేసి కట్టాడు. గడ్డి పసరువాసన వేస్తోంది. అతనికి దున్నపోతు

డొక్కలు జ్ఞాపకం వచ్చాయి. దాన్ని. సునాయాసంగా నెత్తిమీదికి ఎత్తుకుని. తాటితోట తలవేపు కదిలాడు. బట్టతలమీద వాత్తులేదు. తల గురగుర లాడుతోంది—ఏవో పురుగులు పాకుతున్నట్టు వేగంగా నడిచాడు. ఇంకా స్త దూరంలో తాటితోట ఉన్నవనగా. గడ్డిమోపును కింద పారేశాడు. తలను చేత్తో బాగా రుద్దుకున్నాడు. బాగా విప్పారిన పెద్దతాటాకుల్ని. వాటికున్న గరికను కొడవలి మొనతో లాగేసి. నాలుగింటిని సరి', నాలుగు వెడల్పాటి ఆకుగుమట్టల్ని పచ్చివాటిని సరికి: చంక కింద పెట్టుకొని వెనక్కి తిరిగాడు. అతను నెత్తిమీద గడ్డి మోపును ఒకచేత్తో పట్టుకున్నాడు. మరి ఒక చేత్తో తాటాకుల్నీ మట్టల్నీ శరీరానికి చేర్చుకుని. జారిపోకుండా నడుస్తున్నాడు. తనకు సహాయానికి ఇంకొక్కడున్నా బాగుండుననిపించింది. తనలాంటి వాడు మరొక్కడుంటే. —అవలీలగా తాడిలోతు ఊబిలో నుంచయినా దున్నపోతును బయటికి లాగి, కిందపడవేసి, బడితెకు వేలాడగట్టి మోసుకుపోదును—అనుకున్నాడు.

ఒకసారి.... తనూ డ్రైవరూ మేనమామ ఇంట్లో పెళ్ళికి చుట్టాల్ని తీసుకొచ్చేందుకు వెళ్ళి బురదలో కూరుకుపోయిన కారును అవస్థపడి బయటకు లాగిన పాతసంఘటన జ్ఞాపకం వచ్చింది.

అతనికి తన కొడుకులు జ్ఞాపకం వచ్చారు. తన పోలిక కలిగిన రూపాలువాళ్ళ పెళ్ళికి ముందు. తనకు తన కొడుకులు కనుపించరు. జీవితం నడుస్తున్న కొద్దీ ఇవన్నీ చొచ్చుకు వెళుతున్న కొద్దీ... ఆనందం....తపన...అర్థమవుతూంటాయి. తన ఇద్దరు కొడుకులు స్కూళ్ళలో చదువుకుంటున్నారు కాని మూడోవాడికి...అప్పటికి తనకు కాస్త తెరిపి అవుతుంది....వాడికి చదువు, ఈ స్కూళ్ళు అనేవాటిలో నేర్పించ గూడదనిపించింది రాఘవులుకు. తన కొడుకుని, మరో నలుగురయిదుగురు పిల్లల్నీ. చేర్చి. ఒక బాగా పుస్తక జ్ఞానం వున్న వాణ్ణితెచ్చి. వాళ్ళకి చదువు చెప్పించాలనీ. ఆ తర్వాత వాళ్ళకి కావాలన్న. అభిరుచి వున్న పుస్తకాల్ని తృష్ణతో వాళ్ళే తెప్పించుకుని చదువు కుంటూంటే అప్పుడప్పుడూ పెద్దపుస్తక జ్ఞానం వున్నవాళ్ళ నుంచి శిక్షణలాంటిది లభించేలా చేయాలనీ అనిపించింది. వెంటనే అతనికి ఇప్పటి మూడో ప్రసవం, కూతురవుతుందో. కొడకవుతాడో

నన్ను సమస్య వచ్చింది. కూతురయితే మాత్రం?-అనుకున్నాడతను. పుస్తక జ్ఞానం కావాలి తనపిల్లలకి, చదువు అక్కర్లేదు వాళ్ళకి. వాళ్ళంత వాళ్ళు బ్రతగ్గలగాలి. చెడ్డ, ప్రభుత్వాల్ని ముఠాలవాళ్ళనూ. సమూలంగా పడగొట్టి: కొత్తరకం మానవతకి దోహదంచేసే వాళ్ళవాలి. ఒకళ్ళ పంచన, ప్రభుత్వాల అండన. పార్టీల చాటున బ్రతకడం తన సంతతికి వద్దు. వాళ్ళు తల్చుకుంటే దేశపరిస్థితుల్ని తారుమారు చెయ్యగలగాలి. తను బ్రిటిషు వాళ్ళ హయాంలోపుట్టాడు. తన కొడుకులు, ప్రజాస్వామ్యం పుడుతున్న రోజుల్లో స్థిరపడుతున్న రోజుల్లో కర్తవ్యాన్ని మర్చిపోయి దేశనాయకులు పదవులకోసం కొట్లాడుకునే రోజుల్లో—పుట్టారు. తన ముందుతరం వాళ్ళు. దోచుకుంటున్న బ్రిటిషు వాళ్ళను నెట్టి వేసేందుకు నడుంకట్టి దేశమంతటా నిలబడ్డారు. తన సంతతి ప్రత్యేక పాలకవిధానాల్ని నెలకొల్పగలగాలి...తను, అవినీతి పరుల చేతుల్లోంచి, అభివృద్ధికి ఆటంక పడే వారి చేతుల్లోంచీ,—శాసనాధికారాల్ని గుంజుకోవాలి. ప్రజాక్షేమానికి, అభివృద్ధికి పాటుబడాలి. తన సంతతి బాగా ప్రయోజకులవాలి—కొంత మంది మొదట్నుంచీ అలా తయారయి పోతారు. కొంతమందిని కొన్ని సంఘటనలు అలా మారుస్తాయి. కాని. తను వాళ్ళనలా తయారుచేస్తాడు వాళ్ళు తను ఆశించిన దానికంటే ఎక్కువగా తయారయి, ప్రపంచాన్నే ఇష్టమొచ్చిన విధంగా మార్చివేయాలి ...'నా సంతతి మానవోత్తములవాలి. నన్నూ, నా ఉనికినీ శాశ్వతం చెయ్యాలి...నానుంచి నావంశంలో నవ్యత ప్రారంభమవాలి...' అతను తనలో తను అనుకున్నాడు, తాపీ పనిచేసుకునే వాడికొడికుకూ. చెప్పులుకుట్టి బ్రతికేవాడి కొడుకూ. చెట్టుకింద ప్లీడరుకొడుకూ, చేపలు పట్టుకునే ఓడ కళాసీ, గొర్రెలు కాసుకునే వాడూ, సామాన్య సైనికుడూ. ఆ రోజుల్లో,—ఏ శిక్షణా లేకుండా భూగోళాన్ని ఇష్టమొచ్చినట్టు తిప్పగలిగినప్పుడు- నవీనతను ఇంత బాగా విడమర్చి చెప్పి, చర్చించి వాళ్ళలో ఆ విప్పురవ్వను రేపగలిగిననాడు, వాళ్ళు ప్రపంచాన్ని తమ పాదాల దగ్గరకు తెచ్చుకోలేరా?...అని అతను ఆలోచించాడు. మనిషి తయారవడంలో పెంపకానికి ఎక్కువ పాలున్నదన్న నిశ్చయం కలిగింది.

"నేను దున్నపోతును. పొద్దుగర్భంలో పడేలోపుగా బయటికి తీస్తాను" అతను పళ్ళు బిగించి అన్నాడు. అతని ముక్కు పుటాలు పెద్దవిగా అయినాయి. అతని కాళ్ళు ధీరంగా పడుతున్నాయి. అతని భుజంలోకి రక్తం ప్రవహించి అతనిలో ఒకవిధమైన తిమ్మిరిని కలుగజేసింది. శ్వాసగాఢంగా పీల్చి గట్టిగా వదిలాడు. అతని నెత్తి మీద గడ్డిమోపు. చంకలో వొబ్బిడిగా నడిచేలా చేస్తున్న. తాటాకులూ. మట్టలూ. పచ్చివి బరువుగా వున్నాయి.

...అడవి మెత్తదానికి ప్రతిరూపమవ్వాలి. ప్రకృతిలో ఇచ్చే వాడుమగాడూ. తీసుకునేది ఆడదీ. ఆ ప్రవృత్తులు ప్రకృతి ననుసరించి అలానే సాగాలి. మగాడు మురుకుదనానికీ ఆడది స్తబ్ధతకీ ప్రాతినిధ్యం వహిస్తున్నప్పుడు వాళ్ళ వృత్తులూ. చేష్టలూ అలానే వుండాలి. ప్రమీల ఆ విధంగా. భార్యగా తన కర్తవ్యాన్ని తను నెరవేరుస్తున్న దనిపిస్తుంది తనకి....

రాఘవులు నెత్తిమీది బరువునూ. చంకను పట్టి తెస్తున్న వాటినీ కంప మోపు పక్కన వేశాడు....బట్టతలను దులుపుకున్నాడు. గడ్డి పరకలు రాలాయి.

ఆలోచిస్తూనే అతను మోపులో చెయ్యిపెట్టి దుంగల్ని లాగాడు. బడితెలు తీశాడు. ఒక్కటొక్కటే ముందుకు గిరవాటేస్తున్నాడు. దున్నపోతు దరికంటా అవి వూబిలోపడి "ధుప్" మంటున్నాయి...

మళ్ళీ తడపాలనిపించింది కండువాను. అతను వెళ్ళి తడుపుకొచ్చాడు నీటి వాలులో. బురదవోయిన కండువాను. చెయ్యి మండుతోంది. కుడిచేయి నడిమి వేలికి ఎడంపక్కగా పుండు ఎర్రగావుంది. తొక్కలేచిపోయింది. అది. నీళ్ళు తగిలితే. వొత్తుకుంటే. ఏదయినాతగిలితే మండిపోతోంది. గబగబా కండువాను మెడచుట్టూ వేసుకున్నాడు. బడితెనువూతగా పుచ్చుకున్నాడు. బడితెను వున్న బుడిపెలు చెక్కేశాడు. కండువా నీటిబొట్లతో మెడంతా చల్లబడుతోంది. వాటిని బనీను పీల్చేస్తోంది. బనీను మీదికి నీళ్ళు జారుతున్నాయి.... గుండెల్లో వెచ్చగా వుంది.

అంతకుముందులానే. అతని కాలు మోకాలివరకూ వూబిలో దిగిపోయింది. ఊబిమీద ఎదురుగా. కావాలని మళ్ళీ అక్కడ ఎవరో

పెట్టినట్టు, చేతి దూరంలో ఎముక కనుపించింది. అతని వొళ్ళంతా కాకరకాయలా అయిపోయింది—గగుర్పాటుతో. దాన్ని గభాల్న చేత్తో అందుకుని, బయటకి మరోవేపు గిరాటు వేశాడు. అది చివర్న వూబికి తగిలి, అతను చెప్పినట్టు వినకుండా వెళ్ళి, వూబిమీద బాగా అవతలిగావున్న పక్క ఎముకలమీద పడింది. ఆ సంఘటనచూసి, అతనికి దయ్యాలున్నాయనిపించింది. అది దయ్యపు చేష్ట అనిపించింది. ఇంకో కాలు వూబిలో వెయ్యడానికి జంకాడు. తెలియని పాడుపడిన చీకటింట్లోకి, శ్మశానాల మధ్య, అర్ధరాత్రప్పుడు చొరబడుతున్నట్టనిపించింది. మళ్ళీ.... తెగింపు వచ్చింది. చేత్తో బడితెను ముందుకువేసి గుచ్చి, దానిమీద కొంత బరువానుకుంటూ, కాలును లోతులోకి పోనిచ్చాడు. మరో బడితెను అందుకుని ఇంకొంచెం ముందుకువేసి, లోతు తెలుసుకున్న తర్వాత, దానిమీద ఆసరాగా, ఇవతలి కాలును లాక్కుని ముందుకు వేశాడు.

... ఏమయినాసరే!

....వూబి అంతులేకుండా పాతాళంవరకూ వున్నాసరే.

....ఎముకలన్నీ కాళ్ళ అడుగున పేర్చుకుని వున్నాసరే

...పోనీ. ఒక ప్రాణంకోసం నా ప్రాణం పోతోంది.

...ఒక్కరోజు బ్రతుకు చాలు.

...అయినా నేను సామాన్యమైన చావు చావను.

—కాలును వేస్తున్నాడు, లాగుతున్నాడు...మళ్ళీ ముందుకు వేస్తున్నాడు.... కాలును పూర్తిగా వూబిలో కంటా వేయకుండా, ఏడడుగుల బడితెలమీద పూర్తి భారాన్ని మోపుకుని, కాలు మళ్ళీ లాక్కుంటున్నాడు. తొందరగా తను దున్నపోతును చేరలేక పోతున్నాననిపిస్తోంది. ఈ కాలు పదిహేనుసార్లు, ఆ కాలు పదిహేను సార్లు కదిపాడు. పెద్దగా లోతు అనిపించడంలేదు వెళ్తోంటే. వెళ్ళిన కొద్దీ వూబి గట్టి పడివుంది. కాని, బడితెల సహాయం లేక పోతే, తను నడుంవరకూ దిగబడిపోయే వాడనిపించింది. ఇంకో బారెడు దూరంలో వుంది దున్నపోతు. దానితోక వూబిలో ఇరుక్కుపోయివుంది. వూబి ఈ రెండురోజుల్లో అలా గట్టిపడిపోయి వుంటుంది. అది వేసిన పేడకొంత వూబిలోకిపోయింది. కొంతపైన

పరుచుకునివుంది. రొచ్చు వాసన వేస్తోంది గాలి. దాని పుండు తెముల్చుకునేటంతటి కుళ్ళు వాసన వేస్తోంది. అది కదలడంలేదు. ప్రాణంవుందో పోయిందో; కాలు ముందుకంటే. ఇప్పుడు బాగా తీయగలుగుతున్నాడు రాఘవులు—

"ఈ...య్యే" అన్నాడు శ్వాసను ఎగబీలుస్తూ.

దున్నపోతు కదిల్చింది దాని తల.

"ఈ....య్యే' రాఘవులు దమ్ముపడుతూ అన్నాడు. దాని మీద చెయ్యివేశాడు. వెచ్చగా, కాగివుంది. దున్నపోతు సాధ్యం చేసుకుని తలను ఎత్తబోతోంది. దానికి శ్వాస ఆడుతోంది. లోతులో వున్న డొక్కలు కదులుతున్నాయి వుండి వుండి—నెమ్మదిగా; బహునెమ్మదిగా. ఎక్కువ నాళ్ళు లంఖణాలు పడిన రోగిలావుంది దున్నపోతు. నిరాహార వ్రతం చేస్తున్న దానిలాగా దాని మూతిమీద పన్నటి పల్చటి పారుపాటి వెంట్రుకలు కదుల్తున్నాయి.

రాఘవులు దాని పుండు మీదినుంచి వచ్చే కుళ్ళు వాసనను భరించలేకపోయాడు. "ఊబి మట్టి' తీసి, ఆ పుండుమీద వేశాడు ముద్దకట్టి. తన మెడకు చుట్టుకు వచ్చిన కండువాను, కర్రలమట్టూ చేతుల్ని చుట్టి, దండచేతులమీద అనుకుంటూ, దాని ముచ్చిక గుంట మీద నీళ్ళు పిండాడు. గోశీలాడుకునే గుంటలాగా వున్న, దాని తల మీద కొమ్ముల మధ్య, తెల్లటి పొట్టుతోకూడినచోటు, నీళ్ళతో నిండింది, దాని మూపుమీదా, వొంటిమీదా, నీళ్ళు కారుతున్న కండు వాను పరచి సర్దాడు. సంశయిస్తూ, పుండుమీది కంటా కండువాను విస్తృతం చేశాడు, అతను దాని ఒంటిని నిమురుతోంటే అది కదలడం లేదు. కుళ్ళు పుండు వాసన తగ్గింది, రాఘవులు దాని కాళ్ళ ప్రక్క వూబిని నొక్కుతూ పెల్లగించాడు. అక్కడ ఏమాత్రం కదిల్చి దాని నిలకడను పరీక్షించినా; అమాంతంగా, దున్నపోతు, పూర్తిగా, బడితె లోతు అడుక్కుంటా వెళ్ళిపోతుందనిపిస్తోంది.... తను ఇంక పని ప్రారంభించాలి.

అతను పొద్దు పక్క చూశాడు.

అతనికి దున్నపోతు బ్రతుకుతుందన్న ఆశ కలుగుతోంది. దానికి ప్రాణభిక్ష పెట్టిన ఘనత దక్కించుకుంటాననిపిస్తోంది. తను

కూడా మహా ఆ విపత సమయంలో వున్నట్టు తెలుస్తోంది. అతను దున్నపోతు వెనక్కి వెళ్ళి, వొడ్డు వేపు తిరిగి, పరీక్షగా చూశాడు... అంచనా కడుతున్నాడు....ఊబి లోపలికీ...ఊబి పక్కలకూ....అతని చూపులు ఆతను వూబిలోకి గిరాటువేసిన బడితెలు వరుసగా వున్నాయి. అక్కడనుంచి చివరవరకూ, అక్కడినుంచి, అలా చివరవరకూ: గజం ఎడంవుంచుతూ రెండువేపులా బడితెల్ని దింపుకుంటూపోవాలని అలా రెండేసిగా పాతాడు; కొంచెం బలాన్ని ఉపయోగించి లోపలి కంటా దింపుతూ, గజంనరలోతు దిగుతున్నాయి బడితెలు. అతను చివరికంటా అలానే పాతుకుంటూ పోవాలని. వెంట వెంటనే వూబిలో నడిచివేయడం—అతని కాళ్ళకు అలసట కలుగుతోంది - ఊబి లోంచి లాక్కోవడంవల్ల బడితెల్ని వూతగా చేసుకుని. కంచె కట్టినట్టు తనకి ఎడంచేతి పక్కనా, కుడిచేతి పక్కనా, ఎదురుబదురుగా బడి తెల్ని క్రమంగా పాతుకొస్తున్నాడు. ఆఖరికి వచ్చేస్తూ, వున్నవాటిని సరిపుచ్చాడు. కలికి ఎముక లేవీ తగల్లేదు. వూబికూడా ఎక్కువగా లోతు లేదనిపించింది... బయటికి వచ్చాడు. కొంత సాధించానన్న తృప్తి కలిగింది...నొసటి నిండా విల్చిన చెమట బిందువుల్ని ముంజేతుల్తో తుడిచేశాడు. అతని చేతులు మట్టితో నిండి వున్నాయి. చేతుల్తో తొడనుంచి కిందివరకూ అంటకడుతున్న మట్టిని విదిలించు కున్నాడు.

కత్తిని పుచ్చుకుని ఎండకు వాడిలిపోతున్న తాటాకుల్ని చీరి, దొన్నె కట్టాడు. రెండింటిని కలిపి, తీగల్తో గట్టిగా బిగించాడు. కోయవాళ్ళూ, ఆటవికులూ చేసే పనులన్నీ తను చేస్తున్నట్టు అని పించింది. ఒక మైలుదూరం వెళితే, తమ పొలంనుంచే పారలూ బాల్చీలూ తేవచ్చు. పోనీ ఆరు ఫర్లాంగులు వెళ్ళినా, ఎవరి పొలాని వయినా తేవచ్చు. కాని, అక్కడవరకూ వెళితే పొద్దు సరిపోదు. అతనికి సంతృప్తి అయింది—పచ్చి తాటాకతో దొన్నెను చేయడం. తెచ్చిన వెడల్పాటి తాటి మట్టల్ని తెగగొట్టాడు—కంపమీద ఆనించి వొత్తు పెట్టుకుని, కంపని చెల్లా చెదురుగా విప్పి, ఊబిమీదకి బడి తెల పక్కగా విసురుతున్నాడు....

సాయంకాలం తోచక, వ్యాయామం కావాలనే వాళ్ళచేత -

ఇటువంటి పనులు చేయిస్తే బావుండుననిపించింది. స్కూలు కుర్రాళ్ళ చేత తీరిక సమయాల్లోనూ. సెలవుల్లోనూ. వాళ్ళకి రోజు జీతాలిచ్చి-ఇటువంటి పనులు చేయిస్తే. వ్యాయామానికి వ్యాయామమూ. గష్టపడి గడించే సమర్ధతా లభిస్తాయని తోచిందతనికి.

...అతను విసురుతున్న గాలికికంప కొంత బడితెల మధ్యా కొంత బడితెల బయటా పడిపోయింది. దున్నపోతు దరికంటా పోలేదు. మధ్య గుట్టగా పడిన చోటు నుంచి. మళ్ళీ విసరాలనుకున్నాడు. ఈ కంప సరిపోదేమోననిపించింది. తెగగొట్టిన తాటి మట్టల్ని పచ్చివాటిని బాగా దున్నపోతు దగ్గరికి విసిరాడు. దొన్నెతో నీళ్ళు తీసుకు వెళ్ళి దున్నపోతుచేత తాగించాలని. దాని నాలుక కదప లేని స్థితి. కనీసం మూలగనయినా మూలగలేని పొడి పడిన గొంతు పరిస్థితి చూసిన రాఘవులు నీళ్ళు తీసుకుని వెళ్ళే ప్రయత్నంలో మరో చిన్న తాటాకు రేకుని దొన్నెచేసి దానిని కాలవ నీళ్ళతో నింపాడు. కూర్చుని. తీగల్తో దొన్నెను చివర్లకట్టి. మెడలో వేసుకుని. ఏమాత్రం నీటిబొట్టూ వొలక్కుండా దాని దగ్గరకు తీసుకుని వెళ్ళాలని. దొన్నె నిండా వున్న నీళ్ళు సగంవరకయినా వొలక్కుండా చివరివరకూ వెళ్ళవన్న అనుమానం.

జాగ్రత్తగా నడుస్తున్నాడు. కదలిక లేకుండా నడవాలి. వూబిలో కూడా దొన్నెకేమాత్రం ప్రమాదం కలగకూడదు. ఏకొంచెం కదలినా. నీళ్ళు బాగా వొలికిపోతాయి....తను పడ్డ శ్రమకి ఫలితం దక్కదు... బరువుగా పడుతున్న అతని కాళ్ళు యిసుకలో కూడా ఏమాత్రం శబ్దం చేయడం లేదు. దొన్నె బరువెక్కి మెడను తీగల్తో నొక్కేస్తూంది. చేత్తో దొన్నెను కదలకుండా పట్టుకుని. మరో చేత్తో. వరసగా తను పాతిన బడితెల్ని ఆసరాగా చేసుకుని నడవాలని అతని వూహ. అలాగ. కాలు వేశాడు. చాల తేలికగా కాలు పడింది-మెత్తటి ఇసుకలో కాలు వేసినట్టు....మళ్ళీ ఒక చేత్తో దొన్నెను పట్టుకుని. ఒక చేత్తో బడితను ఆసరా చేసుకుని...అతను కాలును కదుపుతున్నాడు. తీగపట్టుజారి. దొన్నె వూబిలో పడిపోతుందేమోనని భయం. వుండి వుండి నిలబడి. దారికడ్డువచ్చిన మండల్ని పక్కకి నెట్టుతున్నాడు... ముందుకి చిమ్ముతున్నాడు. కాలు తొడబంటి దిగ

బడుతోంది. అడుగులు లెక్కపెడుతూ దున్నపోతును అతి జాగ్రత్తగా చేరాడు. ఆనందంలో దొన్నె జారిపడుతుందేమోనన్న భయం.

దున్నపోతు మీద కండువా చల్లదనం పని చేసినట్టు అతనికి తోచింది. పరీక్షిస్తూ. పరిశీలనగా చూశాడు.

అతను పిలిచాడు.—"దున్నా??"

ఆ పిలుపులో స్నేహార్ద్రత. మమత ధ్వనించాయి.

దున్నపోతు తల మిల్లి మీటరు కదిలింది పక్కకి.

"దున్నా.... భయం లేదు" అన్నాడు.

అతను చేత్తో దాని మూపును తడిమాడు. కండువా బాగా చల్లగా వుంది. కండువాను పైకెత్తి దాని వొంటి మీద చెయ్యి వేశాడు—జ్వర తీవ్రతను తెలుసుకునేందుకు తండ్రి చెయ్యి కొడుకు వీపును స్పృశిస్తున్నట్లు, బాగా కాగిన భూమి మీద, కొద్ది మాత్రం తడుపు వాన కురిసి, వెలిసిన తర్వాతలా వుంది...ఆవిరి వస్తూంది దాని శరీరంలోంచి. వొగర్పు తగ్గలేదు. దాని నున్నటి మందపాటి నల్లటి చర్మానికి ఇంకా స్పర్శ జ్ఞానం కలగలేదు. మెల్లగా దాని పక్కగా ముందుకు, బడితె సహాయంతో, దాని కళే బరం సహాయంతో చేరి; దొన్నెను తన మెడలోంచి విప్పి, ఎంతో మెలకువగా గాని ముందు పెట్టాడు రాఘవులు. అది కదలడంలేదు. నీటి వాసన దానికింకా అందలేదు. దొన్నె దానికి మరింత దగ్గరగా పెట్టాడు. అది మూ చూడడం లేదు. అది యోగనిద్రలో వున్నట్టు వుంది.

"తుర్ర్ర్ వ్వ్" అన్నాడు గట్టిగా.

అది మూతిని కళ్ళు మూసి వుండగానే కదిల్చింది. ఎడారి మధ్యన పడిపోయిన ప్రాణిలా దాని మూతి ముందు భాగం బాగా ఎండిపోయి వుంది. కోసిన పెండలం ముక్క ఆరిపోయినట్టుగా—

రాఘవులికి, ఒకవేళ దాని మూతి తగిలి. దొన్నె తిరగబడు తుందేమోననిపించింది. ఒక పక్కగా వున్నవాడల్లా, దొన్నె ఒక వేపు కొనను పట్టుకున్నాడు. మళ్ళీ 'తుర్ర్ర్ వ్వ' అన్నాడు. రిక్క వేస్తున్నాడు వుండి వుండి. అది మూతిని దొన్నె మీద పెట్టింది. దాని చెవులు కదిలాయి. బహూశా అది ఆశ్చర్యం అయి

వుంటుంది. కల గన్నట్టు వుండి వుంటుంది. దానికి. దాని మూతి మీది పై భాగం బాగా కదిలింది. పసరు వాసన వేసింది. దాని శ్వాస, నీటి మీద బహు సన్నటి అలలు రేపింది. రాఘవులి మనస్సుకి ధైర్యం కలుగుతోంది. అది నీళ్ళను కొంచెం చప్పరించింది....మూతిని దొన్నెలో పెట్టి వెనక్కి తీసింది....నెమ్మదిగా మూలిగింది. నాలుకని నీళ్ళలో వుంచింది. రాఘవులు పదే పదే 'తుర్ ర్ ర్' అంటున్నాడు. అతను మరోవేపునున్న దాని కాళ్ళవంక చూస్తున్నాడు....అది కిందికి దిగిపోతుందేమోనని అతని భయం—అది వూబిలో అడుగు కంటా పోతుందేమోనని. అతను రెండో చేత్తో బడితెను గట్టిగా పట్టుకున్నాడు.

దాని నాలుక దొన్నెలోపలి నీటిలో వుంది. కదుల్తోంది నాలిక కొయ్యముక్కలాగా. నాలిక నీలంగా వుంది. పసుప్పచ్చ పాచి తేరివుంది. దాని మూతీ నాలికా కదుల్తోంటే అతనికి కడుపులో తెములుకొస్తూంది..

వూబిమీద వున్న దొన్నె, అది తాగుతోంటే, సర్దుకుంది; దాని మూతి బరువు తగిలి నీటినది నాలికతోనే చప్పరిస్తూంది పాములా, కుక్కలా.

ఈ నీటికోసమే దున్నపోతు ఇంత ముందుకు వచ్చి వుండాలి. నీళ్ళు తాగుదామనీ, బురద కుళ్ళు గుంటలో మునిగి దొర్లు దామనీ; కాని, ఇంతలోతు వూబిని ఎలా దాటగలిగిందీ అన్న ప్రశ్న రాఘవుల్ని సాగదీసి అడుగుతోంది. అతను వొకసారి కావాలని వూబి వంక చూశాడు, వూబి చివరి వేపుకంటా. మధ్యనుంచి గట్టి పడుతోంది. చివరికంటా మధ్యన ఎత్తుగా వుంది-వుబ్బి.

దున్నపోతులోంచి రెండు మూడుసార్లు "ఈ...." అనే శబ్దం వచ్చింది. అది దాని అశక్తతతో కూడిన ఏడుపులా వుంది. గట్టిగా ఏడవలేక, తనలో తనే కొట్టాడుతున్న సామాన్య సంసారిలా వుంది. అది కుక్క మోస్తరుగా నాలికతో తాగుతోంది దున్నపోతు నీటిని. నాలిక ముందుకీ వెనక్కి కొంచెం కొంచెం కదులుతోంది. ఒకసారి పీల్చింది...

రాఘవులు ఇంక పరవాలేదనుకున్నాడు.

దున్నపోతు తల కదిల్చింది.

రాఘవులు ప్రేమగా "దున్నా" అన్నాడు. మనస్సు ఆనందంతో నిండుతోంది. కష్టాల్లో వున్న స్నేహితుణ్ణి ఆదుకున్నప్పటి ఆనందం...తనకై జీవితాన్ని ధారపోసే, మరో వ్యక్తికోసం త్యాగం చేస్తున్నప్పటి తృప్తి!

దున్నపోతు దొన్నెని బోర్లతొయ్యకుండా పదిలంగా నీటిని తాగుతుందన్న నమ్మకం అతనికి కలిగింది అంచేత యింక తను తన పనికి పూనుకోవచ్చునని పించింది. అది తల కదిపినప్పుడు దాని మెడక్రింద వూబిమీదుగా ఏదో కదుల్తున్నట్టు తోచింది. ఏదో తను పనిగట్టుకుని చెయ్యాల్సింది ఏదో చెయ్యలేదన్న భావం మనస్సుని పీకుతోంది. అతను తలవంచి, దాని మెడపక్కకి చూశాడు...రెండు జలగలు!!....తను ముందు వాటిని లాగెయ్యాలనుకున్నాడు. వూబిలో దిగకముందు, ఒక జలగ బాగా లావెక్కిపోయింది. ఒకటి అంతకు ముందే పట్టినట్టు కనిపించింది. నీళ్ళలోంచి వచ్చివుంటాయి. అవి అతను చేతిని చాచి, పీకి, గిరాటేశాడు లావంటి దాన్ని. దున్న మెడమీది ఎర్రటి కొరుకుడులోంచి జలజలా రక్తం పడుతోంది. మెత్తటి జలగని ముట్టుకున్న అతని చేతికి తెలియక పామును పట్టుకున్నట్టు అయింది. చేతిని వూబిమీద రాశాడు. ఇంకో చిన్న జలగ వుంది...అదీ యింకాస్సేపట్లో బాగా లావెక్కిపోతుంది....చీకటి బజారు వర్తకులు జ్ఞాపకం వచ్చారు అతనికి, తాలూకా ఆఫీసుల్లో గుమస్తాలూ, కోర్టుల్లో గుమస్తాలూ, లాయర్లు, డాక్టర్లు. గాలికి కదిలినట్టు. పట్టు చిక్కించుకోవడానికి కదుల్తోం దది....తలని ముందుకు చాచింది. తనకి పట్టు చిక్కి వాటిని వదుల్చుకోవడం కోసం కన్నులు సగం మూసింది. రాఘవులు, రెండో జలగను, చేతిని దగ్గరకు పెట్టి గొంతు పిసికినట్టు పట్టుకుని లాగి ఒదదీసి గిరాటేశాడు. చూట్టూ చూశాడు, ఇంకా ఏమీ కనిపించడం లేదు. చిన్న జలగ యింకా దాని మెడను కొరకలేదు. ఊబితో రక్తం కారకుండా ఆగేందుకు కొరుకుడిని రాశాడు అతను, మెడను చేత్తో గట్టిగా రుద్దాడు. అతని నోట్లోంచి, అలా చేస్తున్నంతసేపూ—

"హింస....చిత్రహింస" అన్నమాటలే.

ఇంకా రుద్దుతోంటే, అతని అరచెయ్యి మంటపుడుతోంది. ఇంత నయినా పని మొదలు పెట్టకపోతే పొద్దుకూకేలోగా పూర్తి చేయ లేననిపించింది. అతను తన చేతుల్ని నులుముకున్నాడు. ప్రతిసారీ పని ప్రారంభించే ముందు—'సర్వాంతర్యామి' అనుకోడం అతని అలవాటు. అలా అన్నాడు...దున్నపోతు వెనక్కి వచ్చి పారుతున్న కాలవ ముఖంగా నిలబడి, రెండు చేతులతోనూ పూడిని ఎత్తి చేయి విసర గలిగినంత దూరం పక్కకి విసిరాడు...చేతులు మంట... అలాగ. అతను చేతుల్తో దున్నపోతు వెనక, బడితెల మధ్య వున్న పూడిని విసురుతున్నాడు, వీలయిన వైపల్లా. ఊబి మట్టి. చేతుల్లోకి ఎక్కువగా రావడం లేదనిపించగానే, చుట్టూరా వున్న నరికిన తాటి మట్టల్ని అంది పుచ్చుకున్నాడు. అవి గడ్డపారలా వుపయోగపడు తున్నట్టు అతను భావించాడు. వాటిని తొక్కిసలాడుతున్న బురద లోకి నెట్టి, వాటినిండా బురద తీసుకుని పక్కలకి విసురుతున్నాడు. ఏ పట్టూలేక ఎదుములోతు పూడిలోకి దిగిపోయాడు...అతని చేతులు మాత్రమే కదుల్తున్నాయి....

...బడతెల మధ్య పూడి బురదను తీసి, దూరంగా పక్కలకి వేయగానే, మళ్ళీ బడితెల బయటనుంచి పూడి. బడితెల మధ్యకు సాగి వస్తోంది. గొలిగి మండల్ని అంది పుచ్చుకుని బడితెల బారుగా, సందు కలిగిన చోట అడుగుకు నొక్కుతున్నాడు రాఘవులు. తాటి మట్టల్ని పక్కకినెట్టి. చేతుల్తో ఎగజిమ్ముతున్నాడు...చేతులతో కానప్పుడు తాటి మట్టలతో పట్టుపట్టి పూడిని లాగుతున్నాడు రాఘవులు, ముద్ద ముద్దలుగా, జారుగా మట్టలనిండా తీసుకుని, 'థాస్....థాస్' మని విసురుతున్నాడు.

రాఘవులికి పాలేర్లు జ్ఞాపకం వచ్చారు. తను చేస్తోంటే వాళ్ళు బాధపడతారు. మొదట్లో తను పొలం వచ్చి పనిచేస్తున్న ప్పుడు వాళ్ళు అలాక్కాదు, ఇలాగనీ. ఇలాక్కాదు అలాగనీ, తనకు సూచన లిచ్చేవాళ్ళు. చదువుకున్నోళ్ళకు, మీకేం వ్యవసాయం పనులు తెలుస్తాయి చెప్పండి—అనేవాళ్ళు. కురిసీమీద కూచో వలసిన మారాజువు, నీకీ గతెందుకు' అనేవాళ్ళు. మీ నాయనగారి లాంటోళ్ళే సెయ్యరు. మీకెందుకా బాధ అనేవాళ్ళు. వాళ్ళకేం తెలుసు

తను పడుతున్న బాధ...తను పడ్డ అవమానాలు ....తనలో కలిగిన సంచలనం! ఒక మూడువందల రూపాయల వుద్యోగం యిచ్చి కొంత మంది స్వార్థపరులు తన నోరు నొక్కాలన్నా తను లొంగడు. బ్రిటిషు సామ్రాజ్యాన్ని ఎదిరించిన వాళ్ళల్లో ఎంతమంది వుద్యోగాల్ని వదిలి. పోరాడలేదు. అలాంటివాడే తను. తను, తనకు కనిపించే వ్యత్యాసాన్ని చూసి, హృదయానికి బాగా పట్టించుకున్నాడు. చట్టాల్లో ఉన్నది అమలు జరగక పోయినారాజ్యాంగం సక్రమంగా నడవక పోయినా—తను కల్పించుకుంటాడు, తనకివన్నీ రాజధానిలో వచ్చిన ఆలోచనలు. డబ్బున్నవాళ్ళు తినడం లేనివాళ్ళు పారేసిన విస్తర్లు నాకడం. ఒక్కోరోజు తను తృప్తిగా తిన్న రోజులేదు. అగ్ని... అగ్ని...అగ్ని. మానవత్వం ఈ హెచ్చుతగ్గుల్ని మార్చాలన్న బాధ....

....ఆ జీవితం, అప్పటి సేవాపరాయణతా వేరు. స్వదేశీ ఉద్యమమప్పుడు డిగ్రీ పుచ్చుకున్న వాడిని చూస్తే అందరికీ నవ్వులు. గుమాస్తా అంటే నీచం. అయినా అందరిలాగా....ఇప్పుడు తనూ ప్రయత్నించాడు గుమాస్తా గిరీకోసం. కాని తనకు దొరకలేదు, అందరూ, తమకు అదొక జన్మహక్కులా మంత్రుల్ని విమర్శించడం, వెకిలిమాటలు, ఇంటర్వ్యూలకు వెళ్ళడం, భక్తి ప్రపత్తులతో నమస్కారాలు చెయ్యడం, నన్ను గొడ్డులా వుపయోగించుకోండి అనడం. డైరెక్టర్లూ, సెక్రటరీలూ ఇంటర్వ్యూచేసి, కష్టించి దున్నపోతులా పనిచేసే అహంచచ్చిన వాళ్ళను ఏరుకుని. వాళ్ళకు వుద్యోగాలిచ్చే వాళ్ళు. ఇవన్నీ చూసి. వొకరోజున తనువొక అధికారి అనబడే అతనితో—

"సంవత్సరంన్నరనుంచి ఉద్యోగం కోసం తిరుగుతున్నాను నాకు గుమాస్తా పని ఆయినా రావడంలేదు. ఎందుకీ వెధవ డిగ్రీ కాగితం, జీతానికి పనికిరానిది ఏదోనేర్పి, ఒక కాయితంమీద సంతకం చేసి, విశ్వవిద్యాలయం ఒక మనిషిని గెంటగానే సరిపోయిందా? దీనిని ఒక సభపెట్టి కాల్చిపారేసి. సన్యాసం పుచ్చుకుందామనుకుంటున్నాను. (అది అంతా ఉక్రోషం—తనలో మిగిలిపోయిన చేతకాని తనం.) చేతకాని పరిపాలనలు, ఎప్పుడో ఎవళ్ళో సామ్రాజ్యవాదులు వచ్చి,

డిగ్రీ చదువులని పెట్టి, గుమాస్తాల్ని తయారుచేసుకుంటే, ఇంకా ఆ పద్ధతుల్నే అనుసరించకపోతే ఇంకోరకం విద్యావిధానంలేనే లేదా? ఒక గొర్రె అన్నింటికన్నా ముందు తలొంచుకుని మీంచిపడి పోయిందిట....దాని వెనక తలొంచుకుని వెళ్ళి అన్ని గొర్రెలూ పడిపోయాయట. యూనివర్సిటీ ఒక పరీక్షపెట్టి డిగ్రీయిస్తుంది. మళ్లా, ప్రభుత్వం వొకపరీక్షపెట్టి ఉద్యోగం యిస్తుంది. ప్రభుత్వం ఎవరిది? యూనివర్సిటీ ఎవరిది? వీళ్ళే గ్రహంలో వాళ్ళు? వాళ్ళే గ్రహంలో వాళ్ళు? ఇండియాలో ఎద్మండుబర్కులూ, మెకాలేలూ, వాల్టేర్లూ, రూసోలూ పుట్టక పోవడం ఈ చేసుకున్న తప్పి దానికే యూనివర్సిటీల మీద నమ్మకంలేని ప్రభుత్వాలు! ప్రభుతాల్ని అర్థం చేసుకోలేని యూనివర్సిటీ! ప్రభుత్వం పెట్టే పరీక్షల్లో అడిగేవి చరిత్రా, సంస్కృతీ. చేసే వొద్యోగం కాపీలురాయడం, లెక్కలు కూటటం, ఉత్తరాలు రాయడం! మతిలేని పద్ధతులు ఎందుకండీ వీటిని ప్రజలమీద పెట్టిరుద్ది, వాళ్ళని చేతకాని వాళ్ళని చెయ్యడం? ఇంత మంది శాసనసభ్యులు, ప్రజానాయకులు, మేధావులు, (మేధావుల్ని కూడా తను తిట్టగలడు) ఈ పద్ధతిని మార్చలేరా? ప్రజాప్రతినిధులికి ప్రజల బాగోగులు అక్కరలేదా? ఇంతమంది బాధ్యత కలిగి అధికారాల్లో వున్నవాళ్ళు: సలహా సంఘాల మెంబర్లు,—ఇంతమంది నిరుద్యోగి నవయువకుల్ని నిర్వీర్యం చేసి, దేశానికి కీడు చేస్తున్నారో అర్థం చేసుకుని లెక్కలు కట్టుకుంటున్నారా?'' అన్నాడతను ఆవేశంగా.

సిగారు కాలుస్తూ, వొళ్ళు దులుపుకొని ఆల్సేషియన్ కుక్కను గుర్తుకు తెచ్చే భంగిమలో, ప్రశాంతంగా ఇంటర్వ్యూచేసే అతను—

''యు ఆర్ ఏ లెఫ్టిస్ట్'' అన్నాడు గట్టిగా.

తోడేలువంటి కుక్క ఒక్కసారే గట్టిగా మొరిగితే ఉలిక్కి పడ్డట్టు తను అయ్యాడు.

''నాకు ఇక్కడి లెఫ్టిస్టులంటె, పరాధీనమైన మెదళ్ళవాళ్ళని అసహ్యం'' అన్నాడతను.

''ఎని హౌ యు ఆర్ ఎ రివల్యూషనిస్ట్....'' అన్నాడు డైరెక్టరు.

"నీలాంటి వాడికి ఉద్యోగమిస్తే తాజెద్దకోతి వనమల్లా చెరుస్తుంది. గెటౌట్ ప్లీజ్."

అసలు, మొదట్నుంచీ ప్రభుత్వం కింద వుద్యోగం చేయ్యకూడదనుకున్నాడు. తను ప్రయివేటు సంస్థల దగ్గరకు వెళ్ళాడు. తనకి ఎన్నో స్వతంత్రాభిప్రాయాలున్నాయనీ. అవకాశమిస్తే వాళ్ళ సంస్థనుకొత్తపద్ధతులమీద అభివృద్ధి చేయగలననీ-హోరున చెప్పాడు.

"మాకు చెప్పిన పనిచేసే గొడ్డులాంటి వాడుకావాలి'' అన్నారు వాళ్ళు వొత్తి వొత్తి పలుకుతూ.

"ఫోనీ చేస్తాను. ఏదయినా సరే'' తను దిగజారాడు.... వాళ్ళ పాదాలముందు కూర్చుని. వాళ్ళు పారేసిన విస్తరిని ఎత్తుకుంటానన్నాడు. తన బ్రతుకును నిలబెట్టమని అర్థించాడు కాని వాళ్ళెవ్వళ్ళూ వినలేదు. ఉద్యోగం ఇవ్వలేదు. తను సొంతంగా ఏ ఉద్యోగమూ సంపాయించలేక పోయాడు తనలాగా వుద్యోగానికి వచ్చిన, వెనకాల ఏ మాత్రం స్తోమతాలేనివాడు తిరిగి తిరిగి, డిగ్రీ కాగితాన్ని బహూ జాగ్రత్తగా దాచుకుని, ఆశను చిగుర్చుకుంటూనే ఒక హోటలులో కిల్లులురాసేందుకు కుదిరాడు. ఎవడో ఆత్మహత్య చేసుకున్నాడు. ఒక అమ్మాయి పడుపు వృత్తి చేస్తోంది అంతా ఉద్యోగాలమీద మోజుతో కలయ తిరిగిన వాళ్ళే. ఉత్తమ జీవితాన్ని గురించీ, కొత్తపద్ధతుల్ని గురించీ ఒకళ్ళకూ ఆలోచనలులేవు. అందరూ ఈ ప్రభుత్వం కిందో లేక మరో సంస్థ అందో లేకపోతే. ఈ ప్రజాస్వామ్యంలో బ్రతుకు లేదనుకునే ఆత్మ విశ్వాసంలేని వాళ్ళే. కాని, తనుజాతి పునరుజ్జీవనానికి పాటుబడతానన్నాడు. ఆశయాలు మస్తుగావున్న ప్రజ. కాని. చురుకుదనంలేని సారధులు. ప్రస్తుతావసరాల్నే కొంతగానైనా పొందే యోగ్యతను సంపాయించలేనితనం తన చుట్టూ ప్రజల్లో కనుపించింది. తను దీన్ని ఛిన్నాభిన్నం చేస్తాడు. ఈ ఓటి ఇంటిని పడగొట్టి పని కొచ్చేవి ఏర్చి,కొత్తవి తెచ్చి. మంచి ఇంటిని అందరికీ నివాస యోగ్యంగా కడతాడు. సమానతను...పంచి పెడతాడు. స్వేచ్ఛనూ, అభివృద్ధినీ దేశంలో నింపుతాడు.

అసెంబ్లీ హాలుముందు నిలబడి ఏడ్చాడు తను-తన అజ్ఞానానికి. క్షాలాకుర్చీ పోతున్నారు ఒక వ్యక్తి తినుబండారాలు చేసి బడ్డీ పెట్టు

కుని అమ్ముకుంటున్నాడు మరొకడు. బట్టలబేలు మోసుకుపోతున్న వాడొకడు. నిజాము పూర్వఘనతను వల్లిస్తున్నాడొకడు. పదవిలో వున్నవాడి ఉదారతను కీర్తిస్తున్నాడింకొకడు. ఉద్యోగాలు చేస్తున్న వాళ్ళు—పరుగెత్తుకుంటూ భుక్తాయాసంతో ఆపసోపాలు పడుతూ పోతున్నారు. తను పొరపాటు చేశాడు. చదువు వృధా....బ్రతకడానికి చదువక్కర్లేదు. బ్రతకడానికి కావాల్సింది—తిండి. అది సంపాదించు కోవాలంటే ఈ చెత్త చదువు నేర్చుకోనక్కరలేదు. చదువు, మన స్సుకు స్వతంత్రాలోచనల్ని రప్పించాలి. అదే జ్ఞానమంటే. విచక్షణ, వివేకం, తనంతతను ఆలోచించుకో గలగడం. కాని సున్నపు గానుగ దున్నపోతులా, అందరూ పడిన దారిన, కంచీకగ్రతో బాదు తోంటే కళ్ళకు అడ్డు కట్టించుకుని, చుట్టూ తిరగమనికాదు. మతిలేని తనాన్ని రుజువు చేసుకోమని కాదు. కష్టించి సంపాదించుకుని తిన్న వాడి జీవితం. జీవితం కండగలినవాడు ఇంజను తిప్పుతాడు మెదడు కలిగిన వాడు ఇంజను చేస్తాడు? అలా ఎవళ్ళ నేర్పునువాళ్లు వుపయోగించుకుని జీవితాన్ని గడుపుకు పోవడమే దానికి చేయూత కావాలి. సహకారోద్యమాన్ని చాటి చెప్పే ప్రభుత్వం చేయూత ఇవ్వాలి....

"ప్రెసిడెంటుగా నిలబడు" అన్నారు

"ఒరేయ్ బ్రహ్మన్నా. మన రాఘవులు పెద్ద చదువులు చదివినవాడు. ఆడివి ప్రెసిడెంటుగా చెయ్యాలి నువ్వు తప్పుకో. ఆడి యవసాయం, ఆడి కొత్త పద్ధతులూ, ఆడి చదువూ, ఆడి మాటా చూసి ఆడికి పెసిడెంటిస్తే, ఎవళ్ళన్నా చూసి—అవురా—అనుకుంటారు. అణ్ణికాదని మనం యేం తెలిసి చెయ్యగలం? మనల్ని కాదని ఆడు మాత్రం యేం తలపెట్టి చేస్తాడు?" అన్నాడు వెంకట రత్నం.

వెంకటరత్నానికి తన పద్ధతులు నచ్చాయి. తను తన పొలంలో పెట్టిన సహకార వ్యవసాయ పద్ధతి వెంకటరత్నం స్వయంగా పరిశీలించి చూశాడు. వెంకటరత్నం కూడా అలా చెయ్యాలన్న ఉత్సాహంలో వున్నాడు. తన సిద్ధాంతాలు వింటున్నాడు. పాత పద్ధతులతో విసిగిపోయి వున్నాడు. దాంతో తనను తగినవాడుగా ఎన్నుకున్నాడు. సమితి ప్రెసిడెంటుగా తన పేరును స్థానికంగా పలుకుబడివున్న

బ్రహ్మన్నే సూచించాడు. తన ఏజెంట్లు వాళ్ళంతా తనని గురించి ప్రచారం చేస్తున్నారు. ఆ చుట్టు పక్కల వూళ్ళ వాళ్లందరికీ తను బాగా పరిచయమయే వున్నాడు....తన వ్యవసాయం నచ్చింది. నవమి ఉత్సవాలికి తను వాళ్ళెప్పుడూ ఎరగని పంథాలో ఉపన్యాసా లిచ్చి. కొత్త మార్పులు ఎలా తీసుకురావాలో హెచ్చరించి చెప్పాడు. తన భావాలు నచ్చుతున్నాయి చాల మందికి....

రాఘవులు విలబడ్డాడు వూబి మధ్య. కొంచెం కొంచెం. అడుగున నీళ్ళూరుతున్నాయి. నీళ్ళూరినా పెద్ద నష్టంలేదు. లాటు పడుతోంది వూబి—పక్కగా. సాధ్యమైనంత దూరంగా పడేట్టు వూబిని లాగుతున్నాడు అతను.

గోపాలరావు రెండు దఫాలుగా సమితి ప్రెసిడెంటు తరగని ఆస్థివున్న ముసలాయన. స్టేటు బస్సులు రాకపూర్వం జిల్లానంతా తన బస్సుల్తో నింపినాయన. సంస్థాశాల్ని లాక్కునేప్పుడు జాగ్రత్త పడి చక్కదిద్దుకున్నాయన. సామ్యవాద సిద్ధాంతం, రాజ్యాంగ చట్టానికి కావలసిన సవరణలు చేసుకుంటూ. దుర్భిణీల్లోంచి ప్రజా జీవితాల్ని చూస్తూ, సరిదిద్దుతోంటే—మారు పేర్లూ, మనుమరాళ్ళ పేర్లూ, నౌకర్ల పేర్లూతోసహా భూమిబ్రాసి. జాగ్రత్త పడుతున్న వాడు. మంత్రులకు, కలక్టర్లకు, తాశిల్దార్లకు బసయేర్పాటు చెయ్యా ల్సిన బాధ్యతలు కలిగినవాడు. మిల్లులూ అవీ వున్నవాడు. పూర్వం లెక్కల్లో వున్న పెద్ద జమీందారు....ఆయన తనకు పోటీ. గ్రామ పంచాయతీ ప్రెసిడెంట్లను కొంటానన్నాడాయన. నా కారు విలువ చెయ్యరు వీళ్ళు—అన్నాడాయన....

..తను జీవును అద్దెకు తీసుకున్నాడు....ప్రపంచ పరిస్థి తుల్ని, ప్రజాస్వామ్య సామ్యవాదాన్ని చాటి చెపుతున్నాడు.... గోపాలరావుగారి హయాంలో ఎంత డబ్బు, తవ్వించని బావులకూ, చెయ్యని పనులకూ ఖర్చయిందో వెల్లడి చేశాడు. వోటు హక్కు వివరించాడు. పూర్వపు పెత్తనం కోసం అవస్థపడుతున్న గోపాల రావుగార్ని. చిట్టచివరకు తను వొక్క వోటుతో వోడించాడు. ఆ తర్వాత తర్వాత, సామ్యవాదం అర్థం చేసుకోనారంభించిన ప్రజ లకు ఆయన మీది భక్తి భావాలు సన్నగిల్లాయి. తను తను చేయ

బోయే పనుల గురించి చెప్పాడు. ఏ ప్రభుత్వోద్యోగి అయినా ఏ మాత్రం ప్రతిఫలం కావాలన్నా, పని ఏమాత్రం ఆలస్యం చేసినా తిన్నగా తన దగ్గరకు రమ్మన్నాడు (తను పొలాన వున్నా. తిండి తింటున్నా యివ్వాళ తనొక ప్రజల మనిషి.)

"పాతికేళ్ళంటాయా?" అనుకున్నారు ప్రజ.

అతను ప్రజల్ని ఎప్పుడూ భిన్న ప్రవృత్తిగల వ్యక్తులుగా చూడలేదు—ఒకరు చెపితే, నచ్చితే చెప్పినట్టు చేసే మనుష్యుల గుంపు.

"రాఘవులుగారు ధర్మరాజు"-అదొక సామాన్యమయిన మాట అయిపోయింది తన్ను గురించి.

తను అందరి వెంటా వుండి రోడ్లు వేయించాడు. తన మను ష్యులకి జీతాలిచ్చి, తన కాంట్రాక్ట్ పుచ్చుకున్నాడు వాటిని. దేనికీ 'బ్రోకర్లు' వుండగూడదన్నాడు. కూలీలకు ఆ పనికి మరే చోటా అంతటి కూలిగిట్టుబాటు అయివుండదు. ఇంట్లో పని చేసుకున్నట్టుగా ఇంటి ముందు దారికి కూడా కాస్సేపు వచ్చి పని చెయ్యమన్నాడు— వూళ్ళోవాళ్ళనందరినీ. సూపర్వైజర్లు తన సమితి నుంచి ట్రాన్సఫర్లు చేయించుకునేవాళ్ళు. అంటే, మరోచోట వాళ్ళ అవినీతికి తావుం టుంది గదా! ఎంతమంది చదువుకున్న వాళ్ళు తమను తామర్థం చేసుకుని, ఇళ్ళు కదిలి వచ్చి, ఎందరు గోపాలరావుల్ని కిందికి నెట్టి వెయ్యాలో మరి! కోరలు పెంచుకున్న, పెద్ద జేబుల్ని కుట్టించుకు వచ్చిన టి. డి. వో. ల్ని, ఆర్. డి. వో. ల్ని తన సమితికి వేసే వాళ్ళు, తనతో లంచగొండి బి. డి. వో. లు ముఖా ముఖీ మాట్లాడ లేరు. గోపాలరావులాంటి మిగిలిన ప్రెసిడెంట్లకి తానంటే భయం. తను తెగించి మాట్లాడతాడు, తను ప్రజల మధ్య నిలబడతాడు. వాళ్ళకి మరో భయం—ఎప్పుడో వొకసారి తమ చాప కిందికి కూడా యితని చేత ప్రేరేపింపబడ్డవాళ్ళు నీళ్ళు తెచ్చి పోయగలరని.

తాశిల్దారు వచ్చి, దర్శనం చేసుకెళ్తూంటారు. ఒకప్పుడు తను తాశిల్దార్ల దర్శనార్థం కాపలాలు కాశాడు—సర్టిఫికెట్ల కాపీల మీద సాక్షి సంతకం పెట్టమని. ఇంకా ఇంకా కాపలాలు కాయలేక

పోయాడు. తను స్వతంత్రతను ఒక్కసారిగా చాటాడు. మానవుడికి అనాది నుంచి సంక్రమిస్తున్న అధారం తన జీవనోపాధి అయింది. లక్ష ప్రభుత్వాలు మారనీ. వెయ్యి మంది ప్రధాన మంత్రులు రానీ- పోనీ,—తన పలుకుబడికీ. తన ప్రాంతీయ ఏకచ్ఛత్రాధిపత్యానికీ తిరుగు లేదు. తన నడవడి. తన సమర్థత ఎంత మందికో గొడుగు అయింది. వచ్చి తన మంచితనం నీడను చేరారు.

ఇంతటి పలుకుబడి కలిగి. తనంత పరిపాలనా చాకచక్యం వున్నవాడయినా వ్యతిరేక శక్తులు ముమ్మరంగా బయలుదేరాయి. ఆడ యస్. పి. వోల్ని పంపి. తన మీద విషప్రచారం చెయ్య బోయారు వ్యతిరేకులు. ముఖ్యంగా బాబాయి. బాబాయికి గోపాల రావుగారు ముఖ్యులు. వాళ్ళంతా కలిశారు. బి. డి. వో. వాళ్ళలో వాకదయాడు కాని ప్రజలు నెమ్మది మీద తెలుసుకున్నారు. ఆ తర్వాత తన మీద మరింత విశ్వాసం ప్రబలింది వాళ్ళకు తర్వాత.

తను మళ్ళీ ఎన్నికయ్యాడు. ఈసారి వైస్-ఛైర్మను అయ్యాడు. తనకు వచ్చిన వాళ్ళను,—కాలేజీ చదువు చదవలేక నమస్కారం చేసి వ్యవసాయం చేసుకుంటున్నవాడినీ బి ఎల్. చదివి ఏమి చెయ్యాలో తోచక. ఇంటికొచ్చి ఖాళీగా వుంటున్నవాడినీ పట్టుకుని, ఇండిపెండెంట్లుగా నిలబెట్టాడు తను. ప్రతి పార్టీలోనూ వున్న అవక తవకల్ని ప్రామాణికంగా ఎత్తి చూపెట్టి ప్రచారానికి పూనుకున్నాడు తను,—"నేను చదివిన చదువు వృధా. నాకు అత్యంతోపయోగకరమవాల్సిన కాలాన్ని వుట్టినే వెళ్ళబుచ్చాను చదువుపేరు చెప్పి. ప్రజలూ, ప్రభుత్వమూ నాకు చదివితే జీవనోపాధి కలదని అన్నారు. అదంతా అబద్ధం. ఇది అసంబద్ధపు ప్రలాపన చదువు అనేది వుద్యోగాల కోసమే కాదు. మనం మరో నమూనాను తయారు చేద్దాం. రాత్రిం బవళ్ళు అందరూ దేశాభివృద్ధికి పాటు పడగలిగిన సర్వ ప్రజానమ్మతమైన నమూనా....

—వరుసగా ప్రతిసారీ ఎన్నికవుతున్న ఆ యిద్దరు ఎమ్. ఎల్. ఏ. ల్నీ వోడించగలిగాడు తను. తను ఎమ్. ఎల్. ఏ. అవ అవగలడు; కాని అవడు. మెంబరు అయితే. యింతగా ప్రాంతీయ

విషయాల జోక్యం వుండదు. తను శాసనాల్ని తయారు చేయిం చాల్సినవాడే; శాసనాలకి అంగీకారంగా చేతులెత్తవలసినవాడు కాదు. ప్రజల ఆగ్రహానుగ్రహాలకి ప్రత్యక్షంగా గురి కాకూడదు. ముఖ్య మైన కీలకాల 'స్విచ్చి' తన చేతిలో వుండాలి. తను కీలకం కాకూడదు.

తన పాలేర్లకి తను ఆదాయంలో అయిదింట మూడువంతులు పంచి యిస్తున్నాడు. తన పొలంలోకి వచ్చి, రెండు సంవత్సరాలు మూడు సంవత్సరాలు పని చేసినవాడు, రెండు మూడెకరాల మంచి పొలమూ, కొంత డబ్బూ సంపాయించుకుని పోతున్నాడు. ఆ పద్ధతి వుపయోగం వాళ్ళకి తను తెలియజెప్పాడు. వాళ్లూ అదే రీతిని నలుగురూ అయిదుగురూ కలిసి పని చేసుకుంటున్నారు. చుట్టుపక్కల గ్రామాల్లో తనకందుకే అంత పలుకుబడి. కనీస సంపాదనపరులంతా తనమీద విశ్వాసం పెంచుకున్నారు. మోతుబరి రైతులన్న వాళ్ళు కూడా ప్రయోగాలు చేసి, లాభాన్ని పొందు తున్నారు. ఊళ్ళోనూ చుట్టుపక్కలా సమష్టి వ్యవసాయాలు... సమష్టి దుకాణాలు...సమష్టి వ్యాపారాలు...సహకార బ్యాంకులు... సహకారం వ్యాపించింది ఆ ప్రాంతం అంతా. తను ఆ ఉద్యమ నాయకుడు.

"నేను నడుములు విరిగిన వాళ్ళ నాయకుణ్ణి. తోటివాళ్ళ స్వశక్తినీ, ధీశక్తినీ, పునరుజ్జీవింప జేస్తున్న మహోత్తముణ్ణి. నన్ను అనుసరిస్తూ, నా సిద్ధాంతాన్ని గౌరవిస్తూ, ఈ వెర్రిమొర్రి చదువులు చదువుకుంటున్న; మార్పుకు జడిసి చల్లారిన రక్తం కలిగిన వాళ్ళంతా—నా చేతికి-దికి రావాలి. వాళ్ళ ఆలోచనల్ని నా ఆలో చనలతో సమన్వయపరచి, సమష్టి భావం తేవాలి. లేదా, నా విజ యాన్ని చూసి, నా వెంటయినా బయల్దేరి రావాలి. కాని, మందలో కలవకూడదు నేను వీళ్ళ తల జుట్లు పట్టుకుని, వాలిన ముఖాలు ఎత్తి, నడుస్తున్న దారిని చూపెట్టాలి. వాళ్ళచేతులకు పనిచెప్పి, ఆ దారిని సుఖమయం చేసుకునేలా చెయ్యాలి. .

నేను గొర్రెల కాపరిని...ఇవన్నీ గొర్రెలు...అంటే ఎంతో: నేను నాయకుణ్ని, మీరంతా ప్రజలంటే అంత. ఎవడా నాయకుడు?

ఎవరికి నాయకుడు? అందరూ నాయకులే. అందరూ సమర్థులే. భావాలు ఏకమయినాయి గనుక సమష్టి ప్రయోజనం కోసం కదం తొక్కుతున్నాం. కాని. వొకళ్ళద్దరు ముందు నడుస్తారు—పెద్దతనం బరువును మోస్తూ పతాకను పుచ్చుకుని. అంతేకాని. ఎవరికి తలలు లేవని. ఈ నాయకత్వపు దర్బారులు పోతారు వీళ్ళు(తా? వివిధ విష యాల్లో అందరూ నాయకులే. ప్రజానాయకులా ఈ కప్పించే వాళ్ళు అంతా? స్వార్థం లేకుండా ప్రజలకు ఏం చేశారని వీళ్లు?...వీళ్ళ నందర్నీ మార్చాలి. ఒకానొక రోజుకి ఏ కొంతయినా తన సిద్ధాంతం తప్పకుండా బయటకు వచ్చే ఏర్పాటు చెయ్యాలి. అదే తన పట్టుదల. అదే తన ఆశయం. తన జీవితం అది మాత్రమే తను. పిసలైన ప్రజకు విదర్శనం.

ముందు పూర్తిగా తన వూరును సంస్కరించాలి. వూరును సంస్కరించడమంటే — మీ సాలు మెలేసుకుంటూ అరుగుమీద కూచుని పుల్లాయి కబుర్లు చెప్పుకునే వాళ్ళల్లోనూ. ఆచార్య పీఠం వేసుకున్న వాళ్ళలోనూ కొత్త దృష్టితేవాలి. అలా తేవడం కష్టం. వాళ్ళు కూచుని కదల్లేరు. కీలకమైన బాధ్యతలు వాళ్ళ చేతుల్లో పెడితే. ...జరుగుతున్నదే అంత.... సిద్ధాంతం దెబ్బతినేస్తుంది. అయినా. తను ఒక నాటికి ముసలాడవుతాడు. కాని. తనలో పాత భావాలూ తుప్పు సిద్ధాంతాలూ వుండవు. ఎప్పుడో ఎవరో మహా త్ముడు వేసిన ప్రణాళికలూ. ఎవడో మారుక్ర్స్ చెప్పిన ప్రమాణాలూ. ఈ కాలానికి సరిపోవు. వేసవికాలంలో చలిమంట తయారుచేసుకుని వేసుకునే అభివృద్ధి తన ప్రజలకు వద్దు ...

రాఘవులి వొళ్ళంతా చెమటకారుతోంది. బనీను పూర్తిగా తడిసిపోయింది. ముఖంమీంచి చెమట బొట్లుజారి. గడ్డం మీదుగా కిందికి దిగుతున్నాయి. ఊబి సడలుతోంది. పెచ్చు గట్టిన. కర్రలవ తల వూబి పైభాగం విడుతోంది—జారి వచ్చేందుకు. రాఘవులు గొలిగి కంపను బడితెల మధ్యకు కూరుస్తున్నాడు.... వూబి పెరిగి. తనుదారి చేస్తున్నచోటి వరకూ రాకుండా. దున్నపోతును ఊబిలోంచి బయటికి లాగాలి. దానిలో చైతన్యం పుట్టించి. దాన్ని వెనక్కి నడిపించి. తను విజయవంతుడవాలి.... అర చేతులు మంటలు తగ్గాయి.

ఆయాసం ఎక్కువవుతోంది. కాస్సేపు—తన పక్క తగ్గుతున్న ఊబి ముందు నిలబడాలనుకున్నాడు. కాళ్ళని లాక్కుని, దున్నపోతు వేపు తిరిగి వంగి చూశాడు...దొన్నెలో నీళ్ళు తాగిందో లేదోనని. పూర్తిగా ఖాళీగా వుందది. దున్నపోతు మీది కందువా సగం సగం ఆరింది. దాన్ని మళ్ళీ తడిపి, అలా పరవాల్సిన అవసరం ఉందని పించింది రాఘవులికి. కొంత వూబి మట్టినితీసి దాని వంటిమీదవేస్తే, నీరు వంట్లోకి దిగుతుం దనిపించింది. తను పశువుల డాక్టరు నవ్వుతున్నానని తెలిసి, నవ్వు వచ్చింది. కాని, మట్టి బరువుకు కింది కింకా దిగిపోతుందేమోనని సంకోచించాడు.

కాలువ వేపు చూశాడు, ఏ జీవి కదలడంలేదు. బాగా ఎండగా వుంది. కనీసం, ఎక్కువగా తిరిగే నక్కలయినా నీళ్ళు తాగేందుకు రావడంలేదు. పక్షులు ఎగరడంలేదు వెచ్చగా గాలి వేస్తోంది. వూబిమీద ఉక్కకి కడుపులో ఆకలివేస్తోంది. ఏక బిగిని పనిచేయడం వల్ల మంచి నీళ్ళు అవడంలేదు. వొళ్ళంతా అలసిపోతున్నట్టు వుంది.

ఊబివంక చూశాడు. ఊబి పల్చగా లేక పోవడంవల్ల, తొందరగా కదలడంలేదు అతను నిలబడ్డ దగ్గర ఇంకో గజం ముందుకితీస్తే, ఇంకా ముందున్న వూబిఅంతా అతను తీస్తున్నచోటికి పాకివస్తుంది చుట్టుపక్కల ఏమయినా ఎముకలు బయట పడుతున్నాయేమోనని కళ్ళతో వెతికి చూశాడు రాఘవులు. వూబిలో నీరుమాత్రం వూరుతోంది. ఇలాఇంకో ఇరవై ఇంతలుతీస్తె దున్నపోతును కాస్త కదల్చగలను—అనుకున్నాడు మళ్ళీ అతను చేతుల్ని వూబిలో పెట్టాడు. ముద్దలుగా పట్టి బయటికి విసురుతున్నాడు. పోగు పడుతోంది. తొందరగా. "థాస్....థాస్...." అంటోంది. గజంనర పొడుగు దున్నపోతు వెనక అంతా లాగేశాడు—గజంలోతుగా. వూబి జారిరావడానికి అవకాశం తక్కువ గొలిగిముండలు బాగా పన్నుకుని, గట్టిగా బిడితెలవెనక తట్టుకాశాయి. దున్ననోతు తోక బయట పడింది. దాని కుచ్చంతా ముద్దకట్టి, మట్టి—కుచ్చుతో గడ్డకట్టుకుని వేలాడుతోంది. దాన్ని సరిజేసే ప్రయత్నం చెయ్యలేదు రాఘవులు వొడ్డువేపుకి వూబిలోంచి దారి చేసుకురావడమే

ఇదికూడా ఒక రకంగా తను సాధిస్తున్న అభ్యుదయంతో

సంబంధమున్నదిగా తోచింది రాఘవులికి. దున్నపోతు స్థితిలో వుండి కట్టుబడిపోయిన వర్గాన్ని తను కదల్చ ప్రయత్నం చేస్తున్నాడు. దాన్నిలాగేందుకు ఇంత సరంజామా. ఇంత ప్రయాసా అయితే, కొంతలాభం చివరికి కలుగుతుంది. ఇంత ప్రయాసపడిన తర్వాత, ఆ సమయానికి దున్నపోతే చచ్చిపోనీ—ఫరవాలేదనుకున్నాడు. దున్నబోతును లాగిబయట పారెయ్యాలి—అందులోంచి. అప్పటికి తను అనుకున్న పని పూర్తయినట్టు. అంతే తన ఆశయమో? తను ఈ మరో ఆదర్శప్రాయమైన పాలకవిధానపు కట్టడాల్ని నిర్మించలేక పోయినా పోనీ, ఈ కట్టడాన్ని ఇలా వుంచి మాత్రం వూరుకోలేదు. అందరి ప్రాణాలూ ఏ తుఫాను రాత్రో అంతమవుతూంటే సహించ లేడు. పార్టీలకి కట్టుబడి, కాలదోషం పట్టిన ఆశయాల్తో, వోటుకోసం శాల్తీల్లాగా చేతులెత్తే వాళ్ళుండకూడదు. వొక్కొక్కడూ వో రూజ్వెల్టు చర్చిలు, డిస్రాయెల్, గ్లాడ్స్టన్, కృశ్చెవ్, కెనెడీ అవాలి. మట్టి బుర్రలవాళ్ళు వద్దు. డిగ్రీలున్నంత మాత్రాన, వాళ్ళవద్దు. తమ బాధ్యత తమకు తెలిసినవాళ్ళు కావాలి. యువతరం ఆలోచనల్లో మునిగివున్నది-బయటపడాలి. పూర్వ సంపాదన, ఆస్తులు వుండడం వల్ల డబ్బు పంచిపెట్టి, ప్రజల్ని వంచించి, అధికారానికివచ్చే అక్రమ పంథాన్ని రూపుమాపాలి.

తనలాంటి వాళ్ళు యింకా మరికొందరు ప్రయాణం చేసి తమ జీవితాల్ని పణం వొడ్డితే, ఎంతలో ఎన్ని మార్పులు చేయ వచ్చు! ప్రభుత్వానికి అందకుండా చాల ఎత్తుమీద న్యాయస్థానాన్ని నిర్మించాలి....న్యాయస్థానం ప్రభుత్వానికీ, పెద్ద సంస్థలకీ, డబ్బుకూ జడవ కూడదు.

రాఘవులు మట్టి విసురుతున్నాడు. మండల్ని బడితెల పక్కగా పెడుతున్నాడు, ఏమాత్రం గుచ్చుకోకుండా జాగ్రత్తగా చేతుల్తోనూ, కాళ్ళతోనూ విరగదోస్తున్నాడు. భుజాల్తో వుండి వుండి ముఖం మీది చెమటను తుడుచుకుంటున్నాడు. బట్టతలను దండ చేత్తో.

తన బంధువులు, తన ఇంటి అల్లుళ్ళే లంచగొండివాళ్ళు, తను

ఈ చుట్టరికాలకు అతీతుడు. మానవజాతే తరాల వెనక్కి పోతే ఒక్కడి బిడ్డలు....పల్లెప్రాంతాల్లో ఎన్నెన్ని ఘోరాల్ని చూస్తున్నాడు తను! ప్రతి ఉద్యోగి చాతయినంతవరకూ ప్రజల్నుంచి గుంజుకోవడమే. చేతకాక తనం కొద్దీ. ఆ స్తిబలంతో నిలబడ్డ ప్రెసిడెంట్లు తమ విద్యుక్తధర్మ నిర్వాహణలో తప్పుల్ని కప్పిపుచ్చుకోడానికి ప్రభుత్వో ద్యోగులికి దాసోహమంటారు. అప్పుడు ప్రజాప్రభుత్వం విశృంఖల మవుతోంది. వీళ్ళ అండతో వాళ్ళూ. వాళ్ళ అండతో వీళ్లూ బరితెగించి స్వైరవిహారం చేస్తున్నారు. ఈ ప్రజారాజ్యమే. ఈ పంచాయితీ వ్యవస్థలో వున్న ప్రజానాయకులే తగిన విధంగా వుంటే. ఈ ఎన్నుకో బడ్డ శాసన ప్రతినిధులూ, మంత్రులూ, కార్యతత్పరులయితే వుంటుందా ఇంత అవినీతి?....ఈ విషయాలన్నీ బజారుల్లో. ఉపన్యాసాల్లో. నలుగురు నోళ్ళలోనూ చర్చకు రావడం విన్నాడు తను. (తనకు తెలిసిన ఒక గుమాస్తా ప్రభుత్వం లోని. అవినీతిని తెగవిమర్శిస్తూం టాడు. రోజూ ఆఫీసునుంచి తెల్లకాగితాలూ. స్టెన్సిలు కాగితాలూ. కార్బను పేపర్లూ అమ్ముకునేందుకు తెస్తూంటాడు. ఆఫీసు ఫోను అద్వారా తమ నిత్యావసరాల్ని తీర్చుకుంటున్న వాళ్ళు ఎంతమంది! కాని, వాళ్ళకు వీళ్ళంటే భయం. వీళ్ళ ప్రతాపమంటే భయం. వీళ్ళ చేతికిచ్చిన దండనాయుధాల్తో. శాసన పదవుల్తో తమను నాశనం చేస్తారేమోనని. మరి అటువంటప్పుడు ప్రజాస్వామ్యమంటే తెలియని అవి నీతి పరులకీ పిరికిపందలకీ ఎందుకిస్తున్నారు ప్రజలు—ఈ దండన అనే ఆయుధాన్ని! పదవిని అందుకున్న ప్రతివాడూ అవినీతి పరుడవు తున్నాడని సమాధానం. అయితే, మరోసారి ఆ ఆయుధాన్ని మరొకళ్ళ కివ్వండి. ఎప్పుడు ఎవడు పరీక్షకి నిలబడుతాడో, ఏ పద్ధతి జాతి పురో గమనానికీ, దేశపురోగమనానికీ సుగమంగా వుంటుందో - దాన్ని బలపరచి గౌరవించండి. నాగలిలాగే జంట, ఎద్దుల్లో ఒక ఎద్దు పనికి రానిదయితే దాన్నివిప్పి మరోటి కడదాం—మరుసైన దాన్ని.

—దున్నపోతు మూలుగుతోంది. రాఘవులు హఠాత్తుగా ఆలోచనలోంచి. తలెత్తి. దున్నపోతువేపు చూశాడు. దాని తల కదులుతోంది. దాని గొంతులోంచి గుర్రువస్తోంది. అది. నిద్రపోయే ప్పుడు పెద్దగా బొజ్జ వున్నవాడు పెట్టే గురకలాగా వుంది. అతనికి

అప్పుడప్పుడూ తండ్రి పెట్టే గురక జ్ఞాపకం వచ్చింది. రొమ్ముపాసన పోతోనే వుంది. పూలి అడుగున చల్లగా వుంది.

తను తన వ్యక్తిత్వాన్ని మొదట్నుంచీ తీర్చిదిద్దుకున్న చేసు కున్నవాడు తనకు తండ్రిగాని. ఇంకోళ్ళుగాని ఏ రోజూ సలహా ఇవ్వలేదు. విభిన్నశక్తులమధ్య కొట్టుమిట్టాడుతూ తను ఈ విధంగా ప్రత్యేకంగా తయారయాడు.

....' ఇన్ని పుస్తకాల్నేం చేస్తాడు? చదువయిం తర్వాత ఇవన్నీ కొంటాడు....ఏం చేద్దామని?—డబ్బు పాడుగాకపోతే. అన్నీ వెర్రి వేషాలే. ఏదో ఉద్యోగం చేస్తాడనుకుంటే. వ్యవసాయంలోనే దిగాడు. ఈ పుస్తకాలు చదువుతూ కూచుంటే వ్యవసాయం ఏమి కాను?" తల్లి అంటోంది ప్రమీలతో.

తను నిద్రపోతున్నాడనుకుంది తల్లి.

తన ఆలోచనలు వీళ్ళకెవ్వళ్ళకీ తెలియవు. వాళ్ళకీ తనకీ కొన్ని వందలయేళ్ళ కనిపించని దూరం వుందని వాళ్ళకు తెలియదు. వాళ్ళ మనస్సు సాలభంజికలకథల్నీ, పుక్కిటి పురాణాల్నీ మననం చేస్తోంటే. తన మనస్సు సమష్టి వ్యవసాయమనీ సంస్కరణలనీ, స్వాతంత్ర్యోద్యమమనీ, ప్రపంచ రాజ్యమనీ పలవరిస్తోంది.

....తను నవ్వుకున్నాడు.

... తన ఇంట్లో తనక్కావల్సిన పుస్తకాలు. తనక్కావల్సిన అడది. తన మెదడులో తనక్కావల్సిన ఆలోచనలు. తను కావాల్సిన విధంగా.

ఈ ప్రస్తుత వ్యవస్థని మారుస్తాడు. ఈ అడవినేలలో వున్న పర్వతాల్ని. లోయల్ని తవ్వి, నింపి సమానం చేస్తాడు. సరిదిద్దు తాడు. ఇవే ఆశయాలున్న వాళ్ళు వాటిని కొంతవరకూ సాధించగల గడం చరిత్రనుబట్టి తను తెలుసుకోగలుగుతున్నాడు. కాని వాళ్ళ ఆశయాలు రానురాను దెబ్బతింటూ వచ్చాయి. తన ఆశయాలు ప్రతి నిమిషం కొత్తదనాన్ని సంతరించుకొని మానవ సౌఖ్యం కోసం, మానవ స్వేచ్ఛకోసం వినియోగపడాలి.

తన ఉద్యమంమీద, తన వ్యక్తిత్వంమీద తను పూర్తిగా విశ్వాసం కలిగివుంటేనే తనమాటకు వీళ్ళంతా విలువ నిచ్చేది.

(ముందు తన ఆశయాల్ని తను క్షుణ్ణంగా తెలుసుకుని. పదిమందికి నచ్చ జెప్పగలిగే శక్తి కలిగివుండాలి.) తనలో ఆ నిజాయతీ నశించ కూడదు. అయినా తనుచేసే ప్రతిపనికీ జాతిపురోగమనాన్ని లక్ష్యం చేసుకున్నాడు. పగదీర్చుకొనడం మాత్రం పనికిరాదు.

....తనక్కూడా ఈ ఉద్యోగాల కట్టడాల లోపలి ఏ మేకో మట్టి బెడ్డో తెలిసివుండి. తనమీద ఆమేకోమట్టి బెడ్డో తనదిగా కాస్త గుర్తుపెట్టి—కట్టడాల అంతస్తులలోకి చేర్చుకుని.సరీ సరిపోని తిండిని అనుగ్రహిస్తే: తను తన తోక వూపుకుంటూ ఈ స్వచ్ఛతలేని సిద్ధాంత రూపానికి కాపలాకాసి. దీన్ని గురించి గొప్పగా మొరిగేవాడు. ప్రజాస్వామ్యాన్ని మహత్తరంగా వినియోగించుకుంటున్నామని ఉపన్యాస మిచ్చేవాడే. కాని. తనను త్రోసిరాజని. అవకతవకలుగా వున్న వ్యవస్థ నెట్టేసింది. తను కిందపడ్డాడు. తన తలకు దెబ్బతగిలి రక్తం కారింది. తన మెదడు గుండ్రంగా తిరిగి 'డయల్'లాగా ఆగింది. అప్పుడు....తనలో బ్రతుకగలనన్న...స్వతంత్రంగా జీవించగలనన్న రోషం వచ్చింది.వ్యవస్థల్ని స్థాపించాల్సినవాడు తను అవకతవక వ్యవస్థల నీడన వుండరాదను కున్నాడు. ఈ వ్యవస్థల్ని సమూలంగా నాశనం చేసి, సుస్థిరమై జాతిప్రగతికి మేలుకూర్చే వ్యవస్థని నిర్మిస్తానని ప్రతిన బూనాడు తను....రాఘవులు...పూర్వాశ్రమంలో రాఘవేంద్రరావు. అందుకని. తను మారాల్సిన విధంగా మారుతున్నాడు. జీవనాధారపు స్వచ్ఛందమైన పని దేనినీ తను అగౌరవపరచడు. కాని రాబందుల ముక్కుల్నీ. గద్దల మెలిదిరిగిన గోళ్ళనూ మాత్రం అరగదీస్తాడు. ఆ ముక్కులూ. గోళ్ళూ ఉపయోగం లేకుండాచేసి. చిన్నారి మెదళ్ళను రక్షించి. పెదజేస్తాడు. ఈ భారం తను మొయ్యదల్చుకున్నాడు. ఇలాగనే తను ప్రజలకు ఉద్బోధించాడు.

"మీ మెదళ్ళు చిన్నవి. మీరింకా బ్రతుకుతీపిలో అరవయ్యో వంతయినా అనుభవించలేదు. మీరు తినేతిండి—గడ్డి. విజ్ఞానశాస్త్రం చక్కటి మిశ్రమాహారాన్ని సంపూర్ణాహారంగా తీసుకోమంటోంది. అలాగని ప్రభుత్వం పాఠ్యగ్రంథాల్లో వ్రాయించింది. కాని. ఆ ప్రభుత్వం చక్కని ఆహారం ఎలా సంపాయించుకోవాలో మాత్రం మీకు చెప్ప లేకపోతుంది. మీ నిత్యావసరాల్ని గురించి ఆలోచించి. మీకని

అభ్యమయ్యే సదుపాయాల్ని చేస్తామని. మీనుండి దండనాయుధాల్నీ. పట్టాలను పుచ్చుకున్న పట్టభద్రులు మీవంక చూడక మిమ్మల్ని గురించి ఆలోచించక, కాలక్షేపరాయుళ్ళగా తయారవుతూంటే— ఇంకా మీరీ బంధువుల మాటల్నీ, ఆలోచనలేని స్నేహితుల మాటల్నీ విని ప్రగతి నిరోధకులుగా ఎందుకవుతారు?...నాకు వోటు వెయ్యండి. మీకు ప్రతిపూట పుష్కలమయిన ఆహారం పంపకమయ్యే పథకాల కోసంపాటు పడుతాను....'' అనే.

తను చెప్పాడు. విడమర్చి చెప్పాడు. రాజకీయానికి వచ్చినప్పుడు, భార్యలేదు, బంధువులేదు. ఆ మహాయజ్ఞం ముందు మానవానుబంధాలనే విలువే కనుపించదు. చరిత్రను సృష్టిస్తున్న—రాజకీయాలు. తను, ఒక్కొక్క తలా వొక రాజకీయ చైతన్యంగా మారాలి—అని ఘోషించాడు

తన ఘోషకొత్తగా వినబడింది ప్రజలకు. అందరు చెప్పేదానికీ, నువ్వు చెప్పేదానికీ కొంత తేడా వుండదనుకో—అన్నారు. కొంచెం ఏమిటి బాగాతేడా వుంది—అని ఘోషించాడు తను.

''అయితే మమ్మల్ని ఏం చేయమంటావు?' అన్నారు వాళ్ళు.

''నాతోపాటు నడుం కట్టండి ' అన్నాడు తను.

''నీకు వోటెయ్యద్దా?'' అడిగారు వాళ్ళు.

''నన్ను గెలిపించమని కాదు. ముందునన్ను అర్థం చేసుకోండి, మీరు. మన ఆశయాలున్న వాళ్ళను ఎమ్. ఎల్. ఎ.ల్ని చేద్దాము నేను మీముందే వుంటాము వాళ్ళకి బాధ్యుడిగా....'' అని అరిచాడు.

''....మన మంగారమూ ఇంతకంటే బాగా బ్రతకడానికీ, మంచి అభివృద్ధిని పొందడానికీ నేను ప్రయత్నిస్తున్నాను. ఆ దేశంలో వాళ్ళలా చేశారు, మనం ఇలా చేద్దాము అనికాదు: మనకిలా బావుంటుంది....మనమిలాచేసి పాడవుతున్నాము అనే బాధకావాలి మనలో'' అన్నాడు.

—వెధవజీవితం జీవించడానికి ఎన్ని పద్ధతులు కావాలి? కాని ఈ 'దున్నపోతు'లెన్ని వున్నాయి. వీటికొక మతం లేదు; ఒక ప్రభుత్వంలేదు: మమకారమున్న బంధుత్వాలులేవు; ఆత్మాశలులేవు....

మనుష్యుల బ్రతుకులకన్నా దున్నపోతుల బ్రతుకులు మెరుగు. జంతువులే సుఖపడుతున్నాయి, మనిషికన్నా!! వెధవ జీవితం ఎంత బహూ ఛిన్నసంపుటి!!.... దీన్ని అనుకున్న విధంగా జయించాలి. అప్పుడే తన వ్యక్తిత్వం.

—తనకీ ఆలోచనలన్నీ ఏదయినా పనిలో మునిగిపోయినప్పుడు, వుండచుట్టి వున్న దారాన్నిలాగుతున్నట్టు అంతులేకుండా వచ్చేస్తాయి. ఈ భావాలు తనువాకళ్ళకు చెప్పలేదు. ఈ భావాలకు తను వాక్చిత్రమిస్తే ప్రజల మనస్సుల్లోనూ, సన్నిహితుల మనస్సుల్లోనూ వొక పెద్ద అల్లకల్లోలం రేపినవాడవుతాడు. వాళ్ళతో పరిస్థితుల కనుగుణంగాచెపుతూ,కొత్తదనాన్నివికసింప చెయ్యాలి. అంతేగాని, వాళ్ళకి తన వేదాంతాన్ని నూరిపోసినంతలో ఏమీ జరుగదు. ఏ విధంగానేనా తగిన మంచి ఫలితాన్ని ఇవ్వదు. కాలానుగుణంగా బోధించడం కాకుండా, అతిశయంచేసి చూపితే, సిద్ధాంతం రూపుమాపి పోతుంది....

అతను పొద్దువంక చూశాడు. పొద్దు జారుతోంది.

పైమోత అవుతుంది? అనుకున్నాడు.

రెండవుతుందా?

అప్పుడే రెండవదు అనుకున్నాడు.

చెమటబాగా పడుతోంది, గాలిచివ్వ వేసినప్పల్లా, వీపుమీదా, గుండెల దగ్గరా బాగా చల్లగా, మంచుముక్కను అంటించినట్టు వుంది.

మధ్యమధ్య చేతుల్లోకి అడుగున వున్న పూలిలాగుతున్నప్పుడు రేవడి పట్టి ముద్దలు వస్తున్నాయి. ఆలా రేవడి తగుల్తున్నప్పుడు; కాటిపట్టలు పని చేయడంలేదు.

చేతులు మోచేతి మడతలో నొప్పి పెడుతున్నట్టనిపించాయి. అతను రెండు చేతుల్నీ ఝాడించాడు. చేతినున్న పట్టీ చిందింది. చిన్న బురదపట్టి అతని బనీనుమీద పడింది.

దున్నపోతువంక చూశాడు. తలను నెమ్మదిగా ఎత్తేప్రయత్నం చేస్తోంది—ఎప్పట్నుంచో!

దానిముందు గడ్డివేస్తే బావుండు ననిపించింది, రాఘవులికి. గడ్డివేస్తే నమలగలదో లేదో నన్న వెనుకాట, నాలుక స్వాధీనంలోకి

వచ్చిన తర్వాత, నమిలేందుకు పెద్దగా అవస్థ పడాల్సిన అవసరం లేదనీ, గడ్డి తెచ్చి దానిముందు వేస్తే, ఎలాగో తింటూ కొంత కోలు కుంటుందనీ, రాఘవులికి తోచింది. తనిప్పటికి అయిదుగజాల వరకూ లాగాడు వూబిని. ప్రయత్నించి పట్టుదల చూపితే, పని కాకుండా నిలబడదని రూఢి చేసుకున్నాడు. ఇంకో పదిగజాలుంది. తర్వాత, పూర్తిగా దారి బాగుచేస్తాడు. ఇప్పుడు, బయటికిపోయి, ఇంకా కొంత కంపనరికి లోపల వెయ్యాలి. గడ్డి తెచ్చి దున్నపోతు ముందు వెయ్యాలి, గడ్డి బాగుంది. లేతది. నవనవ లాడుతోంది, తినగలదు. మూడురోజులు గడ్డి లేకపోతేనే దున్నపోతు చావదు. అంచేత గడ్డి తినగలదు.

పొద్దువంక చూశాడు మళ్ళీ రాఘవులు, పొద్దు గబగబా జారి పోతున్నట్టు అనిపించింది, కొత్తగా తనూ భార్యా సరదాగా గడుపు తున్న రోజుల్లో రాత్రులు కూడా ఇంత తొందరగా జారిపోయేవి. అది ఆనందం, ఇక్కడ ఆతురత. అక్కడ జీవనమధువు ఇది ధ్యేయం.

అతను ముందుకు నడిచాడు. అతని గోచీపెట్టిన పంచెనిండా బాగా మట్టి పట్టింది....బాగా పట్టింది. అతను బయటికి దాటుకొస్తు న్నాడు. బడితె వొకచేతులో వుంది....సులువుగా బయటికి వచ్చాననను కున్నాడు. కాళ్లను దులువుకుంటూ బడితెను బయట పారేశాడు. కాలి కేమయినా జెలగలు పట్టాయేమోనని చూసుకున్నాడు. మట్టిని తుడుచు కున్నాడు చేత్తో. తనవంక తను చూసుకుని, తను చాల కొత్తగానూ, మరో రకంగానూ తయారయ్యానను కున్నాడు...

రాఘవేంద్రరావ్—బి.

రాఘవులు—రైతు.

రాఘవయ్య—సమితిప్రెస్‌డెంటు పరిషత్-ప్రెస్‌డెంటు.

రాఘవయ్యగారు—పార్టీ లవాళ్ళు. మంత్రులూ పిల్చేతీరు.

రాఘవరావు—దొరవారు (చేతకానివాళ్ళు. సహాయాలు కోరేవాళ్ళు)

రాఘవబాబు—కి రీమంతుడు. ధర్మరాజు (చనువుగా ముఖ
స్తుతి చేసేవాళ్ళు)
పిళ్ళందరూ,—
రాగాడు—అయి
దున్నపోతును తీస్తున్నారనుకున్నాడు.
నవ్వు వచ్చింది.

ఇదే, పన్నెండేళ్ళ క్రితం. తను బురద అంటేనూ. పశువు అంటేనూ. ఒక విధమైన నిముఖతను చూపేవాడు—రైతు కాదు కయినా. కాని ఎంత మార్పు! ఒకప్పుడు అయిష్టమయినవే. మరొ కప్పుడు ఇష్టమైనవిగా మారిపోతాయి?

ఒక్కసారి దున్నపోతువంక తేరిపార చూశాడు. తను చేసిన పని. పడిన అవస్థా తలచుకున్నాడు—విభ్రాంతమైన చూపు. తనమీద తనే తీర్పు చెప్పుతునేందుకు. వూబికి మధ్యన అరపెట్టి పునాదీ గొయ్యిని తవ్వినట్టు వుంది. దున్నపోతును చులాగ్గా బయటికి లాగ గల ననిపించింది. పొద్దువంక చూశాడు.

దున్నపోతును బయటికి తీసిన తర్వాత. కాలవలోంచి గాడిని తవ్వుకొచ్చి. ఆ గొయ్యంతా నిండి పొర్లేలాగా నీళ్ళు వదలా లనిపించింది. అదంతా తర్వాత చెయ్యాల్సిన పని. అప్పటివరకూ తనీవిధంగా ఆలోచించ గూడదు. ముందు మరో మోపు గొలిగి కంప నరకాలి. తననుకున్న ప్లాను పూర్తవుతుంది. బడితెలు సరిపో యాయి: ఇంక నరక నక్కరలేదు.

తను ఇప్పుడు కంప నరికితే. కొంత విశ్రాంతీ, కొంత సమయం కలిసి వచ్చినట్టూ, వుంటుంది. ఒకే బిగిగా చేసే పనిలో విరామంవల్ల విశ్రాంతి దొరుకుతుంది. కాని, ఈ రాత్రి మాత్రం తనకు బాగా నిద్రపడుతుంది ఒళ్ళు మర్చిపోయి. పెద్దమంచంమీద సుఖంగా నిద్రపోతాడు తను. రాత్రుళ్ళు ఎవరెంత అల్లరి చేసినా పట్టించుకోడు.

చాలమంది పొరుగూళ్ళ వాళ్ళు ఇవ్వాళ తను ఇంటిదగ్గర వుంటాననుకుని. చూసేందుకు వచ్చి వుంటారు. తనతో పని పెట్టుకుని ఆ స్తమానం అందరూ రావడం మొదట్లో తనకు సరదాగానే వుండేది.

ఇప్పుడు విసుగు పుడుతోంది. ఎంతమందికని, ఎన్నిపనులు చేసిపెట్ట గలడు తను? ఎంతమందికని. తన పనులు మానుకుని, వాళ్ళ సేవకు దవుతాడు? ఎన్ని సలహాలని ఇస్తూ కూచోగలడు? వాళ్ళు తనను దృష్టిలో పెట్టుకుని నేర్చుకోవాల్సిందే. అంతే... ఏమాత్రం ఇంకా అభివృద్ధి చెందలేదు ప్రజ. ఇంకా ఒకళ్ల మీద ఆధారపడడం. ఒకళ్ల దయాదాక్షిణ్యాలు అపేక్షించడం... ఇంకా జరుగుతూనే వుంది. కొంతయినా వాళ్ళంతట వాళ్ళు నిలబడగలిగే లాగ సాధనచేస్తూం డాలి....కాని మొదటి రోజుల్లో తను వీళ్ళందర్నీ ఆకర్షించడానికి పాటుబడిన ప్రతినిముషమూ ఒక యుగాంత మయింది. తన సిద్ధాంత ప్రచారంకోసం ఎన్నెన్ని ముళ్ళదార్లను తొక్కాడు? అందరూ నా చుట్టూ తిరగండి, అందరూ నామాట వినండి.—

"నేను చదివాను, నేను తిరిగాను. నేను గ్రహించాను....

"ఇవ్వాళికి నాకు కొంత తెలిసింది..."

"ఆ తెలిసినదింతా విని, మీరు మీ ఇష్టం వచ్చినట్టు నిర్ణ యించుకోండి. మీబాగు కోరుకోవడం మీకు, ఆమాత్ర మయినా చేతకాదనను. మీకోసరం నేను నా చదువును కాలదన్నాను. నా చదువుతో నేను బొజ్జకలదని వుద్యోగంలో ఈసరికల్లా ఎలాగో తంటాలుపడి చేరేవాడిని. నేను మిమ్మల్ని పిల్చి పిండి, కార్లు కొను క్కుని, బ్రతకలేని బ్రతుకు బ్రతికి తప్పకుండా మీ అందరిమీదా పెత్తనం అందరిలాగా చలాయిద్దును నాకుమాత్రం. ఈ మతిలేని భ్రమణంలో పడాలని ఉవ్విళ్లూరేప్పుడు. రాజధాని సీడను యిచ్చింది. రాజధానిలో నాకు కనిపించిన దృశ్యాలు నాకు జ్ఞానోదయం కలిగిం చాయి. నేను కొన్ని సూత్రాల్ని మన మనుగడకు రాసుకొచ్చాను. ఇవి ఏ కొండమీది ఏ మహాశక్తి ఇవ్వలేదు. ఇదంతా, వొక యువ కుడు. తను పడ్డ బాధల తంపర తర్వాత, సృష్టించుకున్న ఆదర్శ రాజ్యం. కాని ఇది అన్ని రాజ్యాల్లాగా చేతికందనిది కాదు. మీరు సాధించాల్సింది మాత్రమే...."

తన మాటలు అర్థంకాక, అర్థమయీ, తర్వాత వొకళ్ళ కొకళ్ళు చెప్పుకునీ, తనమీద ఏదో నమ్మకాన్ని పెంచుకున్నారు.

చదువును కాదని, వుద్యోగాన్ని వొద్దని వచ్చాడు. పెద్దింటోరి

సుబ్బన్నగా రబ్బాయికి కావాలంటే తాశీల్దారీ రాదేమిటి? కాని ఆయన కిష్టంలేదు....చదువుగొడవ లేకుండా, వుద్యోగం లేకుండా. పలుకు బడి సంపాయించాలని."

కుర్రవాడు నవ్వు మొగంవాడు. పెద్దపెద్ద భావాలున్న మాటలు మాట్లాడేవాడు. ఏదో చేస్తానంటున్నాడు. అమోఘియా బ్లాకున అమ్మిం చననీ. సబ్సిడీ బావుల్ని ఎక్కువగా శాంక్షను చేయిస్తాననీ, గవర్న మెంటు అప్పులు విరివిగా యిప్పిస్తాననీ. అంటున్నాడు. తప్పకుండా చేస్తాడు. పాలేర్లకు సమానంగా వాటాపంచి యిస్తున్నాడు. ఇంత కంటే ఏం కావాలి? ఆ తెగింపులేదు గోపాలరావుగారికి; ఎంతసేపూ దొరికిందంతా తినెయ్యడమే తప్పితే తమకు సమితి ఆఫీసులో ప్యూను కూడా జడవడంలేదు. అంత తెయితెక్కలుగా తయారయ్యింది సమితి. కుర్రోడిని పట్టుకుంటేనే మంచిది. కుర్రోడు జవవున్న వాడు. కలెక్టర్ని కూడా ఎదిరించి మాట్లాడుతాడు. చెప్పినట్టు వింటాడు. గౌరవం వుంది, ఆదరించి మాట్లాడుతాడు అందరితో. అందుకని ఇతనికే వోటు వెయ్యాలి...ఇలా అనుకుంటున్నారు పుగాకును నముల్తున్న తెల్లబడీ తెల్లబడని మీసాలున్న వాళ్ళు.

తనింతగా బాధలు పడుతోంటే, భార్యా, తండ్రీ, ఎవళ్ళూ ఏమీ అనలేదు. పాలేర్లకు సరిసమానంగా వాటాపంచి యిస్తోంటే, ఆ ప్రాంతానికి ఒక కొత్తపంథా చూపిస్తున్నాడని అందరూ అన్నారు. ఇంట్లో వాళ్ళు ఏమీ అనలేదు. తండ్రి పెత్తనం ఇచ్చేసి, వూరు కున్నాడు. అంత చక్కని వసతి మరే తండ్రిమాత్రం ఏ కొడుకు కిస్తాడు? ఇదే తనకు నచ్చింది....

"నా సిద్ధాంతరీత్యా పరిపాలన నెలకొంటే, రెండు పూట్ల బలమైన ఆహారం సమృద్ధిగా అందరికీ దొరికేలా చేస్తాను. అవొక్కటే చేయగలను. అంతే నేను చేయగలను..."

—చచ్చిపోయిన వుడుమునుచూసి రాఘవులువెనక్కి తగ్గాడు. అది పొద్దుట చచ్చివుంటుంది. ఇంకా కుళ్ళలేదు. పెద్దచీమలు దాని పొట్టలో దూరుతున్నాయి. ఏ మొచ్చి చచ్చిందో!....కత్తిని చేతి విందుగా గట్టిగా పట్టుకుని ముష్టిమండా, గొలిగమండా బలంకొద్దీ తెగవేస్తున్నాడు. అరచెయ్యి మళ్ళీ కొంచెం కొంచెం మండుతోంది.

బాగా పుండు పడి నొప్పిగా వుంది—మధ్యగా పుండు ఎర్రగా వుంది. మేఘాల ఆకాశం చివర్న సూర్యుడి ఎర్రటి బింబంలాగా. మట్టిగా వున్న అరచేతి చివర్న వేళ్ళు కిరణాల్లాగా.

తనకన్నా ఎక్కువ బాధ పడినవారు, కష్టాలు పడినవారు, ఈ ప్రాంతంలో ఎక్కువ కనిపించరు. అందరూ, కష్టాలు పడకుండానే, సుఖమైన స్థిరత్వాన్ని కల్పించుకోలేరు. కాని, తను కొత్త పద్ధతులు తొక్కాల్సివచ్చి, అందరికంటే ఎక్కువగా కష్టాల్ని అనుభవించాడు! ఎక్కువగా బాధలు పడ్డాడు. తన బాధ శారీరకంకంటే, ఎక్కువ మానసికం. శారీరకమైన బాధ కూడా పడ్డాడు తను. మనస్సు కావా లన్న పట్టుదలను సాధించడానికి శరీరం కూడా ఎక్కువ వోర్పును సంపాయించుకుని శ్రమించింది. అందరూ పరిస్థితులచే వంచించబడిన మనుష్యులు. తను పరిస్థితుల్ని వంచిన మనిషి. అదే తనకూ వాళ్ళకూ వున్న తేడా. పుట్టినందుకు ఒకటి స్థాపించి పోవాలి. తనేమి చేస్తున్నాడో తనకు తెలిసినప్పుడు, వచ్చిన తోవ, వెళ్ళేతోవ తెలియనప్పుడు, వాటన్నింటిని గురించీ ఆలోచించడం బుద్ధి తక్కువ. ఇప్పుడున్న పరిస్థితిని గురించి ఆలోచించాలి. అదే 'మెటీరియలిజమ్'. ఎన్ని పుస్తకాలు చదివినా, తనకు కనిపిస్తున్నది మెటీరియలిజమే. కాని, ఇంతలేసి ప్రజల్ని శాసించుతున్న ఈ పత్రికలు కనీసం, ఏ మాత్రం మెటీరియలిజమ్‌ను ఏ మాత్రపు కొత్తదనపు ప్రజాస్వామ్యపు పోకడనూ చూపించక పోవడం తనకు ఆశ్చర్యంగా వుంది. ఈ పత్రికలు, పనికిరాని ఒక అధికార వర్గాన్ని గురించిన విపుల చర్చలతో, నిండిన వార్తలతో ఎంతమంది ప్రజల జీవితాల్ని మడ్డిగా తయారు జేస్తున్నాయి! ఏభై ఏళ్ళక్రితం దిన పత్రికలూ, వార పత్రికలూ, మాస పత్రికలూ,-ఎంత కట్టుబాటులో, బిగిసుకుని నిలబడేవో, ఇవ్వాళా అంతే ప్రజల్ని నడిపించడం. ప్రభుత్వానికి సలహాలు ఇవ్వ గలగడం చేతగాని పత్రికలు! రోజుకు పదిహేను పేజీల వార్తలూ, సంపాదకీయాలూ, ప్రత్యేక వ్యాసాలూ! ఇవన్నీ సామాన్య వ్యక్తిలో ఒక్క అణుమాత్రం సంచలనాన్ని కలిగించటం లేదు. ప్రజాస్వా మ్యంలో సామాన్య పౌరుడి పరిధిని గురించి ఏ మాత్రం తెలియ జెయ్యలేవు. మళ్ళీ ఎన్నో పత్రికలు!

....తను చాలామంది స్థానికంగా నాయకులమని చెప్పుకు తిరిగే వాళ్ళని నొక్కిపట్టాడు. పూర్వంలాగా వీళ్ళు పార్టీ ప్రముఖుల వెనక తిరుగుతూ, ప్రజల్ని దగా చెయ్యడం లేకుండా చేశాడు తను. ముందు, ఈ మధ్య దళారీలను రూపుమాపితేనే సామాన్య పౌరుడు బాగుపడేది.

—అతని దృష్టి డొంకకు పైగా పడింది. పసిరిక పాము తీగలాగ జారుతోన్నట్టు అనిపించింది...దాని వంక చూస్తున్నాడు... ఊసరవెల్లి జ్ఞాపకానికి వచ్చింది. ఊసరవెల్లు లేమయినా వున్నాయే మోనని చూశాడు చెట్టుమీదికి, తన కాళ్ళచుట్టూ. పసిరిక పాము అవ తలివేపుకి దిగిపోతూ జారి కింద పడింది తుపుక్కుమని. గడ్డిలోకి పోయింది....అతనికి ఆదిమానవుడి జీవనపు పోకడలు జ్ఞాపకం వచ్చాయి. బ్రతుకులో వీరత్వం ప్రదర్శించి బ్రతికే వాడనిపించింది. అదొక అందమైన బ్రతుకుగా తోచిందతనికి. జంతువులకు దూరంగా జంతు ప్రకృతికిమించిన జీవితమయినా,—సుఖమయమనిపించింది. కాని. అదీ చేరుకోలేక, ఇటూ పరిణామం చెందక బ్రతికే బ్రతుకులే నిరర్థకమూ, కష్టతమమూ అనిపించింది....

నరికిన కంప వంక చూశాడు. ఇంకో సందెడు మండలు నరికితే, తను తలపెట్టిన ప్రణాళికకు సరిపోతాయి అనిపించింది. ముఖాన్ని తుడుచుకున్నాడు...ఎడమ మోచేత్తో. గరుకుగా ముఖం తగిలింది. ముఖంమీదికి చింది, ఆరిపోయి వున్న బురద కూడా తగిలింది. మోచేయిని గీరింది గరుకు...ఆ గరుకుతనం అతనికి అనేక జ్ఞాపకాల్లో ఒక జ్ఞాపకాన్ని బాగా నిలబెట్టింది...తను చదువుకునేప్పుడు,...——

అమాయికంగా వుంటున్న తనను, కామంతో పరితపిస్తున్న ఇంటాయన భార్య, నలుగురి పిల్లల తల్లి అయికూడా, తనను జ్వరంతో వుండగా అనుభవించడం, ఆ తర్వాత తనకి స్త్రీలంటే ఒకవిధమైన జుగుప్స కలగడం, ముఖ్యంగా ఆమె తనను గరుకుగా ముట్టుకోవడం మర్చిపోలేక పోవడం, తనకి అయిష్టంగా పెళ్ళిజరగ డం, చాలానాళ్ళు తను భార్యతో ముభావంగా గడపడం, తర్వాత

తర్వాత ఆమెలోని సున్నితమైన స్త్రీత్వం తనను క్రమంగా మార్చి వేయడం. తనకి స్త్రీలపట్ల ద్వేషంపోయి ఒక కొత్త భావం కలగడం...

అతను ముఖంమీది బురదను గోళ్ళతో పెల్లగించుకున్నాడు.

....సాధారణంగా తను పుట్టినే సలహా ఇవ్వడని అందరికీ తెలుసు. తను చాలా ఆలోచించి చెబుతాడని. అందరికీ అదో వెర్రి నమ్మకం. అందుకనే ఒకరకం నియంతృత్వంగా నడుస్తోంది తన ప్రాంతీయ పరిపాలన. ప్రజల మనసుల్ని వశపరుచుకుని పాలించడం ఇది. పూర్వం బలప్రయోగం చేసి, అత్యాశకొద్దీ ఒకేమనిషి స్వార్థంతో అనేక ప్రాంతాల్ని గెల్చి, అందర్నీ నొక్కిపెట్టి పాలించ డం. ఇప్పుడు వాళ్ళంతవాళ్ళే తమ నెత్తిమీద ఎక్కించుకునేలా చేసు కుని వాళ్ళను పాలించడం....ఈ పాలనను తను అందరికీ మేలు కూర్చేదిగా చెయ్యాలి. దాని ప్రత్యేకతను నిరూపించాలి. ఒకకొత్త వీడినీ, వాడినీ తోపింప చెయ్యాలి. అప్పుడు తరతరాలుగా వీళ్ళంతా తన వ్యక్తిత్వాన్ని పూజిస్తారు. అంతే....అంతకంటే ఇంకేం కావాలి? అంతమంది తనకు....తనను పూజిస్తారు!!!

....లొల్లాయిపాటలు కట్టే కవిగాళ్ళన్నా, ప్రేమ, పేమ, పేమ,....అని కథలురాసే రచయితలన్నా తనకు చాలా అసహ్యం...

....ఎవడో ఏదో వుద్యోగం చేసుకుంటున్నాడు. ఎంతోకొంత శ్రమపడుతున్నాడు. వ్యక్తిత్వం చచ్చి, తిట్లు వహించి, తలను వేలే సుకుని, తన్ను తనుపోషించుకుంటున్నాడు. ఎలా నడవమని శాసిస్తే అలానడుస్తున్నాడు. నువ్వు పార్టీలపేరెత్తరాదు-అంటే. అలాగే నంటున్నాడు. ప్రభుత్వాల్ని విమర్శించుకు. కబడ్దార్-అంటే, వాణికి పోతున్నాడు. నీ మనసులో పుట్టిన సిద్ధాంతాన్ని ప్రచారంచెయ్యక, అక్కడ పుట్టిన నవతను అక్కడే గర్భస్రావం చెయ్యి—అంటే 'యస్సార్' అంటున్నాడు. ఏవేవో లెక్కలు రాస్తున్నాడు; ఏవో వుత్తరాలు రాస్తున్నాడు; ఒకరకం యంత్రాంగాన్ని నడుపుతూ, సమా జానికి ఏదో మేలు చేస్తున్నాననే వాకతృప్తి. తను ఉద్యోగం చేసు కుంటున్నాడు. పడిన శ్రమకు డబ్బు ఏకొంతో సంపాయించుకుంటు న్నాడు. ఆ డబ్బుతో తిని, బ్రతుకుతున్నాడు ...

....వ్యవసాయం చేస్తున్నాడు పండిస్తున్నాడు. అధికారం

చెలాయిస్తున్నారు. పరిశ్రమల్ని స్థాపిస్తున్నారు. దేశ సౌభాగ్యానికి మరో మెట్టు వేస్తున్నారు....కాని,

కవిత్వం రాస్తున్నారు....ప్రేమమీద...ముద్దులమీద....పైట మీద... విషామీద .... పిరుదులమీద... నవ్వుమీద...ముఖంమీద.... విరహంమీద — పాడుతున్నారు. ఉపయోగం కనిపించడంలేదు. సామాన్య ప్రజలకి ఉపయోగం కనిపించడంలేదు. ప్రజాస్వామానికి. ఉపయోగం కనిపించడంలేదు సామ్యవాదానికి. ఏమీ లాభం నింపలేదు మతం పట్టింపులులేని సంక్షేమరాజ్యానికి. ఈ కవిత్వ మనే దొంగరాతల్ని, కడుపునింపని ఈ రాతల్ని. వుపయోగంలేని రాతల్ని వినేవాడెవడూ లేడు. (కాని ఇంకా పాతయుగంలో వుండా ల్సిన వాళ్ళుమాత్రం మెచ్చుకుంటూనే వున్నారు వాటిని)....ఎవడో వాల్మీకి రాశాడు అది చరిత్రకు పనికి వచ్చింది. ఎవడో వ్యాసుడు రాశాడు....అది సంస్కృతిని తెలియజేసింది. ఆ రోజున ఇండియాకు చరిత్రా, సంస్కృతీ రాసేవాళ్ళు లేరు. కాని, ఇవ్వాళ వున్నారు. ప్రపంచం సైన్సుతో నిండింది. మనిషి సంచలనాన్ని పుట్టించాలి. ఈ శతాబ్దపు కవిత్వాన్ని కొత్తజీవిత దృక్పథంతో రాయాలి.. కాని, ఇంకా,—

నీ కళ్ళు—కలువరేకులు
నీ వొళ్ళు—గన్నేరు పూల దొన్నె
నువ్వు—జిలేబీముక్కవు
లతుమవు—మాట్లాడని మల్లెపూవువు
సౌందర్యనందనానివి—మలాకా తాంపండువి
కల్పవృక్షానివి—మధ్యాక్కరవి
హాయిహాయి చందమామా

అర్ధరాత్రి సూర్యుడి నడి యౌవన నయాగరాలో లావాను దేవా లయాల గంటల అక్షౌహిణుల అణుయుగ నిమిషాల....కనురెప్పల కత్తిరింపుల .. అర్థంలేని కవిత్వాలు ! ! చేతకాని తనాలు! నడుస్తున్న ప్రపంచానికి కోరసలు కాలేనివాళ్ళు! మనుష్యుడిలోవున్న బలహీనత లను ఆధారం చేసుకుని, ఆ నరాలమీద, విరహాల్ని, పాత బాణీల్ని అనుకరణతో మోగించి మరీ విర్రవీగేవాళ్ళు! సొంత డబ్బాలతో....

బారుబాశాల్తో...అభివృద్ధికోసం పోరాడుతున్నవాళ్ళ చెవుల్లో విసుగ దలని కురిపిస్తున్న వాళ్ళు... వీళ్ళు సాధిస్తున్నదేమిటి?....కథల పత్రికలు!!!....దేవాలయాల మహత్తుల్ని గురించిన వ్యాసాలు. యౌవనంలో అడుగుపెడుతున్న వాళ్ళ చురుకైన భావాల్ని ఎటో మళ్ళించే కాముక సంబంధమైన ప్రేమకథలు!!

ప్రజాస్వామ్యంలో పత్రికలు!!...స్వాతంత్ర్యాన్ని పొంది జాతి ప్రగతికి పాటుపడుతున్న ఈ చరిత్రాత్మక యుగంలో కోకొల్లలుగా వున్న ప్రగతివిరోధక సమస్యలు!! ఒక్క పొరపాటును, ఒక్క అవినీతిని ధైర్యంగా వెలిబెట్టి న్యాయం చేకూర్చలేని జర్నలిజమ్!!

చేతగాని వాళ్ళచేతుల్లోంచి బఫూనరీ నాటకాలు!!...వేగంగా పురోగమిస్తున్న ప్రపంచ నాటకస్థాయిలో, ఎప్పుడో, ఎవరో రాసిన నాలుగయిదు పాతబడ్డ నాటకాలు. వందలసంవత్సరాల తర్వాత ఇండియాలో నాటకమే లేదట!

నవలల్ని రాసి చదువరిని ఏ మాత్రం కదిలించగలుగుతున్నారు ప్రజాస్వామ్యయుగం రచయితలు!! ఎక్కడవున్నామో, ఏమి రూపొందిస్తున్నామో తెలియని కళాస్రష్టలు!!...

....సంస్కారంలేని ప్రజల్ని మభ్యపెడుతున్నారు. కాళ్ళ తిమ్మిరిని సడల్చి, వూతం ఇచ్చి వీళ్ళని నడిపించాలి...తాము చేస్తున్న తప్పును తెలుసుకునేలాగా తయారు చెయ్యాలి. సంగీతం ప్రకారం ఛందస్సుల్ని తయారుచేసుకుని, మాటలపోగులు పెట్టి రాసెయ్యడం కాదు; ప్రజాహృదయం చిందుల్తొక్కి అరచిన అరుపును సంగీతంగానూ, ఆ వ్యవస్థను ఛందస్సుగానూ దిద్దుకోవాలి ...కాని, కాని... దున్నపోతు బ్రతుకు బ్రతకగూడదు.

—అతను మళ్ళీ మళ్ళీ తను ఆఖరుగా అనుకున్నమాటను తనలో తను అనుకున్నాడు. ఒక్కచోటికే చేరుకుంటున్న పల్చటి వూపిరి బయటకి చేతుల్తో చిందిస్తున్నట్టు...తను అనుకుంటున్న మాటకు చిన్నగా నవ్వుకున్నాడు. అతను గొలిగికంపను తీగల్లో బిగించి, వూపుతూ, పట్టు దొరికించుకుని కడుతున్నాడు....ఇప్పటికి మొత్తం అయిదు డొంకల్ని చాలాలోపల వరకూ నరికేశానని లెక్క

కట్టుకున్నాడు. అరచేయి ఒకే ఇదిగా మండుతోంది. చేతులు గీరుకు పోయాయి. పుండు లోతుగా నలిగి బాగా గుంట పడినట్టనిపించింది. తీగను అయిదు పేటల్ని జములుగా చేసి భుజానికి పెట్టుకుని లాగు తున్నాడు.

....తనీష్మధ్య దబ్బు శాంక్షను చేయించే రందిలో పడి సమితి సమావేశాల్లోనూ, కమిటీ మీటింగుల్లోనూ మునిగిపోయాడు. ఇంతలో అరచెయ్యి సున్నితమయిపోయింది...

—మనుష్యుల్లో తప్ప, కొన్ని పెంపుడుజంతువుల్లో తప్ప. తనకు తరచుగా కనిపించే మిగిలిన జంతువుల్లో అన్నీ ఎప్పుడూ, ఏదో వొకటి చేస్తున్నట్టే కనిపిస్తాయి. కుక్క మనిషిని చూస్తూనే అంత బద్ధకం నేర్చుకుందేమో. తను పరిశీలిస్తూన్నాడుకూడా. అడవి జంతువులు వుట్టినే కాలాన్ని గడిపెయ్యవు. మానవుని మెదడు బాగా ముడతలుండటంచేతా, సున్నితంగా సునిశితంగా వుండడంచేతా, ఎక్కువ భావాలువుండేలా అయింది. దాంతో, కొన్నిభావాలు ప్రాధాన్యం వహించి మిగిలిన వాటిని అణిచేసి, ప్రకోపనలోతమ విధానాన్ని సమర్థించుకున్నాయి...మమకారం, దాపరికం, కక్ష...కట్లాటివి. తేనెటీగలు జాతికోసం బ్రతికినట్టు...మానవుడుకుటుంబంకోసం.

అతను గట్టుమీదినుంచి, జాగ్రత్తగా, వొక్కపారిగా దొర్లించేడు గొలిగిమోపును, అదికూడా ముందులానే దొర్లింది, అయితే, అంత దూరం వరకూ పోలేదు...ఫరవాలేదు....చిన్నది కాబట్టి మిగిలిన నాలుగు గజాలూ ఈడ్చుకు పోవచ్చు. వూపు సరిపోలేదు—అనుకున్నాడు. అతను....వాలుగా...ఎండిన పల్లేరుచెట్లకు దూరంగా.... మడమల్ని ఎత్తుతూ...కిందికి దిగేడు.

ఎండ, నుదుటిమీదపడి, శరీరాన్ని కాగబెడుతోంది. మీసాల చుట్టూ ఆవిరివస్తోంది. అతను గట్టిగా కళ్ళుమూసుకుని తెరిచాడు. వెచ్చగా అనిపించాయి కళ్ళు. చేతుల్ని దులుపుకుని, తీగల్ని చేతుల్లోకి తీసుకుని, కావాలన్న చోటికి లాక్కున్నాడు కంపను.

అనుమానం వచ్చింది—బయటికి తీయలేనేమోనని. నిరుత్సాహం నిండుకుని పొర్లుకొస్తోంది. అతని శరీరంలో కణాలు బాగా కాలి, వొళ్ళు బాగా వెచ్చబడుతూ, నీరసానికి లాక్కొచ్చింది. చేతులవేళ్ల

ముడుచుకోవడంలేదు... పట్టిస్తున్నాయి. వెంటనే గట్టుమీంచి, డామ్ మీంచి పొర్లుకొస్తున్న నీటివి బలవంతంగా అడ్డుకట్టలు వేసి, క్షణం కదలకుండా ఆపేసినట్టు,—గట్టుమీంచి డొంకల్లో చల్లగాలి వీచి, వొళ్ళు చలిగా జలదరించింది.-ఉత్సాహాన్ని, తీగల్ని తెంపి దగ్గరకు లాక్కున్నట్టు, పుంజుకున్నాడు అంచలంచెలుగా కార్యక్రమాన్ని విభాగించి చూసుకున్నాడు. తను ఇంతకు ముందుకంటే తొందరగా పనికావిస్తే దున్నపోతు దిగ్విజయంగా బయటికి వస్తుందన్న విశ్వాసం ధ్రువపడుతోంది. చేతిలో కత్తివి, ఆనమాలుగా కంపమంద లకు దూరంగావేసి, కంపమోపును విప్పి, కంపను దూకుడుగా బడి తెల రెండువేపులా విసురుతున్నాడు.

... ఫరవాలేదు. దున్నపోతు మెడ కదిలిస్తోంది. నీళ్ళు తాగిన తర్వాత కొంచెం శక్తి వచ్చింది....ఇవి విసిరేసిన తర్వాత, పచ్చగడ్డి దావి ముందు పారేస్తే తింటుంది...నెమ్మదిగా. ఏ కొంచెమయినా శక్తి వస్తుంది. పేగులు లోపల బాగా జీర్ణ రసాలు వూరి వుండడం మూలాన, ఈగడ్డి లోపలికి పోగానే జీర్ణక్రియ ప్రారంభమవుతుంది. ఒకవేళ పేగులు పచ్చిబడిపోయి, ఈ గడ్డి తిన్న తర్వాత, వొక్క సారిగా పనిచేయలేక సొమ్మసిలి పోతాయేమో! వెంటనే అరగకపోతే. తర్వాత నెమరువేసుకుని అరిగించుకుంటుందేమో! లేకపోతే ముందు పారి నమలినప్పటికి రసంకొంత దాని జీర్ణకోశంలోకి జేరుతుంది గదా! తగినంత విశ్రాంతిదొరికేవరకూ జీర్ణక్రియ జరగదేమో!... దున్నపోతు పేగులు అంత సున్నితంగా వుంటాయా?

ఎందుకుండవు? లోపలి శరీరం అందరికీ వొకటే.

కాని, అది వుడకబెట్టినవి తినడంలేదు. అయితేనేం, పచ్చిద నాన్ని జీర్ణించుకునేశక్తి దానికుంటుంది. మనుష్యుడిలో వున్న సున్నిత మైన రసాలు సున్నితమైన భోజనాన్ని జీర్ణమయ్యేలా చూస్తాయి; పశువులకడుపులో వున్న ఘాటయిన జీర్ణరసాలు—పచ్చి వాటివి. మనిషికి ఒకరోజు అన్నం లేకపోతే ఎలాగో, దున్నపోతుకు మూడు రోజులు లేకపోవడం అలాగ. మనిషయితే ఒకరోజు పస్తున్న తర్వాత తింటే, కొంచెం డీలాపడి, నెమ్మదిగా నిమిషాల్లో, పావు

గంటలో కోలుకుంటాడు. ఆ ప్రకారం ఇదీ కొంత కోలుకుంటుంది మూడుగంటల్లో.

ఏమో! అసలు ఎప్పుడు పడిందో ఇది ఈ పూబిలో. మూడు రోజులయిందో, వారం రోజులయిందో, ఏమో...

పరధ్యానంలా పడిపోయి, అతను గడ్డిని భుజంమీద పెట్టుకుని పూబిలోకి దిగాడు. రెండువేపులాబడితల సహాయంతోతొక్కి సలాడు తున్న గజంపైగా లోతున్న పూబిదారిలో. — కాలి బరువును పూర్తిగా ఆన్చి లోపలికంటా దిగబడి పోకుండా, నడుస్తున్నాడు. ఒకవేపు గడ్డి భుజంమీంచి జారిపోతుందేమో అన్న ఆదుర్దా. ముందుకు చూశాడు. పూబి తీసినంత ప్రదేశం కొంచెంగా పీక్కూరాయి. ముందు వున్న కొంచెం పల్చనైన, బడితెల మధ్య పూబి మాత్రం. ఒక అడుగు పైనుంచి చిట్లి కదిలి, వెనక్కి జరిగింది దున్నపోతు వేపునుంచి, తనుచేస్తున్న నడవలోకి ఏమీ జార లేదు....తన ప్రయత్నం ఫలిస్తోందన్న ధైర్యంతో శ్వాసను పీల్చాడు. దున్నపోతును, కాలు వూతం చూసుకుంటూ. 'ఏయ్య' అని పిలిచాడు, అది- 'ఏమయ్యా' అన్నట్టూ, 'హల్లో'అన్నట్టూ వుందనుకున్నాడు. అది తల కదిల్చింది, ఆ కదలికను పట్టి, దానికి కొంచెం ప్రాణం వచ్చిందనుకున్నాడు- రాఘవులు.

గడ్డివాసన తగిలి, అది తలను కదుపుతూనే వుంది. రాఘవులికి అర్థమయింది. అంచేత అతనిలో మరింత ఉత్సాహమొచ్చింది. అతనికి, లోతుగావున్న ఆ కాలవ మలుపు మూలనున్న ఊబిగుండం మధ్య ఆ ఆకాశం కింద వున్న తనూ దున్నపోతూ మాత్రమే, ఈ ప్రపంచంలో మిగిలివున్నట్టూ, ఈ సన్నివేశంలో చిక్కుకున్నట్టూ అనిపించింది, అతను తల ఎత్తి చుట్టూ చూశాడు, ప్రపంచంలో చాలా కొద్దిమంది మనుష్యులు నివసిస్తున్నట్టు అనిపించింది ఆ క్షణంలో అతనికి. తను వేరు చేయబడ్డటూ తను ప్రత్యేక మనిషిగా... అతను దాని పక్కగా ముందుకొచ్చి గడ్డిని పదిలంగా పెట్టి, తీగకున్న ముడిని వదులు చేశాడు.

అది తలను కదుపుతోంది మూగదానిలా. దానిమూతి కొంచెం మెత్తబడింది. దాని దరిదాపుల రొచ్చు వాసన వేస్తోంది. అది మూతిని

కదిపి. పదే పదే గడ్డిని వాసన చూస్తోంది. తలను కదుపుతోంది. గడ్డి మీద మూతిపెట్టి మళ్ళీ తీసేసింది. నాలుకను కదిపింది. గుర్రుమంది. మూలుగులాంటిది. మళ్ళీ తలను కదిపింది. రాఘవులు చూస్తున్నాడు. దాని నాలుక బయటికి వస్తోంది. మొద్దుగా కనిపిస్తోంది. అది నాలికతో గడ్డి పరకల్ని నోట్లోకి లాక్కుంది. దవడల్లోకి వెళుతున్నాయి పరకలు. నాలికను ప్రయత్నంతో అటూ ఇటూ తిప్పి నోటిలోకి పరకల్ని లాక్కుంటోంది. నాలిక బాగా కదలడంలేదు. కొంతసేపలా చేస్తే. బాగా కదులుతుందనిపించింది రాఘవులికి. సన్నటి మీసాలు మీదుగా తుడుచుకుంటూ దాని చట్టమీద పుండువంక చూశాడు. అది బురదతో కప్పడిపోయి కనిపించడంలేదు. కాని. రసి కారిన చార మాత్రం వుంది, చట్టకిందికి. వాసనకూడా రావడంలేదు. బయటికి లాగిన తర్వాత కాలవలో దాని ఒంటినిండా నీళ్ళు జల్లేటప్పుడు ఆ బురద కడిగేద్దామనుకున్నాడు రాఘవులు. దాని కళ్ళంట నీళ్ళు వస్తున్నాయి. కన్నీటి బిందువులు, వెంట్రుకలమీదుగా జారి,వూబిమీద పడుతున్నాయి మంచుబొట్లు ఆకులమీంచి రాలినట్టు. దాని కళ్లు అది గడ్డిని తింటూంటే, తెరుచుకుని వున్నాయి. దున్న, దేన్నో ఆలోచిస్తూ, గడ్డిని మేస్తున్నట్టుగా వుంది.

రాఘవులు దానిమీద చెయ్యివేశాడు. దాని మూపు కదిలింది- జలదరించినట్టు. ఇంక అది తప్పకుండా బ్రతుకుతుందనిపించింది. అతని చేతికి తగిలిన కండువా, ఆరిపోయి. స్పర్శజ్ఞానం కలిగించింది. దాన్ని మళ్ళీ తడిపి, దున్నపోతుమీద విప్పి కప్పితే, దాని స్థితి యింక మెరుగవుతుందనిపించింది. కాని. మళ్ళీ వెళ్ళి. కాలవలో తడుపు కొస్తే కొంతసైమయిపోతుంది. ఆ పొడి గుడ్డయినా, ఎండ ఎక్కువగా తగిలి అది బాధ పడకుండా, కప్పి వుంచితే, ఫరవాలేదనిపించింది. తర్వాత తన కండువాను తను తీసికెళ్ళేటప్పుడు చాలా చెడ్డవాసన వస్తుందనుకున్నాడు.

...ఎలక్షన్ల సమయంలో ఇంతకంటే ఎన్నోరెట్లు శ్రమ పడ్డాడు తను....ఇప్పుడు ఇంటిదగ్గర అంతా మంచి సరదాల్లో వుంటారు.... ఎందుకొచ్చిన శ్రమ ఇది తనకి...కాని ఈ శ్రమ తన కొక లెక్కలోదికాదు.... అయితే ఇటువంటి శ్రమ తనకి కొత్త...

ఎలక్షనప్పుడుతి ండివుండేదికాదు. మనుష్యుల ప్రవ ర్తనబట్టీ, స్వభావాన్ని బట్టీ వాళ్ళడుగుతున్న ప్రశ్నలకి సమాధానం చెప్పడం అన్నిరకాల వాళ్ళనీ సంతృప్తి పరచాల్సి రావడం. భిన్నవయస్సుల వాళ్ళు....భిన్న భిన్న భావాలవాళ్ళు!...తనకు రష్యానూ అమెరికానూ చూసిరావాలని వుంది అవి రెండూచూసి, వాటిమీద తనంత తాను ఒక అభిప్రాయాన్ని ఏర్పరుచుకోవాలి. అవి రెండూ రెండురకాల సమాజాలకు ప్రతి బింబాలు. ప్రతికూల సిద్ధాంతాలకు పట్టుగొమ్మలు. ఎర్రద్దాలవాళ్ళూ, నల్లద్దాల వాళ్లూ, వాళ్ళకి కనిపించిన విధంగా, చెపుతున్నారు. వాళ్ళు కొన్ని భావాలతో వెళ్ళి, వాటిని సమర్థించుకుంటూ చెపుతున్నారు. కాని తను వాటిని ప్రయోగంకోసం చూసిరావాలని. రష్యా కొన్ని రాజ్యాల సిద్ధాంతాలకి ప్రతినిధి. అమెరికా మరికొన్నిరాజ్యాల ఆదర్శాలకి ప్రతినిధి. రెండింటినీ సమన్వయించుకుని దేశానుగుణ్యంగా మలచుకునే పక్కీ కావాలి తనకి. అంచేత తనదేశ ప్రతినిధిగా వెళ్ళి రావాలి తను. అప్పుడు తనకి పట్టిన సిద్ధాంతాల్ని జోడించి ఉద్యమాన్ని రూపొందించుకోవాలి.

...తను ఇప్పటివరకూ తనను బలపరచే వాళ్ళనే తన అనుయాయులుగా ఎన్నుకున్నాడు గాని, వాళ్ళకి తన లాగా పోరాడే నేర్పు అలవడేందుకు శిక్షణ ఇవ్వలేదు. అలా శిక్షణ ఇవ్వాలంటే వాళ్ళతో చర్చపెట్టుకోవాలి, అంతేగాని, వాళ్ళు తను చెప్పింది విని దానిని యథాతథంగా ఆచరించగూడదు. చెప్పినంతవరకూ చేసి, మళ్ళీ తను చెప్పే వరకూ అలా కూచోగూడదు వాళ్ళు. వాళ్ళంతట వాళ్ళు వాళ్ళ భుజాల మీదికి ప్రజా సమస్యలను ఎత్తుకుని ప్రజాక్షేమం దృష్ట్యా సొంతసిద్ధాంతాలనీ, సొంత విధానాలనీ ఏర్పరచుకుని పురోగమించాలి.

....తను చూసిన రాజకీయ దురంధరులలో నూటికి ఇరవై మంది దేశ ఆర్థిక వ్యవస్థన్నీ విధాన సభలో జరిగే విషయాల్నీ తెలుసుకోలేనివాళ్ళే.

ఇవన్నీ...ఇంకెన్నో తెలుసు ప్రజలకు, అత్యుత్తమ ప్రజాస్వామ్య పద్ధతిమీద దేశ రాజ్యాంగ యంత్రం నడుస్తోందని తెలుసు. రేపు మరోపార్టీ హెచ్చుస్థాయి కొస్తోందంటే, ఇప్పుడున్న ప్రభుత్వ

పక్షంవాళ్ళంతా ఒక్కసారిగా ఈ రెక్కల్ని విదిల్చి, ఈ గొడుగుల్ని ముడిచి, ఆ జెండా కిందికి జేరతారని ప్రజలకు తెలుసు. కాని, తెలియనిదంతా వొక్కటే—

ఈ వ్యవస్థ అంతా తమ చేతిలో వుందని, తమమీద ఆధారపడి వుండని—అది తెలియజేయాలన్నదే తన ప్రయత్నం.

"ఈ దున్నపోతులో వున్న శక్తిని దీనికి తెలియజేస్తాను. ఈ వూబి అంతా పక్కకిలాగేసి—దానంతట అదే కదిలి వెళ్ళి ఆ యిసక నేల మీద నడయాడేలా చేస్తాను...హేయ్!!" అని అరిచాడు కృతనిశ్చయుడైన రాఘవులు. చేతివిండా వూబిని లాగి, గిరాటు వేశాడు పక్కకి అది చిందింది,థాప్....మంది. అరచేతుల్ని ఒకదానికొకటి చప్పుడయేలాగా కొట్టాడు. తనకు వెనుక వేపు వున్న పొద్దువంక చూసి, వూబి మీదికి వంగి, బురదని దోసిళ్ళతో పట్టి గబగబ లాగేస్తున్నాడు. గొలిగికంపను; బలంకొద్దీ, కసిగా బదితెల బయటివేపుకి అవస్థపడి. అడుగుకంటా, లోపలనుంచీ బయటనుంచీ - నొక్కేస్తున్నాడు. వూబి బాగా నలిగివుండడం మూలాన పూర్వంకంటే బాగా తొందరగా వచ్చేస్తున్నట్టనిపించింది. అలా గబగబా వూబిని తీసేస్తూ, అతనికి పాట పాడాలనిపించింది...వరి చేలల్లో పాటలు ...జొన్న చేల పాటలు....కుప్పనూర్పిడి పాటలు....సుగాలీల పాటలు....అతని మెదడులో కాలేజీ జ్ఞాపకం వచ్చింది. డ్రామాలూ, స్టేజి. ఉపన్యాసాలూ...తెల్లటి బట్టలూ....అమ్మాయిలూ....అస్తమానూ అందరూ క్లాసులో అమ్మాయిలమీద ఆలోచనలూ, రూపాయి నోట్లను ప్రతి నిమిషం మార్చడం...సినిమాలు....ట్యూషన్లు....పరీక్ష పోవడం.... అది పూర్తి చేసుకుని, ఉద్యోగ ప్రయత్నం....

....ఆఫీసుల చుట్టూ తిరగడం సర్వీసు కమిషన్, ఎంప్లాయిమెంటు ఎక్స్ఛేంజి, డబ్బు అయిపోవడం. నిరుత్సాహం, ఎక్కడో, వొకచోట అటెండరు...కాదు.. గుమాస్తా. అటెండరుకన్నా కాస్త పెదది పెళ్ళి...పిల్లలు...ట్రాన్స్ఫర్లు....పిల్లలు చదువులు...వాళ్ళ పెళ్ళిళ్ళు. చిరిగిపోయిన చొక్కాలు, మరోవేపున ప్రేమ వివాహాలు... ఇద్దరూ వుద్యోగం, మధ్యలో విడాకులు. మోజు తీరగానే స్పర్థలు, పిల్లల్ని అనాథ శరణాలయానికి వప్పజెప్పడం. నిజంగావున్న అతను

మరో ఆడకూతుర్ని పెళ్ళిచేసుకోవడం. ఆమె. పెళ్లిమీదా. మగాళ్ళ ప్రేమ మీదా నమ్మకం తప్పి. స్వేచ్ఛకోసం సరదాపడి. తన దాహం తీరడంకోసం ఆఫీసర్లు....డబ్బున్నరసికులూ...పైవాళ్ళ వాళ్ళల్లో... అది జీవితం....జీవితం ఎలా నడిపించుకుపోతే అలా నడవడం.... దున్నపోతు పీఖ్ఫుతాగి జీవితాన్ని నిలుపుకుందామని. నడుచుకుపోయి. వూబిలో దిగబడిపోయి.—ప్రాణాలు పోగొట్టుకుంటున్నది.... దున్న పోతు!...

రాఘవులికి తను ప్రవక్తననిపించింది. ప్రవక్తకూడా మనిషే ననీ. దురాచారాల్ని ఖండించి. ప్రజలకు. సత్యాన్ని చెప్పే సలహా దారుడనీ; తను అలా చేస్తున్న మూలాన తనూవొక ప్రవక్తననీ అని పించింది. ప్రవక్తకన్నా తనే గొప్పవాడిననిపించింది. తనకు బాధ్యతకూడా వుంది...తననీ బాధ్యత అనేక మూలల్నుంచి లాగిపట్టి పిసిగిస్తోంది. కాని తను చాలా సహనవంతుడు...

కీచు...మని దున్నపోతు అరిచింది. కొండచిలువ అరచినట్టు వుందది. కీచురాయి శబ్దంలాగా. చెకుముకిరాయిని గీసినట్టు. స్టేటు బస్సు పాతబడి ఆగినప్పుడులాగా. అరిగిపోయిన బండి చక్రం ఇరుసులో పట్టుపట్టి నారలేనప్పుడు అన్నట్టు. అతను కంగారుపడుతూ దాని వంకతిరిగి చూశాడు. కాని. అది గడ్డిని తింటో ఆ విధంగా శ్వాపించింది. అంతేనని స్థిమితపడ్డాడతను. ఎళ్ళీ తనపనిలోకి దిగి శరీరాన్ని వంచాడు. ఒళ్ళంతా స్నానం చేస్తున్నలాగా చెమట.

...ఒక్కొక్కప్పుడు ప్రమీలను తీసుకొని వచ్చి పొలాన పనిచేయించాలని వుంటుంది తనకి. అప్పుడుగాని తమ బిడ్డలు ఆ కష్ట ఫలాన్ని తినడానికి అర్హులు కారనిపిస్తుంది కాని. ప్రమీలను పొలం తెచ్చేందుకు తనవాళ్ళందరితోనూ తను ఘర్షణపడాలి. అయినా ప్రమీల ఇంటిపనితో విమిశ్రంచదు. ఎలాగోలాగు కాయకష్టం చేస్తోంది. చాలు. తనకొడుకులు పొలానికి వస్తున్నారు. పని రద్దీగా వున్న రోజుల్లో వాళ్ళచేత ఏదో వొకటి చేయిస్తున్నాడుతను. ఒకళ్ళ మీద ఆధారపడగూడదన్నది. తను వాళ్ళకి ప్రతి హిమగ్లోబిన్ సూక్ష్మకణంలో నూ ఎక్కేలాగా ఇంజెక్టు చేస్తున్నాడు.—

"పొలంరా. కష్టపడి పనిచెయ్యి. తండ్రిని గనుక విన్నా ఈ

అర్థంలేని వ్యవస్థలో పెంచడం. నీ పోషణకి నువ్వు వుపయోగ పడే లాగ తయారు చేయడం నా విధి. ఈ వెధవ గిలకరింపు పుస్తకాల్ని చదువుతున్నామని. ఏవో గొప్ప మార్కులు సంపాయిస్తున్నామని. అందరిలాగా గర్వపడకండి. ఎవళ్లో చేతకానివాళ్ళు. వాళ్ళ వాళ్ళ పాత భావాల ఇష్టాల కనుగుణంగా. పుస్తకాలు కూర్చి మిమ్మల్ని చదవమంటారు. వాళ్ళు ఫలానా వాడు గొప్పవాడు అని రాస్తారు. అది చదివి మీ బుర్రలు పట్టి పట్టి ముద్దలవుతాయి. ప్రతి విషయాన్నీ నిర్మొహమాటంగా విమర్శించడం నేర్చుకోండి. పదవిలో వున్న వాడినీ. సంపాయించినవాడినీ ఎప్పుడూ. వాడి పదవిని చూసీ. డబ్బును చూసీ గౌరవించకండి. అలా గౌరవిస్తే మీరు ఎందుకూ పనికిరాని వాళ్ళన్నమాట. వాళ్ళల్లో ఏమయినా మానవత్వంవుంటే మాత్రం. ఉదాత్తతవుంటే. వాళ్ళకి సాష్టాంగపడండి. ప్రతినిమిషం కష్టపడి పని చేయడానికి ప్రయత్నించండి. కష్టపడకుండా తింటోంటే. వొకళ్ళను వంచించి. తింటున్నామన్నమాట. ఒకళ్ళచేతిలోంచి లాక్కుని, వాళ్ళు ఆకలితో చచ్చిపోతూ ఏడుస్తోంటే.—

"శాంతిగా నువ్వు తినలేవు...తినగలవా?"

"...ఎవడి తిండికోసం వాడు. ఎంత నికృష్టమయిన పని చేసినా తప్పులేదు. అది కష్టపడి అనంతతాను చేయగలిగిన న్యాయ సమ్మతమైన పని కావాలి. తండ్రి ఆస్తిమీద. పరాయివాళ్ళ ఇష్టా నిష్టాలమీద...వొకళ్ళమీద ఆధారపడకూడదు. తనుగా తాను సంపా యించుకోవాలి. తనుగా. ప్రపంచం మధ్య. అందరిమధ్యా. పెద్ద ఎత్తులో నిలబడాలి. అదీ ప్రజ్ఞ..."

ఆతను వూబి పట్టిని లాగేస్తున్నాడు. చిన్న తనంలో పిచ్చుక గూళ్ళను ఇసుకలో కట్టడం. బజారుల్లో పారే వర్షపు నీటికి అనకట్టలు వేయడం. ఐట్టలు తడుపుకోవడం...అవన్నీ. ఉండి ఉండి అతనికి జ్ఞాపకం వస్తున్నాయి. అతను తన కొడుకులు తన ఎదురుగా కనిపి స్తున్నట్లు వూహించుకున్నాడు. వాళ్ళ మొహాలూ, నిటారైన నడకా అతనికి తలపులో మెదిలాయి. ఇద్దరూ చురుకైనవాళ్ళు. తృప్తిగా వూపిరి విడిచాడు.

....ఇప్పుడు తన భార్యకు ప్రసవ దినాలు...చివరకి ఆడది

పుట్టి 'అపరేటస్' మాత్రమే. స్వతస్సిద్ధమైన పుష్టి ఎక్కువగా వుండదు ఆడాళ్ళలో. ప్రసవ మప్పుడు చాలా బాధ పడతారు... (అతవిచేతిలో తాటి మట్ట విరిగింది). ఛీ—ప్రమీల చచ్చిపోగూడదు. ప్రమీల కనడం మాత్రమే తన పని అనుకునే మనిషి కాదు. ఆమె ప్రభావం తనమీద చాలాపడింది. తనలో చురుకుపాలు ఎక్కువయ్యేట్టు చేసింది. తనలో ధైర్యాన్ని కలిగించింది. ఆమె లేకపోతే, ఆమెకాక మరో తొందరపాటు ఆడదయితే, తనకి స్త్రీలమీద పూర్తిగా విముఖత కలగేది. ఆమె—తనతో ఒకటయి, తనలో ఒదిగిపోయి, రక్షణకోసమూ, ఆత్మసమర్పణకోసమూ పడే తపనలో – తన్ను ఆరోగ్యం కోలుకునేలా చేసింది. తనకి సాంఘిక వాతావరణాన్ని అర్థంచేసుకునే అవకాశం ఆమెవల్లనే కలిగింది – స్త్రీ సహజమైన మెత్తదనం, సహనం, వాత్సల్యం విశ్వాసం.... ఆటువంటివి ఆమెలో తగినంతగా వున్నాయి... అంతే చాలు....ఈరకం తృప్తి చాలును ఈ జీవితానికి....

(అతని మెడలో నరం టప్ మంది వేళ్ళు విరిగే విధంగా అంది. పూబి బయటకు వేస్తూంటే చిందుతోంది. పొగ వాసన వేస్తోంది)—

....జంతువుల్లో వేరువేరు ప్రకృతులు వుంటాయి—ఒక దున్నపోతు ఎన్నింటినో కలుస్తుంది. (పక్షుల్లో అలాకాదు) దీనికి తల్లిలేదు. తోబుట్టువు లేదు, న్యాయం లేదు. సంస్కారం లేదు. జ్ఞానం లేదు, కట్టుబాటు లేదు. ఒక దున్నప్రభావం, మరో దున్న మీద పడదు. దేని వ్యక్తిత్వమూ మరో వ్యక్తిత్వాన్ని తీర్చి దిద్దదు. ఒకదాని విలక్షణతను మరొకటి అనుకరించదు. మడ్డితనం వీటి జీవితం. కొన్ని జంతువుల్లో ఉద్రేకం జీవిత మవుతుంది. కాని, ఒక్క మనుషుల్లోనే, ఇంత విస్తృతమైన జీవన విధానం...

అతను వెనక్కి తిరిగి చూగాడు. తల చిటపటలాడుతోంది. దున్నపోతు గడ్డిపరకల్ని నెమ్మదిగా నమిలి తింటోంది. అది నములు తున్న గరగర వినబడుతోంది తనకి. ఉండి ఉండి డొంకలమీది నుంచి కాలువమీదుగా గాలివీస్తోంది. గాలి వీచినప్పుడు, తడిసిన అతని చల్లటి బనీను చల్లగా అవుతోంది. గాలి తెరలుగా రానప్పుడు,

ఎండ వెచ్చదనం వొంటిమీదపడి, వొంట్లోంచి ఆవిరి పుడుతున్నట్టూ, చిటచిటలాడుతున్నట్టూ అనిపిస్తోంది. ఉండి ఉండి దూరాన పచ్చిదనం తగలబడుతున్నట్టు వాసన.

అతను గొలిగికంపను చేతిలోకి తీసుకుని, బడితెల కవతలి వేపున కిందికంటా పూబిలోకి నొక్కుతున్నాడు. చేతి వొత్తిడికి ఊబి దారియిచ్చి, బడితెలకు పక్కగా బాగా కమ్మకునేలా సందు ఇస్తోంది. మండలకు. ముందు కొంతవరకూ నొక్కి, కొంత పూబిలాగివ తర్వాత, మిగిలిన కంపను అడుగు కంటా నొక్కేస్తున్నాడు... అతనికి తను చేసిన ఆలోచన బాగున్న దన్న తృప్తి కలిగింది.

# 2

పొద్దు తిరిగి పోయింది ... ఎవరన్నా వస్తున్నారేమో — నని చూశాడు రాఘవులు. తలను ఎత్తగానే, మళ్ళి మెడదగ్గర మరో నరం విరిగి 'టప్' మంది;.... రక్తం అక్కడ చేరుకుని బాగా వెచ్చగానూ బాగా సుఖంగానూ ఉన్నట్టు అనుభూతిని పొందాడు. కాలవంతా ఎర్రగావుంది—నేల, ఇసుక వున్నచోట్ల తెల్లగా. నీళ్ళు నల్లగా, గులకరాళ్లు నల్లగా కాలవపైన—చెట్లూ, పొదలూ పచ్చగా దూరంగా గుట్టగా పోసినట్టున్న చిన్నకొండ,కొండమీద ఏనుగంత పెద్దరాయి....

...ఒకరోజు దానిమీద రాఘవులు కూచున్నాడు.

అతను సాయంకాలపు నీరెండవేళ బుస్కయ్యను అక్కడికి రమ్మన్నాడు. సమితి ఆఫీసు వున్న వూళ్ళో, గవర్నమెంటు డాక్టర్ని గురించిన అపవాదులు తనదాకా వస్తే: వాటిని గురించి ఆరా తీసిరమ్మని బుస్కయ్యను పంపాడు రాఘవులు. బుస్కయ్య, నాలుగుమైళ్ల దూరమున్న ఆ వూళ్ళో రెండ్రోజులు తిష్టవేసి, కాలికి దెబ్బ తగిలించుకుని, వారంరోజులు హాస్పిటల్లోవుండి. అయిదు రోజులు బాగా చనువయి డాక్టరుగారింటికి వెళుతూ, ఆయన పుట్టు పూర్వోత్తరాలూ, ఇక్కడవున్న సంబంధాలూ, నిజమైన అపవాదులూ, అబద్ధపు అపవాదులూ. అన్నీ తెలుసుకొచ్చి—ఆ సిర్ణయించు

కున్నచోట చెపుతాడు. బి. డి. వో. లూ. యస్. ఇ. వో. లూ హెల్తు విజిటర్లూ, గ్రామసేవకులూ, అందర్నీ గురించీ: వణుగు రయిదుగురు ఎవళ్ళకీ అనుమానం తోచని వాళ్ళు—ఆ విధంగా వచ్చి అతనికి చెపుతూంటారు. సాయంత్రం అటువేపు రమ్మని బుస్కా య్యకి చెప్పి వచ్చాడు. రాతికి బాగా పైన కూచున్నాడు.

'కస్' మని వినిపించింది.

వెంటనే, 'కేట్' మని రాతిమీద కర్రదెబ్బ వినిపించింది. తల తిప్పేసరికి బజారు చేతిలోని కర్ర తాచుపామును చంపింది. తాచు పాము నడుం నలిగి, తల పగిలి, చస్తూ, కదుల్తోంది. దానిప్రాణం తొందరగా పోయేందుకు కొట్టుకుంటున్నట్టు—తోక.

తాచుపాము చావడానికి ఆశ్చర్యపడ్డ రాఘవులు, తాచుపాము లాంటి బజారును చూసి, క్షణంగా మరింత భయపడ్డాడు...బజారు ఇక్కడికి వచ్చి రహస్యంగా తనని ఎందుకు పరిశీలిస్తున్నట్టూ? బజా రును ఇటువంటి కళ్ళతో, ఇటువంటి క్రూరావేశంతో తను ఎప్పుడూ చూడలేదు. తన్ను ఆకళ్ళతోంచి, చూసి, తలదించుకుని, తిరస్కా రంగా విలబడి,—

"మిమ్మల్ని కొట్టమని పంపించారు మి బాబాయిగారూ, గంగన్నగారూ...అంతా" అన్నాడు బొగరుబోతూ తనంతో.

"మరి కొట్టవేం?"

"అలాగే కొట్టేవోణ్ణి..." బజారు మళ్ళీ కర్రను తాచుపాము మీద కొట్టి, "....కాని ఇదొకటి అడ్డొచ్చింది. నాకెక్కిన విషా అంతా దీన్ని చంపడంతో తీరిపోయింది. ఇంకిప్పుడు, నిన్ను కొట్టా లంటే మళ్ళీ ఎనక్కెళ్ళి, అరందరి సేతా మళ్ళా సెప్పించుకు రావాలి. అప్పుడయినా యింక నిన్ను కొట్టలేనేమో!"

రాఘవునికి లోలోపల అధైర్యం కలుగుతోంది. నెమ్మదిగా, రాళ్ళమించి బజారు దగ్గిరిసా వచ్చాడు....తనూ బజారూ మనుష్యులే. తమ యిద్దరు సంఘంగా తయారయిన వాళ్లే. ఎవళ్లో స్వార్థానికి తను అడ్డువస్తే, తన్ను నిర్మూలం చెయ్యాలని. బజారును పంపారు. బజారు, మానవజాతి మొత్తానికే విరోధి అయిన పామును చూశాడు.

జాతి ప్రేమ నిండి, లోపలి కక్ష నశించిపోయి, విరోధిని చంపాడు. అతని మెదడు విశాలమై ఆలోచించింది.—

నేనూ రేపు ఇలానే చావాల్సి వస్తుందేమో! తెలియని ఘోరమైన చావు! నేను ఏం సాధిద్దామని చంపుతున్నాను? ఏదో మంచి చెయ్యాలని ప్రయత్నం చేస్తున్నాడు...పాములాంటి తన బారిన పడ్డాడు—ఈ విధంగా బజారు ఆలోచించి వుంటాడు.

"... బజారూ! మనిద్దరి బాంధవ్యమూ యముడిలాంటి పామును చంపింది. బాగా పూర్వ తరాలకంటాపోతే, మన అందరికీ తల్లీ తండ్రీ ఒక్క దంపతులే అయివుంటారు. తర్వాత కుటుంబం వృద్ధి అయి, ఇలా చీలి వెదజల్లబడ్డాము. మనమంతా మనుష్యులం. మన జాత్యభివృద్ధికీ, మన ప్రపంచ కుటుంబాభివృద్ధికీ,—ప్రపంచాన్ని ప్రాంతాలుగా విభజించుకునో, దేశాలుగా ఏర్పరుచుకునో, వ్యతిరేక శక్తులమీద పోరాటం సాగిస్తూ వచ్చాం. ఇప్పుడు మనం 'చావు' ను ఎదుర్కొన్నట్టు, మనుష్యుల పేదరికం, స్వార్థం, అసూయలు, స్పర్ధలూ, రూపుమాపాలంటే—అందర్నీ ఒక మంచిదారిలో నడిపించాలి....వారేయ్ బజారూ, మనం ఒక చిన్న కాలవలాంటి దాన్ని కొత్త నేలలో తవ్వి, నీరు వదుల్తాం అనుకో. అది మొదటిసారి పారేటప్పుడు సరిగ్గా పోదు. నీటి ఉరవడికి తట్టుకోలేక, గట్లు తెగిపోతాయి. నీరు పల్లంలో వురుకుతుంది. ఎత్తువస్తే ఆగిపోతుంది. ఆ నీటిని మనం కట్టుదిట్టంగా ఒక కాలవలో ప్రవహింపజేస్తే, తర్వాత పారుదల బాగుంటుంది. మనుష్యుల్ని మనం, ఒక కాలువ చేసి, ఆ వాలువెంట నడిపించాలి, వాళ్ళలో అహాలూ, స్పర్థలూ చచ్చేట్టూ, మూర్ఖత్వం నశించేట్టూ, తమ మంచిని తాము తెలుసుకునేట్టూ చెయ్యాలి. ముందు మనం తగినంత జాగ్రత్త తీసుకుని, ఫలితం దృష్ట్యా. అవసరమయితే కర్రపెత్తనం చెయ్యాలి, ఆ తర్వాత అలవాటుపడి వాళ్ళే దారికి వస్తారు...లేదూ, సరియైన దారికి కాలవను మళ్ళించి, పని గట్టుకుని మనం నీటిని పారించడమే...."

"యేమోనండీ! ఇదంతా నా కర్థంకాదు. మీరేదో అందరి మంచికే చేస్తున్నారని నాకు తెలుసు. కాని గడ్డిపెట్టి తోలితే వచ్చాను.

నాకు మీరంటే ఎప్పుడూ అయిష్టం లేదు. మీరు చెప్పేదేమిటో గావి. ఏదన్నా సెయ్యమంటే సేసి వెడతాను." అన్నాడు.

అప్పుడు, మరో పక్కనుంచి బుస్కయ్య మరో కర్రతో వచ్చాడు సడి లేకుండా.

"నువ్వు ఇక్కడే వున్నావా?" అని అడిగాడు బజారు.

"నీ అడుగులో అడుగేసుకుంటూనే వచ్చాను." అన్నాడు బుస్కయ్య.

"అయితే ఇంక ఈ ధర్మరాజుమీద సెయ్యెయ్యగలిగినోడు లేడన్నమాట నీ పరిపాలన బాగుండాల దొరా." అన్నాడు బజారు.

ఆ బజారును రాఘవులు తను మొదలుపెట్టిన. ఫలవంత మౌతున్న సమష్టి సేద్యంమీద అజమాయిషీకి పెట్టుకున్నాడు. ఎనభై ఆరుగుర్ని నాలుగు కమిటీలుగా చేసి; మూడువందల ఎకరాల అడవిని పది నూతులతో వింపి; రకరకాల పంటలు పండించే కార్యక్రమానికి బజారు తనను రాత్రింబవళ్ళు అంకితం చేస్తున్నాడు. మనిషి కొండల్ని పిండి కొడతాడు, తలుచుకుంటే—అని నిరూపించాడు బజారు. జిల్లాలో అన్ని సంతల్లోనూ, జిల్లా బయట పెద్దసంతల్లోనూ ఈ సేద్యానికి సంబంధించిన సరకులను పంపిణీ చేసే కొట్లున్నాయి. ఈ సేద్యంనుంచి వచ్చిన సరుకంటే. ప్రజవిపరీతంగా కొంటోంది. ఇంకేంకావాలిట? తను నిర్వహిస్తున్న దానికి - తగిన ఫలం! ఇప్పటి వరకూ ఈ చేస్తున్న మూడువందల ఎకరాల మీదికీ గోపాలరావు గారు కాలు దువ్వరాలేదు. కాలు దువ్వేలా లేదు. ఇది 'సమష్టి వవ్యసాయ కేంద్రం'గా ఇలా వుండి పోయేలా వుంది. ఇంకా కొన్ని ఇటువంటి కేంద్రాలు ప్రారంభించే ఉద్దేశంలో వున్నారు అంతా. సాధిస్తున్న వ్యవసాయాభివృద్ధిని స్వయంగా చూస్తున్నారు వాళ్ళు. బజారు కృషి చాలా వుంది. బజారుకి చదువులేక పోతేనేం? మను షుల్ని కూడగట్టుకుని పని చేయగలవాడు! ఎంత మందినో పోషిస్తు న్నాడు. కాని, తను ఎటువంటి పేదరికంలో వుంటూ ఇవాళ ఇంత వాడయ్యాడో - ఆ సంగతి మర్చిపోడు. ఆ పేదరికం అందరి విషయంలోనూ అడుగంటాలన్నది అతని దీక్ష...బజారు, ఆ రోజా.

తనంటే కన్నెర్రగా వున్న వ్యక్తులెవరెవరో చెప్పాడు, తనని

వాళ్ళనుంచి రక్షించాడు. తనమీద విశ్వాసం పెంచుకున్నాడు.... ఏదైనా కొత్తగా ప్రారంభించిన వాడిమీదా. ఏదో వంకని విరుచుకుపడే వాళ్ళు వుంటూనే వుంటారు. కొత్తను సరిగా చర్చించుకోలేని. బద్ధకం నిండిన బలవంతులైన మూర్ఖులు, వైతాళికుల్ని నాశనం చేసేందుకు బహువిధ ప్రయత్నాలు చేస్తూనే వుంటారు. సోక్రటీసును ఏథెన్సు వాళ్ళు అలానే చంపారు...యువకుల్ని వివేకవంతుల్ని చేస్తున్నాడని పేద ప్రజల ఔన్నత్యాన్నీ, ఆత్మ విమర్శన జ్ఞానాన్ని ప్రచారం చేసిన క్రీస్తును జూడాస్ అనే వాడూ అలానే మోసగించాడు. ప్రపంచాన్నంతటినీ ఒక్క పలుకుబడి కిందికి తెద్దామనుకున్న అలెగ్జాండరును, అరిస్టోటల్ కూడా అలా సహించలేని తనం చేతనే చంపించాడు. ప్రపంచ సంస్కృతినంతా ఏకం చేద్దామనీ, ప్రపంచ సామ్రాజ్య ప్రతిష్టచేసి భావి తరాల కందివ్వాలనీ కలలు గన్న సీజరును కాషియస్ అనే వాడూ, అబ్రహాము లింకన్‌నీ గాంధీని, కెన్నెడీని...కొత్త సంగతులు బోధిస్తున్నారనీ, ప్రజాభ్యుదయానికి నాంది వేస్తున్నారనీ—చంపేశారు. తనను చంపాలని వీళ్ళెందు కింత తంటాలు పడుతున్నారు! తను చస్తే మాత్రం మరోడు ఇదే ఆశయాలతో బయల్దేరడా? ప్రజాస్వామ్యంలో ప్రజలకు సహన భావం ఎక్కువగా కావాలి....ఎలాగయినా తను ప్రజాస్వామ్యాన్ని 'డాలు'గా మాత్రం వుపయోగించుకుంటున్నాడు—అభివృద్ధి నిరోధకుల్ని సమూలంగా నాశనం చేసేయత్నంలో తను నాటిన అభ్యుదయం మొక్క బ్రతికి, చిగుళ్లెత్తుతూ వుంది. ఎంతో మంది 'బజార్లు' తన మాటకు కట్టుబడి వుంటున్నారు...బజారు బాగా విజయతీ అలవర్చుకున్నాడు. ఒకవేళ అవసరం వచ్చి. అతని చావు దేశానికీ, సమాజానికీ వుపయోగ పడేటట్టయితే, తల పగులగొట్టుకో డానికి సిద్ధంగా వున్న వాడిలా తనకి కనిపిస్తాడు. అటువంటి వాళ్ళే తనకి కావాల్సింది. తను వాళ్ళను సమ్మోహనశక్తిచేత ఆకర్షించడం కాదు, వాళ్ళకి తనమీద విశ్వాసాన్ని కుదర్చాలి, తన భార్యకీ, తన పిల్లలకీ తన రక్త బంధువులకీ తను ఎంతో, వాళ్ళకీ అంత అవాలి. వాళ్ళ తప్పుల్ని కొన్ని క్షమించ గలగాలి. తన ప్రవర్తన కూడాఅతీతి మైనదిగా వుండాలి....తనంతటి వాడు ఈ దున్నపోతును వూబిలోంచి

తీస్తూంటే, ప్రపంచం ఏమనుకుంటుంది? ఒక నాగరికమైన, ఐశ్వర్య వంతమైన పట్టణాన్ని తగలబెట్టి ఆ ప్రజల ఏడ్పులూ, పెడబొబ్బలూ వింటూ, ఫిడేలు వాయించుకుంటూ, కన్నీళ్ళను గాజు పాత్రలోకి వొలికించు చక్రవర్తి సామ్యం కాదు గదా! ఒక మహా చక్రవర్తి భీభత్సంగా వున్న యుద్ధభూమి మధ్యన కూరుచుని, ఆచారం కొద్దీ, జపం చేసుకునే వాడట! తను మానవత్వం అంటూ, ప్రజాభ్యుదయం, ప్రపంచ శ్రేయస్సు అంటూ, అలా....తనకి ఎంత తోస్తే అంత ఆలోచన లేకుండా, చేయడం లేదుగదా! ఇదే వొక పేద వాడయితే, ఈ దున్నపోతును కష్టంలో వున్న ఒక జీవి అని కాకుండా ఆస్తిగా చూసుకుని నూట యాభై రూపాయలయినా చేస్తుం దన్న ఉద్దేశంతో బయటికి లాగేవాడు—అది స్వార్థం మాత్రమే. ఈ జంతువు పడే కష్టంతో పనిలేదు. (—ఇప్పుడు నడుస్తున్న పరి పాలనా పద్ధతిలో తనకిదే కనిపిస్తుంది. ఏదో కొంత తమకు లభించా లనుకునే వ్యక్తుల దృష్టి) ఇది మూలుగుతోంటే అతనికి వినిపించదు. చస్తే, దాన్నికోసి, తోలు అమ్ముకుని సంతృప్తి పడతాడు. ఎలాగో లాగు దానివల్ల అతగాడికి కొంత లభించాలి. తనయినా, ఒకవేళ పేద వాడు అయావున్నట్టయితే, అలాగే చేసేవాడేమో కాని, తన తండ్రి తనకి నిలబడడానికి ఒక డబ్బు వేదికా, సాంఘిక స్థానమూ యిచ్చాడు. దానిమీద నిలబడి, కొత్తరకం జ్యోతిని తయారుచేసి, వెలిగించి, చీకటిలో ఊబిలోలాగ ఉమ్మడిగా కొట్టుకుంటున్న మతిలేని ప్రజానీ కాన్ని తను వెంబడెట్టుకుని,నడిపిస్తానంటున్నాడు. అరుస్తున్నాడు.తాను నిలబడ్డ ఎత్తయిన వేదిక, వాళ్ళని ఆకర్షిస్తోంది. తను లెక్కలోకి వచ్చాడు. అదే....తన తండ్రి డబ్బున్న వాడుకాకపోతాడు. తనింత కార్యక్రమాన్ని తయారు చెయ్యలేడు ప్రజాస్వామ్యంలో, దేశమంతా ప్రజలదే....అందరి ప్రజలదీ....ఎప్పుడు? పరాయి వాళ్లూ, తరతరాలూ కొందర్ని పర్వతాలుగానూ, కొందర్ని లోయలుగానూ తయారు చేసిన తర్వాతనా? అలాగే వుంటుంది ప్రజాస్వామ్యం అని సమర్థించాల్సి వస్తే, అది—డబున్న వాళ్ళకి మద్దత్తు ఇస్తున్నట్టే. ప్రజాప్రభుత్వం ఆత్మస్థైర్యాన్ని కోల్పోయి, డబ్బుగలవాళ్ళ ముందు చేతులు నలిపి

వట్టే. ఇండియా మతాలకి ఎట్లా అతీతమో. కాంగ్రెసు అనే చరిత గలిగిన పార్టీ, సిద్ధాంతాలికట్లా అతీతం. ఇండియాలో నివసించే వాళ్ళు హిందువులు_వీళ్ళు కొన్ని ఆచారాల్ని ఏర్పాటు చేసుకున్నారు అంతే. ఆచార సంపన్నులు, సంకుచిత విషయాల్నుంచి తప్పుకున్న వాళ్ళు-నిసలైన హిందువులు. ఆ విధంగానే కాంగ్రెసు అనేది కూడా, అది ప్రజలకి మేలు చెయ్యడానికి పుట్టింది. పరాయి వాళ్ళని పారదోలేందుకు స్వాతంత్ర్యోద్యమం సాగించి అనేక ప్రాణాలు బలి ఇచ్చి.దశాబ్దాల తర్వాత దేశాన్ని పరాయివారి చేతుల్లోంచి, బయటకు నెట్టుకొచ్చింది. కాని, ఆ తర్వాత అదే ప్రజల బాగుకోసం తగి నంతగా పాటుబడలేక పోతోంది. అలసి పోతోంది. అందులో అన్ని పార్టీల సిద్ధాంతాలూ వున్నాయి. అందర్నీ తృప్తి పరిచేది. సీసాపైన లేనె అని రాసివుంది. సీసాలో మాత్రం నీళ్ళు నింపివున్నాయి.అన్ని రకాల పార్టీ జావాలూ అందులో చేరాయి. ఆ కాంగ్రెసు అనేది తనకి అభిమాన పాత్ర, తనదే. అది ఇండియలాగా. అంతరిదీ. కాని, అది సామ్యవాదాన్ని తన లక్ష్యంగా పెట్టుకున్నా. బద్ధకస్థుల, భయ స్థుల చేతుల్లో పడిపోయింది. యువతరం చేతుల్లోకి సారథ్యం రాక పోవడం ఒక కారణం కావొచ్చు. దాని ఆశయాలు త్వరత్వరగా విచ్చు కోవడం లేదు. అయినా తనకవన్నీ అనవసరం...

—అతనికి ఏదో పాకటి పాడాలనిపించింది. నోటికొచ్చిన పాట. పాటపాడితే శ్రమమర్చి పోగలననిపించింది. ఊబి చేతుల నిండుగా వస్తోంది ..

పదిమంది కలిశారు
పని కలిపి చేశారు
పదిమంది పాటతో
పదిమంది పాటు
పడి నలిగి
పని జరిగి
పగిలింది నిప్పచ్చరం
అరిగింది....
అణిగింది....

హేయ్--హేయ్—

హోయ్-హోయ్ హోయ్ ...

ఇంకో అరుగజాల వూబి కనబడుతోంది ముందు. గొలిగి కంప. బడితెలకు రెండువేపులా గుట్టలుగా పడివుంది. నరిపోతుంది కంప. ఊబిగుట్టలుగా పోగవుతోంది రెండు పక్కలా. తన భుజాల్లో నొప్పిగా వుంది. చేతి కదియం కదలడం లేదు. ఊబి మట్టితో చేతి కంటుకుపోయింది.

....జడత్వంలో దిగబడిపోయిన విస్పహాయమైన ప్రజని బయటకితియ్యడానికి తానెంత శ్రమపడుతున్నాదో.వాళ్ళనిగుర్తుకు తెచ్చే ఈ దున్నపోతును వూబినుంచి బయటికి లాగడానికి అసహాయశూరుడై-తీగలూ, బడితెలూ, కొడవళ్లూ చెబూని అంత శ్రమపడుతున్నాడు.

ఆతను మట్టవిలాగేస్తూ వొంగుతున్నాడు. మధ్యమధ్య ఎంత గుట్టపడుతోందో చూసుకుంటున్నాడు. పని వడివడిగా జరుగుతోంది. గొయ్యిలో తవుతోంది. ఎండ పేల్చేస్తోంది. తలమాడ్చేస్తూంది. కళ్ళు చల్లగా అవుతున్నాయి. వొగర్పు వస్తూంది. ఆలోచనలు అలజడిపడుతున్నాయి. మోకాళ్ళు తీపు లెక్కుతున్నాయి.

....ఛీ....ఛీ....ఛీ. ఇది మూర్ఖాల్ని మార్చుకుతున్న దేశంకాక పోయింది. ఇది ఇండియా! బొజ్జలు పెంచుక్కూరుచుని, పరాయి వాళ్ళమీద ఆధారపడి బ్రతకాలని చూసే ప్రజల స్థావరం...దీన్ని మారుస్తాను. వీళ్ళందరి బొజ్జలూ కరిగిస్తాను. వీళ్ళ గంజాయి కళ్ళ మైకం వదిలిస్తాను. వీళ్ళు తొడుక్కుంటున్న దొంగ కమీజుల్నించి. వీళ్ళ శరీర దార్ఢ్యం వీళ్ళకు చూపించి. వీళ్ళతలల్ని ఆపరేట్ చేస్తాను.........ఈ వర్తమానకాల సమూహాల్లో జీవమేలేదు. అందుకు ముందు ప్రాణవాయువు నూదాలి. ఈ అర్థంలేని భయాల్నించి తప్పుకునేలాగా ప్రజాస్వామ్యాన్ని గురించి పాఠాలు చెప్పాలి. అప్పుడు.....ఈ ప్రోజక్టులంటే, పంచాయతీలంటే. వోటంటే.....విడమర్చి చెప్పాలి....వివేకవంతుల్ని చెయ్యాలి. ఎడ్యుకేట్ చెయ్యాలి. అంటే అక్షర జ్ఞానం కలిగించాలి, తపనను నేర్పాలి... లక్ష్యం చూపాలి.

....ఎన్నో ఏళ్ళు ముందుకు నడచిన రాజ్యాంగాల వాళ్ళలాగా.

మనమూ వాళ్ళతో సమానంగా నడవాలంటే. మన పల్లెటూళ్ళు నడవాలంటే,—కష్టం. వాళ్ళలో తగినంత చదువూ. వివేచనా వుంది. అవసరం కలిగినప్పుడు ప్రణాళికల్ని తయారు చేసుకున్నారు. కాని. ఏ చైతన్యమూ లేకుండా. రాళ్ళుపడి నలిగివున్న వాళ్ళను. జబ్బలు పట్టి పైకిలేపి. చేతులో ఒక కాగితం ముక్క పెట్టి. ఆ చేతిని పట్టుకుని నడిపించి. ఆ కాగితాన్ని వోటు డబ్బాలో వేయించుకుని. పూలదండ వేసుకుని. 'అహ్హాహ్హా అని నవ్వితే. నలిగి నిలబడలేని ప్రజ 'ఇహ్హిహ్హీ' అంది. ఇంకా పూలదండలు వేసుకోవాలనుకున్న వాళ్ళు మరో పక్కకి చేరి—నలిగిపడి వున్న ప్రజకి; నిలబడలేక తూలిపడి. పైకిలేచి. అవస్థ పడుతున్న ప్రజకి,—చెవుల్లో. ఆ కాగితం మాకివ్వండోయ్. మీకు డబ్బు ఇస్తామోయ్ అన్నారు. మేము ఇస్తామోయ్ అన్నారు వీళ్ళు. రోజయినా గడుస్తుంది—ఎవరిచ్చినా తీసుకుంటాం—ఇదిగో కాగితం అన్నారు ప్రజ...

...దౌర్భాగ్యుల్లారా! నికృష్టజీవుల్లారా! వాళ్ళవంక చూడకండి. మీ కడుపు కాలుతోంది. మీ సంపాదన మీకు చాలిపోదు. ఇవాళ గడిచిపోవడం చూసుకోకండి. రేపును గురించి ఆలోచించండి. పుట్టబోయే వాళ్ళు ఆకలితో అలమటించి, ఎండి. వారుగై నశించిపోయే ఆ రోజుల్ని గురించి ఆలోచించండి. పోయి. కష్టపడి పని చేసుకోండి. ఈ పూలరంగళ్ళంతా మీరు కావాలని మీ చుట్టూ తిరుగుతారు. మీ కాళ్ళ పడతారు. మీకు వొక్కడు తిండి పెట్టాడా? పూలదండలు వేసుకున్న వాళ్ళ పొట్టలు చూడండి. వాళ్ళ కబుర్లు వినండి. అయినా వాళ్ళెవళ్ళు మీకు తిండి పెట్టేందుకు? వాళ్ళసొంత ధనం వెచ్చించి నడిపే ప్రభుత్వ వ్యవస్థయేమీకాదిది.... మన అందరి సొమ్ముకీ 'ట్రస్టీ'ల్లాగా వాళ్ళు...కార్యకర్తలుగా. అందుకని వాళ్ళ ఎవ్వాళ్ళ ముఖాలూ చూడకండి. ఒక్కణ్ణీ వాడి వేషాన్ని చూసి. వాడి వినాదాలువిని నమ్మకండి. వాడిలో మంచితనం. వాడిలో నిజాయతీ కనిపిస్తే. వాణ్ణి మీనెత్తిమీద కెక్కించుకోండి. వాడిని ఏమీ కోరకండి వాడి నిజాయతీయే వాడిచేత చేయిస్తుంది. మీ కోసం మీరు ఎప్పుడూ. ఏ పరిస్థితుల్లోనూ కష్టపడాల్సిందే (తండ్రికూడా కొడుకుకి సంపాదన లేకపోతే మనిషిగా చూడడు) కష్టపడండి. కష్టపడి అనుభవించడం

జీవితం. జాతిప్రగతి కోసం మీ పూలదండలు వేసుకున్న వాడు, నడుం కట్టి ప్రకృతితో పోరాడతాడు. మీ సహాయంకోరి. మీతో కలిసి నడుం కడతాడు...

"హమ్మయ్య" అన్నాడు రాఘవులు లేచినిలబడి. అతను లేస్తూంటే వెన్నుపాము పటపట మంది. ఎక్కువసేపు వంగి వుండడం మూలానపట్టుబట్టి వుంది.నిలబడి వొళ్ళు సాగదీసుకున్నాడతను. తలని ఆకాశానికెత్తి మెడను సాచుకున్నాడు తర్వాత. భుజాల్ని కదలించి మళ్ళీ వంగి పనిలోకి దిగాడు.

"నా కొడుకుల్లో వొకణ్ణి మిలటరీకి పంపించాలి." అను కున్నాడు. అలా అయితే, తను ఒకడి బాధ్యతను వదిలించుకున్నట్టు అవుతుంది. తను వున్నవాడు కనక సైనిక పాఠశాలకి పంపించ గలడు. ఇది అన్యాయం. ప్రభుత్వం దృష్టిలో ఈ చదువులు హోదా తోనూ, అంతస్తుతోనూ ముడిపెట్ట బడరాదు. విద్యావిధానాన్ని పూర్తిగా ప్రభుత్వం నిర్వహించాలి. అందరి పిల్లల బాగోగుల్నీ చూడ గలగాలి! మిగిలిన ఇద్దర్నీ తనలా తయారుచేయ్యాలి. పోనీఅందులో వొకడు జర్నలిస్టు అవుతాడు. ఒకణ్ణి మాత్రం తనలాచేయాలి.

"ఇటువంటి పనిలో పెడితే బాగుండును, పెదబాబును" అనుకున్నాడు. పెద్దకొడుకును తలుచుకుంటూ. ముఖంమీంచి చెమట బొట్లు బొట్లుగా కారుతోంది. దండచేత్తో తుడుచుకున్నాడు. కనురెప్పల మీదికివచ్చి, కళ్ళలోకి దిగుతోంది చెమట.

"ఇలా వుండాలి పని అంటే"అనుకున్నాడు. ఇటువంటప్పుడు బజారు వుంటే బాగుండుననిపించింది. వాడూ పనివాడే. బజారు ఆజానుబాహుత్వం జ్ఞాపకం వచ్చింది. వాడు తనని చంపి వుంటే- తనకీ పనులన్నీ వుండక పోయేవి. ఈ దున్నపోతు చచ్చిపోనేమో! దీనిని గురించి ప్రపంచానికి ఏమీ తెలియకపోను. వాడు చంపాలను కుంటే, ఒక్క దెబ్బతోనే తన ప్రాణం పోయేది—మెదడు చితికేది. తన మెదడులో తను ఎన్ని దాచివుంచాడు! ఎంత అభివృద్ధి రికార్డు దాచాడక్కడ! ఎన్నిరకాల మన స్తత్వాల్నో అందులో అరలు అరలుగా పేర్చాడు. అవన్నీ పోయేవి వుపయోగం లేకుండా...తన పిల్లలూ భార్యా! వాళ్ళకోసం కాదా? ఆ సంసారం సుఖం కోసమే

గదా ఈ బాధలు! ఇంకా....మిగిలిన వాళ్ళని అభివృద్ధి చేద్దామనే ధ్యాసకూడా. తను అభివృద్ధి పొందితే ప్రయోజనం లేదు...మిగిలిన వాళ్ళూ అభివృద్ధి పొందితేనే తనకు సుఖం....

అతను కొంచెం వెనక్కి నడిచాడు. పూబివిలాగిన చోట్లోనే కాలికింద గట్టిగా తగుల్తోంటే. బాగా వంగి. చేతితో పూబిలో కెలికాడు. పూబి అడుగున విస్తరించుకున్న పెద్దరాయిలా తగిలింది— తడుముతోంటే. దున్నపోతు సునాయాసంగా బయటికి రావొచ్చుననే ధైర్యం చోటు చేసుకుంది మనస్సులో. అది గడ్డి పరకల్ని నములుతున్న చప్పుడు వినిపిస్తోంది. వెనక్కి చూశాడు. తను తెచ్చిన చిన్న మోపులో సగం గడ్డిని తిన్నది దున్నపోతు. అతనికి దాన్ని చూస్తూంటే. ఆనందం. ఆశ్చర్యం కలిగి కళ్ళలోకి నీళ్ళు వచ్చాయి. అతను నిలబడి దండచేత్తోనూ. భుజంతోనూ కంటిచుట్టూ చెమటను కంటిపీటినీ తుడుచుకున్నాడు. చెమట వుప్పదనానికి కన్ను గరగర లాడుతోంది.ముక్కును ఎగజీదుకున్నాడు. పూటబండమీద ఎక్కువగా చెమరుస్తున్నట్టు—అతని ఒంటిమీద చెమట మొలచుట్టూ నొప్పిగా వుంది.పంచె బిగదీసికట్టిన మూలాన పొత్తి కడుపుమీందిజారుతున్న చెమట పంచెను బాగా తడిపింది. దున్నపోతుకి మరోసారి నీళ్ళు పెడితే బాగుండుననిపించింది. తనకీ విశ్రాంతి కావాలనిపించింది.

అతను చేతులు దులుపుకుని. తను తీసినవాలు వెంట దున్నపోతు వెనక్కి నడిచాడు. చితచితలాడుతోంది—వాలు. ఒక్కో అడుగు మరీ మోకాలు లోతుకు దిగబడుతోంది. కాని. అడుగున రేగడిమట్టి తగులుతోంది. కాలు లాక్కోడానికి రేగడిమట్టిమీద వీలు చిక్కుతుంది....అది తాటాకు దొన్నెని పక్కకి నెట్టింది. దాన్నిండా వొక్కసారి నీళ్ళు తెచ్చేస్తే చాలుననిపించింది అతనికి. దున్నపోతు మీద చెయ్యి ఆనడానికి అతనిక భయం వేసింది. ఏ మాత్రం బరువానివా అది ఇంకా లోపలికంటా దిగబడి పోతుందేమోని దానిమీది కండువాను లాగేసుకున్నాడు. రొచ్చు వాసన మరింత ఎక్కువగా వేసింది. తెముల్చుకుని పూశాడు రాఘవులు.

....అతను దానికి ఎడమవేపు పక్కగా ముందుకు కాలు వేశాడు. తాటాకుదొన్నెను ఒక చేత్తో అందుకుని. మరోచేత్తో గడ్డిని

పొందికగా దానిముట్టెదగ్గరికి తోశాడు. అది గుర్రు-మంది... 'అమ్మా' అన్నట్టు శ్వాసగట్టిగా, బరువుగా, బాధగా, పీలుస్తోంది. గడ్డి నమిలిన వాసన. పాచివాసన. అతను పట్టించుకోవడం లేదు... జారి పడడంలేదు...కర్తవ్యాన్ని పాటిస్తున్న ధోరణిలో కాలును లాక్కున్నాడు—తాటాకు దొన్నెను వెనక్కి తీసుకొచ్చేందుకు కదులుతూనే. కాలును లాగుకునేందుకూ, ఏలకడకీ కాలుకింద పట్టే దొరకడంలేదు గుంజుకునేందుకయినా. ఏదో అనుమానం కలుగుతోంది పరిస్థితే మారిపోతోంది. కంగారు పుడుతోంది కాలు పట్టు దొరక్క...దిగిపోతోంది. ఇంకా కిందికి...గిజగిజ లాడాడు. చేతుల్లో రాఘవుల కాళ్ళున్న వాడిలాగా పాకుడుమీద బ్యాలెన్సు కాపాడుకోలేకుండా జారిపోతున్నవాడిలా. మొల లోతుకు వెళ్ళిపోతోంది. నెమ్మది నెమ్మదిగా ఇంకా వెళ్ళిపోతుంది...ఏది పట్టుకోవడానికీ దగ్గర్లో లేదు... తను ముందు వేసిన అడుగుల్లో కాక, కొంచెం పక్కగా కాలు వేశాడు... దిగబడి పోతోంది.... అతనికి తన నిస్సహాయస్థితి తెలిసిపోయింది. అతనితో ప్రతిస్పందన అరుస్తోంది—మూలుగుతున్నలాగా-పెద్దగా—దిగబడి పోతోంది. బాగా నెమ్మదిగా అట్టడుగుకంటా వెళ్ళిపోయేలా వున్నాడు తను. దగ్గర్లో అందుకోడానికి ఏమీ లేదు....అతను చేతిలో దొన్నెను పారవేసి, హఠాత్తుగా తట్టిన ఆలోచనతో, దున్నపోతు ముందువేపు కాలిమీదికి ఎగబడి, దాన్ని పట్టుకున్నాడు. దున్నపోతూ తనూ వూబిలోకి ఎక్కడికో దిగబడి పోతారు—అజలేకుండా పొద్దుగూకుతుంది. పొద్దు పొడుస్తుంది, తమ రహస్య సమాధిని పొందుతారు. చావు ఎంతలో చుట్ట మట్టేసింది. అది విసిరిన వలలో దున్నపోతుతోపాటు తనూ చిక్కుపడి పోయాడు. తన అసామాన్య జీవితం అంతమవుతోంది-ప్రకృతి జయిస్తోంది.

....దున్నపోతు కాలి మడమలో వున్న చర్మం దొరికింది. చేతుల బలమంతా దాని మీదే. దున్నపోతుకి నొప్పి కలుగుతోంది. అది గుర్రుమంటోంది. గడ్డి తినడం మాని, కంగారు పడుతూ చూస్తోంది. ఇంక ఎటూ గత్యంతరం లేదు. తను వూబిలోకి జారిపోతున్నాడు. దున్నపోతు కూడా పట్టు సడలి, దిగబడిపోతూందేమో! తన ఆశయాలు! తన సిద్ధాంతాలు! తను చేసిన పనులు! తను నిర్మించిన

నిర్మాణాలు! ఎంతటివి!! అన్నీ!!! ఇంక తను చూడలేదు వీటివి... వీటి ఫలితం. తను దిగబడి పోతున్నాడు వూబిలోకి. తను లోపలి కంటా పోయిన తర్వాత వూబి పైన మూసుకు పోతుంది. తను సజీవ సమాధి. ఇందులో తన అస్థిపంజరం....ఇలా ఎన్ని చచ్చి పోయాయో! అన్ని ఎముకలతోపాటు తన ఎముకలూ! దున్నపోతూ తనూ ఒకే రకం చావు....కోరి తెచ్చుకున్న చావు. దున్నపోతును రేపు తియ్యాల్సింది....ఇంక ఇటెవ్వరూ ఇవాళ్టికి రారు....ఇంక రారు...

అతను గింజుకుంటున్నాడు పైకి వచ్చేందుకు.

....తన భార్య, తన పిల్లలు. తను చేస్తున్న అభివృద్ధి పనులు తనంతటివాడు, వూబిలో చిక్కడిపోయి, దిగబడిపోతున్నాడు రాఘవయ్య! తన జీవితం ఇంతటితో అంతం. తనంత తాను వచ్చి, చిక్కవడి చచ్చిపోతున్నాడు.... విచిత్రమయిన చావు. తెలుస్తూ తెలుస్తూ చచ్చిపోవడం! అయినా....ఏమయినా కానీ. ఈ దున్నపోతు అడుగుకు పోనీ, దీని మీదికి ఎగబాకి,....వాలులోకి గెంతేస్తాను. దీన్ని రక్షించలేను. ఇది చచ్చిపోతే ఇదొక్కటే చచ్చిపోతుంది. ఆతను చచ్చిపోతే చాలా మందికి, అండ వుండదు. జాతి ప్రగతి పాడయిపోతుంది. దున్నపోతుకు సంఘం వుందా, కట్టుబాట్లు వున్నాయా, ఏమయినానా? ఇది చావడానికే నిర్ణయింప బడిందేమో!

అతను గిల గిలా కొట్టుకున్నాడు చేతుల్ని. చచ్చిపోతున్న దేగ విల విలా రెక్కలు కొట్టుకుంటున్నట్టు. తల నరకబడ్డ ప్రాణం పోకడలాగా. కాని, ఇలా కిందికి నడుం దిగబడి పోయినట్టూ, ఇంకా తన కాళ్ళకు ఏ అడ్డూ ఆడ్డక ఆగిపోయినట్టూ, తనకు, తన మీద తనకు ఆశ పోతున్నట్టూ అనిపించింది. మళ్ళీ చేతుల్ని కొట్టుకున్నాడు. వూపిరి బిగించి పైకి గెంటుకు రావాలని ప్రయత్నం. నీళ్ళలో నుంచి లాగాడు. గట్టిగా వున్న వూబి మట్టిలో నుంచి పెగిలి బైటికి రాలేకపోతున్నాడు అతను.

దున్నపోతు మెడ తిప్పి చూస్తోంది — 'య్' అని అరుస్తోంది. గిలగిలలాడుతున్న, వూబిమీద మరో చేత్తో కొడుతున్న, అతన్ని చూస్తూ, అది తోకను కదిపింది. తోకన వున్న వూబి మట్టి వుండ

బహం చిన్నగా కదిలింది. అతను దాని కాలును వదలడం లేదు. చేతికి పట్టు దొరకడం లేదు. దాని, పొట్ట పై భాగం దొరికితే అతను వూబిలోంచి శరీరాన్ని పైకి లాక్కోవచ్చు—ఎగబాకవచ్చు. అది వూబిలోకి దిగిపోయినా దాని మీది కెక్కి, వాలులోకి దూకేయవచ్చు. అందుకోసం కొంచెం దగ్గరగా తను దగబడిపోతే, కొంత ప్రయో జనం వుండేది. కాని, ఇప్పుడు తనకు గత్యంతరం కనుపించదు. ఎముకలే వోకాలికి తగిలినట్టు అనిపిస్తోంది. సూర్యుడికి మబ్బులెక్కు వగా అడ్డు వచ్చి, చల్లగా వుంది, మధ్యాహ్నం నిశ్శబ్దంగా, చావు లాగా వుంది. అతని గుండె దబ దబా కొట్టుకుంది. బయటకు తన శరీరాన్ని వూడబెరుక్కోవాలని, మనస్సు తప తపా కొట్టుకుంది. సమితి....అస్పత్రి.... స్కూలు....బ్యాంకు ....కమిటీలు.... ఆహార సమస్యావారం... వనమహోత్సవం....భార్య ...పిల్లలు—జ్ఞాపకం వచ్చారు. దున్నపోతును పట్టుకున్న చెయ్యి తిమ్మిరెక్కిపోయింది.... దున్నపోతు అరుస్తోంది. దానికి భయమో, తనని ఈ స్థితిలో చూసి జాలో! లేక తనని రక్షించబోయి, ఇలా ఆపదల పాలయ్యానని విచారమో:....దానికి జాలేమిటి? అది దున్నపోతు....తన చేతిపట్టు వల్ల బాగా నొప్పి కలిగి అరుస్తోందంతే...తనకి చావు తథ్యం.

అతను మరో చేతిని కూడా దున్నపోతు కాలికి చుట్టాడు. దున్నపోతు కాలి చుట్టూ మట్టి తీసి, వీలు చేసుకుని, సన్నగా వున్న చోట వూబిలో గరుకెక్కిన దాని కాలును గట్టిగా పట్టుకుని, తనని ముందుకు గుంజుకున్నాడు. తనని నడుము పైకంటా, బొడ్డువరకూ వూబి చుట్టుకుంది. తను బయటికి రావడం లేదు. రాలేదేమో! అతని గుండె అవిసింది. తల మీది వెంట్రుకలు నిక్కబొడిచాయి. తలంతా చెమటబట్టి ముఖం మీదికి కారుతోంది. అతని మెదడులో ముడతలు మరింత కుంచించుకున్నాయి. మెదడులోకి, రక్తం వెతుక్కుంటూ వేగంగా ప్రవహించి, కళ్ళనిండా చీకటిని చిమ్ముతోంది. తనకేం కనబడుతోందో తనేమవుతున్నాడో అతనికి తెలియరావడం లేదు. తను దిగబడిపోతున్నాడు....తను పాతాళానికి పోతున్నాడు. ఒక సామాన్య మానవుడిలాగా, ఒక దున్నపోతులాగా, ఒక శక్తి చచ్చిన వాడిలాగా, ఒక దుంగలాగా, అతి సామాన్యంగా తను దిగబడి

పోతున్నాడు. తన స్వతంత్రాభిప్రాయాలు కలిగిన మెదడూ, తన లొంగుబాటు తెలియని శక్తి. తన సిద్ధాంతాలూ, అన్నీ ఒక వూబి గొయ్యిలో శిథిలమయిపోతున్నాయి...ఇంక తను పుడతాడో లేదో... పుట్టినా ఈ ఆశయా లుంటాయో వుండవో! అప్పటికి ప్రపంచం ఎలా వుంటుందో! ప్రధాన మంత్రి కొడుకుగానో, ప్రపంచ నాయకుడి గానో, ధ్రువాల్లోనో. గ్రహాల్లోనో, ఎక్కడో ఎలాగో పుడతాడు తను.

"భగవంతుడా!" అని కెవ్వుమన్నాడతను.

అరిచి, తన చుట్టూ చూసుకున్నాడు. తను దిగబడ్డం లేదు. గాలిలో నిలబడి పోయినట్టు, వూబిలో అలా—ఆగిపోయాడు దిగ బడకుండా. ఆశ్చర్యం!....తను ఆగిపోయాడు. తను ఎంతో లోతుకి పోలేదు. అవస్థపడి, బయటికి వచ్చెయ్యవచ్చు. కాని, దున్నపోతు మీంచి చేతులు తీస్తే ఎక్కడికి పోతాడో తను! తన నిస్సహాయ స్థితిలోనూ, ఆశ చచ్చిపోగానేనూ.....బాగా దిగబడి పోతున్నట్టు అనుకున్నాడు....కాని, దిగబడి పోవడం లేదు లోపలికి. కాళ్ళకి రేపడిలాంటి గట్టి మట్టి తగులుతోంది. తన బరువుకి కొంత ఆగు తోందది—వూబిలా కాకుండా. తను ఎంతో దిగబడలేదు...పరవా లేదు...

అతను మరింత గట్టిగా దున్నపోతు చర్మాన్ని పట్టుకున్నాడు. అది అతని వేపే చూస్తూ నిలబడింది .దాని ముఖంలో ఏ భావమూ లేదు. అతనికి దున్నపోతును కసిదీరా తిట్టాలనిపించింది బూతులతో.

"బయటికి రానియ్యి. నీ కర్మకి నిన్నొదిలి మరీ పోతాను" అన్నాడు కసిగా, పళ్ళు గిట కరిచి. వుప్పుగా గడ్డం మీది చెమట అతనిపై పెదవికి తగిలింది.

అది గుర్రుమంది.

అతను రెండు చేతుల్నీ దాని కాలికి చుట్టి, వూబిలోంచి ఎగర బోయాడు ఆ ప్రయత్నంవల్ల మాత్రం ఫలితం కలగలేదు. ఒకవేళ అక్కడి పట్టును వదిలేస్తే, తన బరువు ఎక్కువై కాళ్ళకిందనున్న మట్టి సందెచ్చి, అడుక్కి వెళ్ళిపోతానేమోనన్న భయం. అలాగని తప్పుకున్నప్పుడు అతని గుండెను మంచు ముక్కల్లో పెట్టినంత

బాధ అనిపించింది శరీరానికి. అతని కళ్ళ నిండా నీరు కమ్ముకుంది. శ్వాస బరువయి పోతోంది. శరీరంలో రక్తం విలవిలా కొట్టుకుంటోంది. నరాల్ని బద్దలుకొడుతుందేమోనన్నంత ఉధృతం.. బెమరు...

"ప్రమీలా!" అని భార్యని తల్చుకున్నాడు.

అతనికి కొడుకులు జ్ఞాపకం వచ్చారు. భార్యా ప్రసవం జ్ఞాపకం వచ్చింది. తను పడ్డ శ్రమలన్నీ తన ఎదుట మెదిలాయి.

పొద్దు తిరిగిన ఎండ వాలుగా నడుస్తోంది. పడమటికి దిగబడి పోతున్న సూర్యుడు. భూమి, తన చుట్టూ తాను తిరుగుతూ, 'తన' చుట్టూ కూడా తిరగడం చూసి, ఉద్రేక పడినట్టు....రోషంగా ఉక్రోషపడినట్టు తూర్పు వేపు నీలి రంగులో కనిపించీ కనిపించ నట్టుగా జెండా గుడ్డమీది పసుప్పచ్చ బొమ్మలాగా, కొత్త సామ్రాజ్యాన్ని సృష్టించే పోకడగా-చంద్రుడు,

"నేను దిగబడిపోతున్నాను" అతని కళ్ళ వెంట నీళ్ళు జల జల రాలాయి. మూడు రోజులబట్టో, అయిదు రోజులనుంచో, ఏకంగా ఏడుస్తూన్న దున్నపోతు జ్ఞాపకానికి వచ్చి, గుండె కదిలింది-కనిపించని కళ్ళతో దున్నపోతును చూశాడు-దున్నపోతు వేపు చూశాడు. దానికి కూడా తన అసహాయతకి వుక్రోషం వచ్చిందనిపించింది. తను ఎలాగయినా బయటికి రావాలనుకున్నాడు. ఏమయినా సరే దున్నపోతును బయటికి లాగాలని మళ్ళీ అనుకున్నాడు. తను దానికన్నా ఎన్నోరెట్లు పరిణామంతో ఎన్నో లక్షల సంవత్సరాలు దాటిన వాడినన్న ధైర్యం....

రాఘవులు మళ్ళీ తన ప్రయత్నం సాగించాడు. అతను పెనుగులాటవల్ల ప్రయోజనం లేక ఆశాభంగం అయింది. అతను శ్వాసను పీల్చుకునేందుకు ఆగాడు. మళ్ళీ వూపిరినంతా ఎగబట్టి, కళ్ళు మూసుకుని, దున్నపోతు కాలిని పట్టుకుని పైకెగ లాక్కున్నాడు శరీరాన్ని.. తను కదిలాడు వూబిలో, అంతే. కాని, బయటికి రావడం లేదు. శ్వాస మరింత గట్టిగా పీల్చడంవల్ల, గుండె పగుల్తుందేమోననిపించింది, గత్యంతరం తోచలేదు. అహం దెబ్బతింటోంది. ఇంకా లోపంకంతా దిగబడి పోతానేమోనని భయం, ఇంక ఇవేళ్టకి ఇటు ఎవరూ రారు. ఈ రాత్రంతా తను ఈ వూబిలో పడివుంటే, తెల్లారిన

తర్వాత ఎవరయినా వస్తే తనని బయటికి లాగుతారు. తన చేతులికీ. నడుముకీ, తాళ్ళు కట్టి—రెండెడ్ల నడుములికి కట్టి బయటికి ఈడుస్తారు. కాని, వాళ్ళు వస్తారో రారో! వాళ్లు వచ్చేసరికి తను బ్రతికి వుంటాడో వుండడో!...

కన్నీటి తెర జారిపోయింది. అతని కంటిలో దున్నపోతు బొమ్మ పడింది. నెమరు వేస్తోంది. దది. దనవంక చూస్తోంది. తన్ను తొందరగా బయటికి తీస్తాడేమోనన్న ఆశ. తీస్తే బావుండునన్న కోరిక ఏదో చేస్తున్నాడు. తనని గురించేనన్న....దృష్టి....

"ఛీ. ఛీ. విశ్వాసం లేని గొడ్డు." అన్నాడు.

తొమ్మిదేళ్ళ మేనల్లుడు పొద్దుట తనతో పొలం వస్తానన్నాడు. వాణ్నయినా తీసుకురావాల్సింది. ఇటు వంటప్పుడు వుపయోగపడే వాడు....రేపు వచ్చి మాత్రం తన్నెవరు తీస్తారు....ఇలా ఎవ్వరూ రారు జీవితం ఎన్ని రకాలయిన బాధల్ని ఎదుర్కొంటూంది ....

....ఎపడో తీస్తాడు—వాడు తనకి బ్రతుకును ప్రసాదించినట్టు. ఇంక తన ముందు జీవితమంతా వాడిపట్ల విశ్వాసంతో గడపాలి. వాడు తనికి ప్రత్యర్ధిగా తన సిద్ధాంతాన్ని అమలు జరుపనున్నా హత్యలు చేసినా, విశ్వాసంతో వాణ్ని కాపాడ్డానికి తను ప్రయత్నించాలి. తనకో వుద్యోగం వేయించి జీవితాన్ని చూపెట్టిన వాడిలాగా తన బ్రతుకును కత్తెర మధ్యనుండి పట్టు విడిపించి. బయటకి లాగిన వాడిలాగా తను వాడిముందు మోకరిల్లాలి.

"నే నెవరికీ తలొంచను." అతను గట్టిగా అన్నాడు. అతనిలో వున్న గర్వం, బాధ. వ్యక్తిత్వం, అన్నీ ఏకమయి. రాకెట్ లాగా దూసుకుని రాబోయాడు....

ముందుకు వూగిన లాడాడు.

....కొంత ముందుకు జరిగానన్న తృప్తితో వూబిని అటూ ఇటూ తోసుకుంటూ. బయటికి నడుచుకొస్తున్నట్టు. దున్నపోతుని పట్టుకుని. పైకి ఎగబాకుతువ్నాడు రాఘవులు. ఇంతా శక్తిని వినియోగించి. ఇంకా ముందుకు. దున్నపోతు ఏమయినా సరే.—ముందు ...తన స్థానం తను సంపాయించుకుని, దాన్ని...లాగాల్సిందే. దున్నపోతు అరుస్తోంది బాధగా. అతను వూబినించి బయట పడాలని

కళ్లకిందుల ప్రయత్నం...అరవనివ్వ్య.... అతను లాక్కుంటు న్నాడు శరీరాన్ని. చుట్టూవున్న వాతావరణాన్ని ఛేదించి బయట పడు తున్నట్టు. గుడ్డును పగలకొట్టి, పక్షికూన. శరీరాన్ని బయట పడేసు కుంటున్నట్టు, మొసలి గులకరాళ్ళమీద నడిచినట్టు, కాళ్ళు విరిగిన జంతువు నడుస్తున్నట్టు. అజ్ఞానంలోంచి, చీకటిలోంచి, గుహలోంచి, భూమిలోంచి, విడివడి, వేరు చేసుకుని, మనిషి తనకు తానుగా బయట పడుతున్నట్టు. తల్లి గర్భంలోనుంచి ప్రయత్న పూర్వకంగా ప్రపంచం మీదికి రద్దీపడి వస్తున్నట్టు, కుడితిలో పడ్డ ఎలుకలాగా. తేనెలో పడ్డ ఈగలాగా, ఆకుల మధ్య దట్టంగా చిక్కడిపోయిన చిన్న తుమ్మెదలాగా

అతను ఎగ బాకుతున్నాడు దున్నపోతు మీదికి. అది అరు స్తోంది బాధగా. కాని సహిస్తోంది. దానికీ అర్థమవుతోంది, అదంతా అతని అవస్థ అన్నట్టు. దాని పొట్ట ఎముకలు;....పక్క ఎముకలు; వల్లటి, రొచ్చు వాసన వేస్తున్న వెంట్రుకలతో వున్న పెళుసెక్కిన తోలూ...దానిమీదినుంచి, పైకి...జారిపోకుండా...ఇంకా పైకి.... ఇంకా దున్నపోతు అరుస్తోంది తలనెత్తి...గట్టిగా అరుస్తోంది...దాని శరీరం వెచ్చగా....ఆడదాని వొళ్ళులాగా....గడ్డి కట్టలోపల వుక్క లాగా...వెచ్చబడి పారుతున్న నీళ్ళలాగా...చేయి నొప్పి పెడు తోంది....పాడువాసన....

రాఘవులు దున్నపోతు మీదికి తలను వాల్చాడు. దానిమీద తన శరీరం బరువంతా ఆవించి, సొమ్మసిలిపోయాడు. "దేవుడా" అనుకున్నాడు. పెదాలు మాత్రం అన్నాయి. రొచ్చు వాసనను పీలుస్తున్నాడు. కదల్లేని తనం; శక్తిలేని తనం, వోపిక లేని తనం ఆవరించింది. మెడలో పట్టలేదు; దున్నపోతు—ఎదురుగా పిడుగు పడినట్టు అదిరిపడి విల్చుండి పోయింది. అతనికి దాని స్పృహలేదు. దానికి అతనిమీద విశ్వాసం తప్పుతున్నట్టున్న కదిలిక. తలను కదుపు తోంది నీరసంగా...

అతని తలలో...శూన్యం...భ్రమణం....శూన్యం...ఎగుళ్ళూ దిగుళ్ళూ .... నలుపు....కాంతి .... తర్వాత కొంతసేపు మెడంతా బాగా నల్లగా అయిపోయి. ఆ తర్వాత చీకట్లో వుండి వెలుగుతున్న

లైటు కాంతిలా...నున్నగా గీసిన గడ్డం. స్నో. పౌడరూ. గౌను వేసుకున్న ఫోటో. స్నేహితుల నవ్వులు. ఎయిరుకండిషన్డు హోటలు....టాక్సీ....సినిమా. అమ్మాయిలు. ఈలలు. సెకండు క్లాసు ప్రయాణం. ఖరీదయిన చొక్కాలు. రైలు పెట్టెలో పెద్ద తలపాగా. బక్క కూలీలు. నవ్వు పట్టించడం. పొగా వూద బీకడం. ప్రశ్నలడగడం—ఇల్లు....అందరూ చూడ్డానికి రావడం. ఎవరితోనూ మాట్లాడక పోవడం. ఇంట్లో వాళ్ళకి తన వరస అర్థంకాకపోవడం. పెద్ద ఉద్యోగం కోసం ప్రయాణాలు. మనియార్డరు రిసీట్లమీద నంత కాలు. కాంపిటీషను పరీక్షలు....ఇంటర్వ్యూలు రాకపోవడం.... అందరూ రికమండేషను అనే మాటను వాడడం. చిన్న ఉద్యోగాల కోసం ప్రయత్నం...అవీ రావు నీకు—అనడం....ఉద్యోగాలిచ్చే సంస్థ. సంస్థ వాళ్ళకి ఇష్టమైన వాళ్ళ నంబర్లు ఉద్యోగాల ఇంటర్వ్యూలకి తను రోజూ వెళ్ళడం. ఒక రోజున....తర్వాత చాలసార్లు.... ఇంటర్వ్యూలకి. అనుభవం కావాలి యల్. డి. సి. లకి...అనుభవం వున్న వాళ్ళనే తీసుకుంటాం. ఇంటి దగ్గరనుంచి; కొంచెం ఇబ్బంది గా వుంది డబ్బుకి—రెండు రోజుల్లో పంపుతాను... ఒక్కపూటే తిని ఉద్యోగం కోసం తిరగడం....అందరిలాగా తిరగడం....ఎవడో ఆత్మహత్య చేసుకున్నాడని వినడం. ఆ రాత్రి నిద్రలేదు. మళ్ళీ మరోడు ఆత్మహత్య....చాలా రాత్రులు నిద్రలేక ఆలోచించడం. మంత్రుల కార్లు....మంత్రుల మీటింగులు....దేశం—దేశం అని అరవడం....జాతీయగీతాలు...ఎండిపోయి పడిపోతున్న చెట్టుమీద గూళ్ళు కట్టుకుంటున్న పక్షుల్లా....కడుపులో పేగులు అరుస్తున్నాయి. ఒక్క కాఫీతో రోజు. కాఫీ లేనివాళ్లు; రోడ్డుమీద కుళ్ళిపోతున్న కుష్ఠురోగి. కళ్ళు లేనివాళ్ళు. కాళ్లు లేనివాళ్లు, ఉద్యోగాలు లేనివాళ్ళు... ఉద్యోగాలు వుండీ జరగని వాళ్ళు...నా పార్టీ....నా ప్రభుత్వం.... నా వోటు....నా చేతకానితనం...భార్యకి దూరంగా...కుటుంబ పరిధిలోంచి తప్పుకుని...అనామకత్వం సంపాయించుకున్న చోట... పిడుగు పడింది...మెరుపులు మెరిశాయి...భూ కంపం వచ్చింది... సముద్రం విపరీతంగా పొంగింది. అడవి మధ్య నిప్పు అంటుకుంది.. ఉద్యమం...అడవిని కాల్చివేస్తూ ంది ఎగబాకుతో. ఉమ్మడి వ్యవ

సాయం. ఉమ్మడి కుటుంబం లాంటి కృషి. ఉమ్మడి బ్యాంకు... సమష్టి. తనను చూసి నవ్వులాట ఏదో కొంత మంచి చేస్తున్నాడులే అసలా లేని తనం...మంచి తనాన్ని డబ్బుమీదా! చెడ్డతనంమీదా ఉపయోగించడం. ఉపన్యాసాలు ఇంత చెడ్డచేస్తున్నారు—అవి కాదు: ఇంత చెయ్యగలం—అని. ఇష్టమైన వాళ్ళు...రాఘవయ్యకీ—జై. ఊరూరా తిరగడం. ఇల్లిల్లూ వెతకడం. దిగ్విజయయాత్ర. అందర్నీ పలకరించడం. యోగక్షేమాలు. బ్రతుకును నిర్వచించడం. ఒక్కసారే బ్రతుకు. మళ్ళీరాదు. సహకార పద్ధతి అవలంబించమని ఉద్బోధ తను ప్రయత్నించి చూపడం. తన ఆశయాలతో స్కూలు. తన పంథా హెచ్చుటలు...సమితి ప్రెసిడెంటుగా వోటమి...మూడేళ్ళలో సమితి రద్దు. మళ్ళీ ఎలక్షను. తనకి కావలసినంత మెజారిటీ. తనికి బాధ్యత ఎక్కువయింది...వ్యవసాయం...సహకార వ్యవసాయం...కంట్రాక్టు పనులు...పాలేర్లకీ, చేసిన వాళ్ళకీ భాగాల పంపకంగా వాటాలు...పిల్లలు...అందరూ తలలువంచి నమస్కారాలు. మంత్రులు...ప్రోజక్టు శంఖుస్థాపన...మంత్రి తనతో కలిసి ఫోటో తీయించుకోవడం. తన పలుకుబడిని చూసి ఆశ్చర్యపోవడం. తను అన్నాడు,—

"మంత్రులు ఏం చేస్తున్నారని. ఏం చేశారని ఈ రోజు ఈ శంకుస్థాపన—మన ఎమ్. ఎల్. ఏ. మహాశయుడు, ఆ మంత్రిగారి చేత చేయించాలి? వాళ్ళ సొంత సొమ్ము ఏమీలెదే ఇందులో. మంత్రిగారు ఏ విధంగానూ సామాన్య వ్యక్తి కన్నా మిన్నకాదే! మన అందరం కలిపి ఒక పదవిని వ్యక్తికి కట్టబెడితే, అతను మనకి విధేయుడిగానయినా మసలడంలేదే! కనీసం ఆయన ఈ ప్రాజెక్టు ఈ ప్రాంతానికి కావాలనయినా అనలేదే! మనం కడుతున్న పన్నులకి. మనం బద్ధులమైన ఈ ప్రభుత్వం,—మన ప్రాంతానికి కేటాయించాల్సిన కనీసం సొమ్మునైనా, పూర్తిగా ఇవ్వకుండా, ఒక చిన్న ప్రోజక్టుకి మాత్రమే సొమ్ము కేటాయించి, మననోళ్ళు మూసివెయ్యాలని....ఇది మంత్రులు శంకుస్థాపన చెయ్యాల్సిన విషయమేమీకాదు. మంత్రిగారిని ఈ విధంగా వేదికమీద విమర్శిస్తున్నందుకు బాధ పడకూడదని మనవి. సహృదయంతో, తోటివ్యక్తిగా నన్ను ఆయన

అర్థం చేసుకోగలరన్న నమ్మకం నాకుంది. ఈ నిర్మాణాత్మకమైన కృషి సామాన్య ప్రజలు అనబడే వాళ్ళది. అయినప్పుడు, ప్రజాస్వామ్యంలో మంత్రి శంకుస్థాపన చెయ్యవచ్చు కాని, అంతకంటే, మరింత సామాన్యుని చేతిమీదుగా,—'ప్రజాస్వామ్యం' అని తనని స్వార్థాన్ని, తన గొప్పతనాన్నీ మంత్రిగారు రుజువు చేసుకునే విధంగా—శంకుస్థాపన చేయించవచ్చునే..."

మంత్రిగారు సర్దుకున్నారు, తను ఎమ్. ఎల్. ఏ. తో ఆవిధంగానే అన్నానన్నారు. కూలీ నారాయణప్ప, డభ్భైయేళ్ళవాడు; గడ్డం గీసుకునేందుక్కూడా తాహతులేని వాడు; అడుక్కు తినడం అలవాటు లేనివాడు; చినుగులు పట్టిన కాకీ డ్రస్సువాడు: నల్లటి ఎండిపోయిన వాడు—మంత్రిగారి సహాయంతో శంకుస్థాపన చేశాడు...శంకుస్థాపన, పలకమీద నారాయణప్ప కట్టడపు మొదటి రాయిని వేసినట్టు రాయించబడింది.మంత్రిగారు తమ ఎర్రటి బుగ్గమీదపడ్డ కన్నీటితో.... తాము జైలుకి వెళ్ళిన రోజుల్ని గురించి ప్రత్యేకశ్రద్ధతో ప్రజలికి చెప్పి, దేశం ఇప్పుడు కష్టపడే అలగా జనంమీదే ఆధారపడి వున్న దని నొక్కి వక్కాణించి, పేపర్ల వాళ్ళతో ఛలోకుల్తు పలికి, వెళ్ళిపోయారు వెంటనే కారుమీద—రాజధానికి.

...ఆ ఫలానా ఎమ్. ఎల్. ఏ. ను అతికష్టంమీద తన అభ్యర్థి చేత వోడించాడు తను....

....వూరేగింపు. తలపాగా. వొత్తుగా హుందాగా చుట్టిన రాఘవులు. మొరటుదేలిన మనిషి. బట్టతల. జీపు. ఎడ్లబళ్ళు. ట్రాక్టర్లు. సమితిఆఫీసు. పర్యటన. మంత్రుల ఉత్తరాలు పంచాయతీ సమితి ప్రెసిడెంటుకి ప్రైజు.మిర్చిపండించిన రాష్ట్రబహుమతి.ఉపన్యాసాలు. పూలదండలు. తీసుకోలేనన్ని విరాళాలు. ప్రభుత్వంనుంచి ప్రజావళికి తను సమర్థించి, సవరించి తెస్తున్న డబ్బు శాంక్షన్లు...

—దున్నపోతు ప్రాణంమీద ఆశ వదులుకున్నది.తన అహం. తను రక్షించబోయాడు. సముద్రంలో అడుగు కనిపెట్టినట్టు. అడుగున వున్న మణుల్ని పైకిలాగాలన్నట్టు. తనే అంతు తెలియకుండా పోయాడు...తను బ్రతికాడు...బయటపడాలి....దున్నపోతు అరు

స్తోంది. గు్రుపెడుతూ. తన వొంట్లో శక్తిలేదు....తను దున్నపోతు వెనక్కి జారి, వాలులోనుంచి ఎలాగో నడుచుకుపోయి, బయటపడాలి.

అతను తలయెత్తి, నెమ్మదిగా, దిమ్మగా చూశాడు. కాలవ నిండా ఇసుకంతా బంగారు రేణువుల్లా నిగనిగ లాడుతోంది. కష్టపడిన వాళ్ళ చెమటమీద సూర్యరశ్మి పడుతున్నలాగా, మెరుస్తోంది. భూమికీ ఆకాశానికీ మధ్య, అనేక ఊలియన్ల బురుజుల్లాంటి పాముల్లాంటివి వేలాడబడి వున్నాయి. కళ్ళ కండరాల్ని సాగించాడు....కనుబొమలు పైకి విదిలించుకున్నాడు...మళ్ళీ చూశాడు...ఇసుకంతా రత్నాల్లా మెరుస్తోంది. బురుజు వంక పాములన్నీ భూమిమీదికి దిగుతున్నాయి. తలలో వెనకవేపు బరువుగా వుంది...

కడుపులో తిప్పింది. వాంతి వచ్చేట్టుంది. అతను ప్రయత్నం చేసి ఆపుకున్నాడు....ఇంకా తను బయటపడాలన్న నిర్ణయం.

అతను కదిలాడు. వొళ్ళు పచ్చినొప్పులు. కండరాలన్నీ నలిగి నలిగి. దున్నపోతును బలంకొద్దీ, పిడికిలితో,—అలా దానిమీద కూర్చుని.—గుద్ది గుద్ది చంపాలన్న పిచ్చికోపం....సమాజాన్నే తల కిందులుగా మారుస్తున్న తనకిది ఒక లెక్కకాదనుకున్నాడు. వెంటనే, తను దాన్ని బయటికి తీయలేక పోతున్నాడని గుర్తుకు వచ్చింది.... తన అశక్తత!!...పొద్దువంక చూశాడు. తన జాగ్రత్త తనకిలేక. వూబిలో చిక్కుకున్నాడనిపించింది. లేకపోతే సాయంత్రానికి దీన్ని అవలీలగా తీయగలుగును తనతోపాటు బడితేనొక దాన్ని, సహాయంగా వెంట దెచ్చుకోవల్సిందనిపించింది. పదిమంది మనుష్యులు చెయ్యాల్సిన పనిని తనొక్కడే చేయతలపెట్టి. అలోచనకి బాగా తావివ్వకపోతే, దెబ్బతినడం సబబే అనిపించింది. తనకి ఒక అంచనా, ప్రణాళికా, ఆసక్తి అవసరమన్న సంగతి గ్రహించాడు...తనమీద తను కోపగించుకో లేక. తన అహానికి తను జడిసి, దానిముందు చేతులు పిసుకుతున్నట్టు అనిపించింది....దున్నపోతును, ఏమయినా, బయటికి లాగాలి....

అతను దానివెనకవేపుకి జారాడు. వాలులో, రేవడి మట్టిలో, కాలుమోకాలు కిందిగా, బరువుకి కూరుకుపోయి, ఇరుక్కుంది. చతికిల పడబోయి, నిలదొక్కుకున్నాడు. దున్నపోతుకి అటుపక్కన, —కందువా, తాటాకుదొన్నె, ఉండిపోయినయ్. కాలు రేవడిలోంచి

లాక్కున్నాడు. లాక్కున్న కాలు జివ్వుమని తిమ్మిరెక్కింది. సూదుల్తో-పొడుస్తూంది తిమ్మిరి. చిటపటలాడుతోంది కాలు గరితో గీస్తున్నట్టు.

"మానవాతీతుడికయితే మాత్రం తిమ్మిరెక్కదా?" అనుకున్నాడు తను. నోటితో తిమ్మిరి బాధను వ్యక్తం చేసుకున్నాడు—లాలాజలాన్ని పైకి లాక్కుంటూ. కాలును దండబా చల్లటి పూబిలో తచ్చాడించాడు. అడుగున వున్న తిమ్మిరి తొడల్లోకి పాకింది. చేత్తో, మొలచుట్టూ, వున్న. పంచె చుట్టూ పట్టిన పూబిని దులపుకున్నాడు. ఒక బడితెను చేత్తో పట్టుకుని, దొన్నెను తనవేపు లాక్కున్నాడు పొర్లిస్తూ. మళ్ళీ దానితోనే కండువాను ఈడ్చుకున్నాడు. ఉండి ఉండి కాలు తిమ్మిరెక్కుతోంది, బయట పడేందుకు ఓదిలాడు రాఘవులు—బడితె ఆసరాతో. ఈసారి, మోకాలు లోతుకు దిగబడితే పెగుల్చుకుని ముందుకు పోతేనేమోనన్న భయం వేసింది.... నీరసం వాలులో బాగా నడవ గలుగుతున్నాడు. కాలికింద ఆకులూ రెమ్మలూ. మరో నాలుగు గజాల పూబి మిగిలివుంది ఎదురుగా. దాన్ని కూడా లాగేస్తే,

దున్నపోతు చుట్టూ వున్న కొంచెం పూబినీ కదిలించి, ముందునుంచి నెట్టుతూ, వెనక్కి నడిపించవచ్చు....సగం పైగా పని అయింది....

పిరమిడ్లు కట్టినవాళ్ళు ఎలా కట్టగలిగారు?
యుద్ధాలు చేసినవాళ్ళు ఎలా చెయ్యగలిగారు?
ధ్రువాల్ని చేరినవాళ్ళు ఎలా చేరగలిగారు?
గ్రహాల్లో నిలబడి మాట్లాడి వస్తున్నవాళ్ళు?
....అతను తన పనిని వీటితో పోల్చుకున్నాడు.

అయినా. అవన్నీ విజ్ఞానశాస్త్ర ప్రయోగాలు మందితో నిర్వహించినవన్నీ. ప్రయోగశాలల్లో ఫలితాలా—లాటరీ విధానం. కాని. తను ఆదిమానవుడి కండబలంతో సాధిస్తున్నాడు దీన్ని.... అసాధ్యాన్ని సాధ్యం చేస్తున్నాడు...తను చేయగలడు...

...రంగమ్మని బాబాయి ఎప్పుడో తప్పకుండా బలవంతం చేసి కాని, ఉచ్చుపన్ని ఆమె యిష్టంతోగాని_అనుభవిస్తాడు. తను. ఆ జరగబోయే పనిని ఆపగలిగినా. ఆపడు. అది రంగమ్మలో వుండాలి. మొదట్నుంచి స్త్రీగా పడుతున్న కష్టాలు తలుచుకుని,

సమాజపు పోకడలు తెలుసుకుని, వ్యక్తిత్వపు విలువలు గుర్తెరిగి.—తన్ను తానురక్షించుకోగలిగిన వుపాయాలూ, అలా రక్షించుకున్నందువల్ల కలిగే లాభాలూ, ఆలోచించుకోవాలి...కాని, వొకవేళ ఆమె తత్వం పదిమందిని రుచి చూడడమేనేమో: ...రంగమ్మ పంతులమ్మ. పిల్లలు వుడితే పోషించుకోలేనేమోనని పెళ్ళిచేసుకోని రంగమ్మ!

....ఇండియాలో ఆడాళ్ళు....కుటీరపరిశ్రమలు...ఇల్లు కదలకపోవడం....అయితే బావుండును....జపానులో లాగా. ఇల్లు కదిలి పదిమంది మధ్యకి ఒక ఆడదివచ్చి. అమితమైన గౌరవం పొందుతూ, అహం భావంతో ఆలోచనకు చోటులేక, అందర్నీ కటాక్షిస్తుంది....తను తనగొప్ప తనాన్ని అలానే పోగొట్టుకుంటూంది. పోనీ పదిమంది మగాళ్ళ మధ్యకి పదిమంది ఆడాళ్ళు వచ్చినా అదేపోకడ. ఆడదంటే, బట్టలుకట్టుకున్నా, కట్టుకోకపోయినా ఆడదే. మగాడికి ఆదినుంచీ ఆడదాన్ని పొందాలనే కోర్కె. ఆడదానికి అనాదినుంచీ మగాడిచేత పొందబడాలనే కాంక్ష. సృష్టిసహజం. కావాలన్నప్పుడు ఈ కోరికలూ, కాంక్షలూ కలిగి, అక్కరలేదన్నప్పుడుపోవు. ఇవి మనిషిలో అంతర్గతాలు. ఎల్లప్పుడూ స్పందిస్తూనే వుంటాయి. సంచలితమవుతూనే వుంటాయి. ఎప్పుడూ వీటి ఝంఝామారుతాలు వీస్తూనే వుంటాయి....బ్రహ్మచార్లు ఆడాళ్ళని జాతీయం చేయమంటారు. సంసార్లు సాంఘిక ఆచార వ్యవహారాల్ని మరింత కట్టుదిట్టం చేయమంటారు. సెక్సు తప్పిదాలు పట్టించుకోనివాళ్ళు సెక్సు తప్పిదాలకు దూరంగానూ, పటిష్ఠంగానూ వున్నవాళ్ళు.-ఆడవాళ్ళు అందరి సొత్తూ అంటారు. మిగిలినవాళ్ళు తమను తాము కప్పిపుచ్చుకునేందుకు-ఆ విధానం తప్పంటారు—సాంఘిక పతనం – నైతికంగా దిగజారడం—అంటారు....ఏదిఎలావున్నా ఒకసరళి మాత్రం వుండాలి. ఎడమవేపుగా నడవమన్న విధంగానే-సంఘానికి ఒక పద్ధతి. ఆచారమూ వుండాలి. ఆ పక్కగా నడవకపోతే శిక్షిస్తున్న విధంగానే, ఈ సాంఘిక ఆచారాల్ని ఉల్లంఘించిన వాళ్ళనీ శిక్షించాల్సిందే. అందరూ వాళ్ళకిష్టమొచ్చిన విధంగా ప్రవర్తిస్తే, అటువంటి స్వేచ్ఛనిస్తే,—కక్షలూ, కొట్లాటలూ పెరిగి. సుందోపసుందుల యుద్ధాలయి జనక్షయం జరుగుతుంది. నియంతృత్వంగా సంఘాన్ని మంచిదారిని నడి

పించవలసిందే. ఆలానే ప్రజల బాగోగులను కూడా వియంతృత్వ ఆశయాల్తో శాసనాల వొరవడిలో ప్రజా స్వామ్యంకిందనే నడప వచ్చునే...అంచేత స్త్రీ పురుష భేదం అవసరం. వాళ్ళ అవయవాల తేడాల్లాగా, సమాజంలో కూడా అందుకు తగిన కట్టుబాట్లతో తేడా తప్పకుండా వుండాలి. నిర్దుష్ట విధులుండాలి ఇద్దరికీ....

ఒళ్ళంతా నీరసమెక్కి పోయింది. ముందుగా తను ఎంతగా చురుకుదనం చూపించాడో అంతకంతా నీరసం వచ్చేసింది. కాళ్ళ కీళ్ళల్లో, నొప్పులుగా వున్నాయి. ఓర్పు చచ్చిన చేతులు....

అతను బడితల్ని పట్టుకుంటూ, ముందుకు నడుస్తున్నాడు.... చేతిలో దొన్నెను బలంకొద్దీ బయటికి విసిరాడు. బోర్లా పడిందది. వూబి చివర. పచ్చి తాటాకు దొన్నె అవటం మూలాన, బరువుగా వుందది. కందువా—మెడచుట్టూ గాలి రాసుకుపోతున్నప్పుడూ, మెడ కదల్చాల్సి వచ్చినప్పుడూ మాత్రం వాసన వస్తోంది. అతని కాళ్ళు వొణుకుతూ వాటిలో నడుస్తున్నాయి—కొంచెంగా దిగబడుతూ.

"నేను బ్రతకాలనివుంటే, ఇంకా ఎన్నో చెయ్యాలనివుంటే, అప్పుడే ఎందుకు వూబిలో పాతుకుపోయి, చచ్చిపోతాను!" అతను అన్నాడు.

"య్యోఁ" అంది దున్నపోతు మెడను వెనక్కి తిప్పి. అది, మిగిలివున్న కొంచెం గడ్డీ మేయడంలేదు.

రాఘవులు నాలుగు గజాల వూబిని బడితెల సహాయంతో దాటుతున్నాడు ....బయటికి వచ్చాడు ....దొన్నె అందుకున్నాడు. తొడల్ని పట్టుకున్న, కాలికింద పట్టుకున్న చొప్పు వూబినంతా విదిలించాడు. తనలో ఇదంతా వదిలి వెళ్ళిపోదామనీ వుంది ...ఇంతాచేసి ఇప్పుడు వదిలివెళ్ళిపోతే, చివరవరకూ వుండివున్నట్టయితే ఫలితం ఎలావుండి వుండేదో నన్న ఆలోచన వస్తుంది. ఇది విఫల ప్రయత్నం అవుతుంది ఇదొక అర్థంలేని పాటుఅయిపోతుంది అందుకని,—

మొండిగా నిర్ణయించుకున్నాడు,—

ఫలితంచూసి పోవాలని. ఇంక మరోవిధంగా ఆలోచించ గూడదని. ఒకపని ప్రారంభిస్తే, దాని అంతు చూడాలన్నది తన

సిద్ధాంతం తనకితానే ఉత్సాహం తెచ్చుకోడానికి ప్రయత్నంచేశాడు. ఒళ్ళు నొప్పులు లేవనుకున్నాడు.

దొన్నె పుచ్చుకుని, అతను నీటిదగ్గరికి నడిచాడు. ఇసుకమీద కాళ్ళు తేలిపోతున్నాయి. కాలికికట్టిన మణుగురాళ్ళ బరువుల్ని వదిలించినట్టు, చెరవిడిపించినట్టు వుంది. నీళ్ళు బాగా వెచ్చగా వున్నాయి. చేతుల్ని పిసుకుతూ మట్టిపోయేలా కడుక్కుని, ముఖానికి నీళ్ళు కొట్టుకున్నాడు. బరువుగా వున్న కళ్ళకు ఆనీళ్ళ వేడిభరించలేనిదయింది. మంచినీళ్ళు తాగాలనిపించింది—దాహం తీరి శక్తి వస్తుందని. పొట్టలో పోటుపెటుతుందేమోనని మానేశాడు వెంటనే. వెచ్చటి నీళ్ళు దున్నపోతుకూడా సాయించవని తెలుసు. పోనీ గాలికి చల్లనైన తర్వాతే, తాగుతుందని, దొన్నె వంచి. నీళ్ళుపట్టాడు. కాలవలోతుగావుంది అక్కడ...కండువాని తడిపి, కండువా అంచుల్ని దొన్నెకి ముడివేసి...కూర్చుని...వంగి, దానిని మెడకి తగిలించుకున్నాడు అతికష్టంతో, దొన్నెతో లేచినిలబడ్డాడు.

అతని కాలిగురుతులు దారిగా పడ్డాయి. వాటివెంటే అతను నడుస్తున్నాడు. వాగునీటికీ వూబికీ నూటడబ్భై అడుగులు లెక్కపెట్టాడు రాఘవులు....

అతనువంగి వూబిలో నడిచేందుకు ఆసరాగా వుంటుందని బడితెని చేతిలోకి తీసుకున్నాడు. మళ్ళీ దాన్ని అనవసరమనుకుని పారవేశాడు. తను వరసగా గుచ్చిన బడితెలున్నాయి. ఒకచేత్తో దొన్నెని పట్టుకుని, ఇంకోచేత్తో బడితెలమీదుగా బరువాన్చి అడుగువేశాడు.... కండువా ముడివూడి....దొన్నె కిందికి దభీమని పడిపోయింది. సగం నీళ్ళు వూబిలో చాడులో ఇరుక్కుపోతున్నాయి...అతని అడుగుజాడల లోతుల్లో.

రాఘవులుకి నవ్వువచ్చింది. ఇంత తొందరపడుతున్నప్పుడే ఇది జరగాలా? అనిపించింది, తీగల్తో దొన్నెని కట్టుకురానందుకు విచారపడ్డాడు. నీళ్ళుపడినప్పుడు, చప్పుడికి. దున్నపోతు వెనక్కితిరిగి అరిచింది తల వూపుతూ....దానికేవో అర్థమవుతోంది.

"ఏడిశావ్!" అన్నాడతను.

మళ్ళీ, గబగబా, అతను దొన్నె పుచ్చుకుని వెనక్కి వెళ్లాడు.

దొన్నెని నింపి, వొబ్బిడిగా, గట్టిగా, పీలుగా ముడివేశాడు కండు వాని. మెడలో పట్టలేదు—వేలవేసుకునేందుకు. దండచేతికి వేసుకున్నాడు. వూబిదగ్గరికి తెచ్చేసరికి, చెయ్యి లాక్కువచ్చింది. చేతి మీంచి, భుజానికి తగిలించుకున్నాడు సంచిలాగా. దొన్నె బొట్లుబొట్లుగా కారుతోంది. చితికినట్టు కనిపిస్తూంది. తాటాకు రెండు జములు వేసిన మూలాన పెద్దగా కారిపోవడంలేదు. కాలు వూబిలో వెయ్యగానే వెన్న మీద కాలువేసినట్టు లోపలికి చొచ్చుకుపోయింది. నీళ్ళు గులకరించాయి దొన్నెలో. అవి వెక్కిరిస్తున్నట్టు అనిపించింది అతనికి. వోపికగా వూబిలో, పన్నెండు అంగలు వేశాడు...వాలులోకి కూడా నీళ్ళు చెమర్చుకు వచ్చాయి. కాలు జారేట్టు కనిపిస్తూంది. పాదాన్ని నొక్కి-పడుతూనడుస్తున్నాడు. రాఘవులు. రాత్రిళ్ళు వరిచేలకి నీళ్ళు పెట్టేప్పుడు, బంకభూమిలో, ఇలాంటి అనుభవమే. వెంటనే అతనికి జలగలు జ్ఞాపకానికి వచ్చాయి....తన కాళ్ళని పరిశీలించి చూసుకున్నాడు. లేవని స్థిరపర్చుకున్నాడు. దున్నపోతుకి ఎడంవేపునుంచి పోవాలంటే బెదురుపుట్టి, కుడివేపు తిరిగి, అడుగులు వేశాడు. కాలు ఎంతో లోతు పోవడంలేదు. పక్కనున్న ముష్టిమండతో, వూబిలోపలికి గుచ్చి, కొల్చి చూశాడు. మోకాలికి కాస్త పైగా, వూబివుంది. కాని, అడుగున ఏమీ తగలడంలేదు. రాళ్ళున్నట్టు అనిపించింది.

దున్నపోతు ఆసరాగా, దాని మీద చెయ్యి వేస్తూ, అతను దొన్నె దించుకుని, దాని ముందు గడ్డి పక్కగా పెట్టాడు. అది శ్వాసను ఆప్యాయంగా అతని మీదకి వొదిలింది అతనికి చికాకనిపించింది. అది మెడని గాలిలోకి పైకి ఎత్తింది. తల దించి, నీళ్ళని మూచూసి, ఆ ఆతిథ్యాన్ని ఆనందంతో అందుకుంటున్నట్టు, చిన్న పిల్లల ధోరణిలో జుర్రుమనిపించి కొంచెం తాగింది. నాలికతో గడ్డి పరకలు తీసుకుంది....రాఘవులు దాని వంక చూస్తున్నాడు. అతను తనని పరిశీలించడం గమనిస్తున్నట్టు అది....

"నీ మూలాన ఒక పెద్ద గండంలో చిక్కుకున్నాను. నా పెళ్ళాం పిల్లలు ఏనాడో చేసుకున్న పు..." అన్నాడు. గడ్డిని కదిపి మండ ఆధారంగా, దాని వొంటి మీద ఒక చెయ్యి ఆనించాడు. తన భుజం మీది కండువా తీసి విప్పి, వాటుగా, దాని మీదకి విసిరాడు.

కండువా తడి ముడతలుగా పల్చగా దాని వొంటి మీద పరుచు కుంది. అతను నీరసంగా తడి చేతుల్ని తుడుచుకున్నాడు.

ఏదో తోడేలు లాంటిది వచ్చి, గట్టుమీద విలబడినట్టు అతనికి పుట్టినే అనిపించింది. అదాటుగా వెనక్కి తిరిగి చూశాడు గట్టుపైకి. తుప్పలు మాత్రం కనిపిస్తున్నాయి. తుప్పల వెనుక, తోడేలో, దుమ్ముల గొందో, కొంట్రబోతో, నక్కో నక్కినట్టు తోస్తోంది. లేకపోతే ఎవరయినా మనిషి దాక్కున్నాడేమోననిపించింది. ఈ ఆలో చనలు రాగానే ఆతని శరీరం భయంతో కుంచించుకుంది. మనిషేమో నన్న సంశయం రాగానే, శరీరం లోపల కంగారు అడ్డదిడ్డాలు పడింది... వో బందరాయో, దుంగో తన మీదికి రావడమో, కత్తి వచ్చి తనలో దిగిపోవడమో, లేక తుపాకి గుండు గుండెలో దూరి పోవడమో జరుగుతుందన్న ఆలోచన వచ్చింది.... ఇది తను వొంట రిగా వుండగూడని స్థలం. తన నోరు సహజంగా చాలా సార్లు కత్తుల్ని మాట్లాడుతుంది...తన మాటలు తుపాకి గుళ్ళు. ఆ మాటలకి అధికార పదవుల్లో వున్నవాళ్ళూ, మూడేసి వేల జీతగాళ్లూ అందరూ జడుస్తారు. వాళ్ళ పురాతన వ్యవస్థ మీద, జడత్వం మీద దెబ్బ తీయడానికి తన పోరాటం...వేసవికాలంలో వేసి భరిస్తూ కోట్లు వేసుకునే వాళ్ళు! అందిన ఆనందాల్ని ఇవి ఎవరివనయినా తెలియ కుండా అనుభవించేవాళ్ళు! ఎప్పుడో పరాయి దేశీయులు పోయినా, ఇంకా వాళ్ళని అనుకరిస్తూ, స్వదేశీయుల్ని నీచంగా చూసే అధికార మదాంధులు!...అంచేత, అందులో ఎవళ్ళయినా వొకవేళ తనని తమ పగకి ఎరగా చెయ్యబూనారేమో!

—"నేను ఈ ఉద్దేశాల్తో వుద్యోగం చేస్తూంటే, ఈ సమాజ పునర్నిర్మాణమనే ఆశయంతో, నేను నా గొంతును ఆ చాలీ చాలని షెషీను బ్రతుకులో వుంచి, విప్పితే; నా మీద విరుచుకు పడివుండేది పాలక వర్గం. ఇది ప్రపంచంలో ఎక్కడయినా వుంది. తర్వాత చరిత్రను వ్రాసిన వాళ్ళు నిర్ణయిస్తారు—ఎవళ్ళు సమకాలీన న్యాయం కోసం పోరాడినారో అన్నది. బ్రిటీషువాళ్ళు దేశీయుల్ని; స్వదేశీయ పాలక వర్గం ప్రతిపక్షవర్గాల్ని; ప్రతిపక్షవర్గాలు పాలక వర్గాన్ని ఓకంట కనిపెట్టడం మనం ఎరుగుదుం. మనం మన ఆశయాలకి విరుద్ధ

మయిన వాళ్ళందర్నీ కదిపెడుతూందాం. జాతి ప్రగతికి అడ్డువచ్చే వాడినల్లా గుర్తుంచుకుందాం. ఇవ్వాళ నేను అందరికీ సంబంధించిన వాణ్ణి. నన్ను కొన్ని కొన్ని సంస్థలు ఏదో గూఢ భావంతో కాపలా కాస్తూనే వున్నాయి. వాళ్ళు వీళ్ళవాడిననీ, వీళ్ళు వాళ్ళవాడిననీ- అందరూ నన్ను తమకి ప్రత్యర్థిగా చూస్తారు. కాని నేను మీవాణ్ణి. నువ్వూ, నేనూ, నీ నా తిండికోసం, నీకూ నాకూ రావలసిన వాటా కోసం, నీ నా క్షేమం కోసం—అభివృద్ధి నిరోధకులతో పోరాడదాం. వాళ్ళని ఎవళ్ళు కానీండి, వాళ్ళతో దింపేద్దాం కిందకి. ఇదే ప్రజాస్వామ్య సామ్యవాదమంటే. బాగా ఆలోచిస్తే మీకే అర్థమవు తుంది.''

తను ఎన్నోసార్లు బహిరంగంగా అందర్నీ విమర్శించాడు. ఇప్పుడు - ఎవడయినా తన నీ నిర్మానుష్యమైన, చోట చంపి, వూబిలో నొక్కేస్తే!...అతని కళ్ళు గట్టుమీది తుప్పల మీదికి వెళ్ళి వాటిని గాలించాయి. రెండు నిముషాలు అలా నిలబడిన తర్వాత - మొండి ధైర్యం వచ్చింది అతనికి. తన భ్రమే కాని, అదంతా వృత్త దనిపించింది. ఉత్సాహం తగ్గి తనలో పిరికిదనం ప్రవేశించిన మూలాన ఇటువంటి ఆలోచనలు—అనుకున్నాడు. అతను వాలులో ముందుకు నడిచి, తన పనికి ఉపక్రమించాడు. చెయ్యలేను అని చెపుతున్న శరీరాన్ని అతని మెదడు చెయ్యమని ఆజ్ఞాపించింది. ఆ సంఘర్షణలో అతను చేతినిండా, జారిపోతున్న మెతక చొడు వూబిని తీసుకుని, పక్కలకి విసురుతున్నాడు. ఇంతవరకూ పనిచేసిన దాని కన్నా ఎక్కువసేపు చెయ్యాలనీ, తొందరగా చెయ్యాలనీ అను కున్నాడు. జారుడు జారుడుగా వూబి తన ముందుకు పాకుతోంది. చేతుల్లో పట్టి వేస్తూంటే, వేళ్ళ వెంట కారిపోతోంది. ఏవో పురుగులు చొడు వూబిలో మెదుల్తున్నాయి. అతను సహించలేకపోయాడు. వొళ్ళు గగుర్పొడుస్తూంది. వెనక్కి వెళ్ళి, బడితెకి పక్కగా నొక్కేపిన తాటి మట్టను బలంగా బయటికి లాగి, దానితో జారుడు మట్టిని బయటికి విదిలిస్తున్నాడు. విదిలించేప్పుడు పూర్తిగా జారుడు మట్టి పోక, మట్టకు పట్టి వుంటోంది

...తను వూబిలో అలా వుండిపోతే శరీరాన్ని చొడు తినేసి

ఒళ్ళంతా పుళ్ళు పడి వుండేది. రేపటికి చచ్చిపోయి వుండేవాడు. ఇంకా లోపలికి వెళ్ళిపోతే, పరిశోధన మీదగాని తనిక్కడ చచ్చి పోయాడని తెలిసి వుండేది కాదు. శిథిలమయిన కట్టడాలూ, నగరాలూ తరవాత ఎప్పుడో బయట పడతాయి—వాటిలో నాగరికతను గుర్తిస్తారు. కాని. తన అస్థిపంజరం తన విలక్షణ శక్తుల్ని గురించి ఏమాత్రం చెప్పలేదు. తనలో విప్లవం...తనలో కొత్తదనం... తనలో ప్రయోగం...తనలో సాహసం! కాని, కొద్ది రోజుల్లో తనిలా చచ్చిపోయిన సమాచారం తెలిసి, విరగబడి ప్రజలంతా వచ్చి చూస్తారు. తన పేరు మీద ఏవేవో చేస్తారు. తను చచ్చిన తర్వాత తన మంచితనం బాగా బయట పడుతుంది. తన శత్రువులు ప్రతిపక్ష బలం తగ్గుతుంది గనుక, సంబరపడి, తన మీద మరో నాలుగు మంచి మాటలు చెపుతారు. తన పేరున ఒక రాతి స్తంభాన్ని నిలిపి, దాని మీద తనని గురించి వివరంగా చెక్కుతారు. సమితి వాళ్ళో కంచు విగ్రహం! కాలచక్రం ఎలా తిరిగేదో!...కాని దాని వేగం ఇచ్చవచ్చినట్టు మార్చేసి. తను లేకపోయాక, నడిపే సమర్థులు లేక, దాని యిష్టం వచ్చినట్టు తిరిగేసి...తన భవిష్యత్తు ఎలా వుందో! తను ఏమి కానున్నాడో! తనకి పార్టీ టిక్కెట్టు యిచ్చి ఎమ్. ఎల్. ఏ. ని చేసి, మంత్రి పదవిని ఇస్తానని పదవిలో వున్న పార్టీ అన్నా. తను వెళ్ళడు. తను సంస్కరించాలి ప్రజాస్వామ్య వ్యవస్థని. తను పదవిలో వుండగూడదు. దాని వెనక వుండాలి. తోలు బొమ్మలాట ఆడించేవాడిలాగా. ఆ పదవుల్లో వున్నవాళ్ళ జుట్టు తన చేతుల్లో వుండాలి. తను మంత్రుల్ని చెయ్యాలి. తనకిష్టం లేనప్పుడు. ఆ బొమ్మల్ని దింపేసి, మరో బొమ్మల్ని నిలబెట్టాలి. (తనని ఒక పొలిటిక్సు ప్రొఫెసరు Anarchist అన్నాడు. కొంతవరకూ తన కృషిని మెచ్చుకున్నాడు. తను నిజంగా పాలనాధికారం ఒక్క కీలక హస్తం లో వుండాలనే వాళ్ళలో జమ అవుతాడేమో!) సిద్ధాంతరీత్యా ప్రజలకి శ్రేయస్సు కూర్చే పద్ధతుల్ని. కావలసినంత నెమ్మదిగా, అవసరమైనంత వేగంగా మార్చుకునే విధానాలు చేపట్టిన ప్రజల మెజారిటీ పార్టీని సృష్టించాలి...నిర్మించాలి. ప్రజాస్వామ్యానికి సిసలైన అర్థం చెప్పాలి. ఒక్కడి సంకల్పంతో దేశాలూ కావలసిన విధంగా

మార్చివేయగలిగిన ఎన్నికల ప్రధాన ఘట్టం వున్న ప్రజాస్వామ్యంలో చరిత్రకి కొత్త మాటల్ని, కొత్త పేరాల్నీ కూర్చాలి.

...తన వయస్సు రాజకీయపు కొలబద్దలో-చిన్నదే. ఇంకో నలభై యేళ్ళు ఈ తన కార్యక్రమాన్ని ఈడ్చవచ్చు. ఈ నలభై ఏళ్ళలో తను పాట్టను బద్దలుకొట్టి, కొత్తను సృష్టించి, ప్రజాభ్యుదయాన్ని సాధించలేదా?

సమితినుంచి జిల్లాస్థాయిలో ఒక పత్రిక నడపాలి తను. జిల్లాలోకంటే, ముందు సమితి స్థాయిలో ఒక ప్రచార కేంద్రాన్ని ప్రారంభించాలి. ఎవణ్ణో, ఆ పత్రికని తీర్చిదిద్దగల అనుభవమున్న వాణ్ణి తెచ్చి. సొంతప్రెస్సుతో, తన ఉద్దేశ్యాల్ని, జిల్లా వార్తల్ని, తన ఉపన్యాసాల్ని; తను ఆచరణలోకి తెస్తున్న సమష్టి సహకార విధానాల్ని అందరికీ, అర్థమయేలాగా ప్రచారం చెయ్యడానికి పత్రికని నడపాలి. సామాన్య ప్రజల మనస్సులికి హత్తుకునేలాగా, ఆ పంథా కథల్ని రాయించి, ఇప్పటి వాస్తవ పరిస్థితులు అర్థమయేటట్లు చేయాలి...అటువంటి పత్రికలేక, తన ఉద్యమం వ్యాపించలేదు. తన ఉద్యమం ఏ ప్రవక్త ఉద్యమానికీ, రాజకీయ వేదాంత ఉద్యమానికీ తీసిపోదు తను ఈ ప్రవక్తల్ని, రాజకీయ వేదాంతుల్నీ క్షుణ్ణంగా అర్థంచేసుకున్నాడు. అందరిలోనూ ఏవో కొన్ని సాంకేతికమైన పొరపాట్లు దొర్లుతూనే వున్నాయి. ధనికవర్గాల్ని అవునన్నవాడూ; కార్మికవర్గాల్ని ఆదుకున్న వాడూకూడా, 'వ్యక్తిత్వాన్ని' దృష్టిలో వుంచుకోలేదు. వ్యక్తిత్వానికి గౌరవం ఇవ్వకపోతే అది ప్రజాస్వామ్యం అవదు. ప్రజాస్వామ్యంలో మాత్రం:...నియంతలంటారు. కాని, వాళ్ళు ప్రజలకి ఉపకరించే నియంతలు. తను కూడా ఒక నియంత, తను ప్రజల్ని వాళ్ళ బాగుకోరి శాసిస్తున్నాడు ప్రజల మెదళ్ళను చిత్రీపడుతున్నాడు. వాళ్ళని సమ్మోహితుల్ని చేసి, తనవేపు ఆకర్షిస్తున్నాడు—తనని అనుసరించేలా చేస్తున్నాడు.

...తను ముఖ్యంగా చెయాల్సిన పని—ప్రతికాస్థాపన. ఆ పత్రికలో రైతులకీ కార్మికులకీ సలహాలు, వినాదాన్ని వదలి, సారాంశాన్ని చెప్పడం విద్యాబోధ చెయ్యాలి. వారపత్రిక నడపాలి. దీనివల్ల పదిమంది బ్రతుకుతారు. సమితిగ్రామాల్లో పాతదనంతో వున్న యువ

కుల(—కొన్నాళ్ళకయినా) తన బోధనవల్ల తమ తప్పు వదుల్చుకో గలరా? పత్రిక అరటావు సైజులో వుండాలి...పద్దెనిమిది పేజీలుంచే చాలదా. నెమ్మదిమీద పెంచవచ్చు. నానుడుభాష గూడదు. హృద యాలికి హత్తుకునే భాష వుండాలి పత్రికలో. చొక్కాల్లాగా. పెంచె ల్లాగా. ప్యాంటుల్లాగా. వాచీల్లాగా. వుంగరాల్లాగా. తిండిలాగా. మనుష్యుల్ని ఆ భాష ఆవరించుకుపోవాలి. ఈ ప్రాంతానికి సంబం ధించిన కథలు రాయించాలి...నాగలి పుచ్చుకున్న రైతు...దున్న పోతును కడుగుతున్న పరిషత్ ఛైర్మను...దున్నపోతుని వూబిలో నుంచి బయటపడవేస్తున్న ఛైర్మను...పంచాయితీ ప్రెసిడెంటులో నీరసం...ప్రజలఅధికార్యానికి అధికారులుగా పిలవబడేవాళ్ళ పరిజ్ఞానానికీ కలుగుతున్న సంఘర్షణ...సుఖంకోసం బద్ధకపు బ్రతుకుల్తో ప్రాకు లాట...ఇవన్నీ దీన్ని ఒక ప్రత్యేక ప్రాంతంలో తయారుచెయ్యాలి. ఇక్కడ వ్యక్తుల్ని పూర్తిగామారిస్తే. ఈ గుంపులో జీవన ప్రమా ణాల్ని ఎక్కువచేస్తే. మిగిలిన ప్రాంతాలన్నిటినీ ఎంత తొందరగానో మార్చవచ్చు...

...పత్రిక పెడితే ఒక ఆర్టిస్టు కావాలి. (అతను ప్రజాస్వామ్య సామ్యవాదాన్ని చిత్రించాలి. 'గుయర్నికా'ను కాదు. దున్నపోతును గియ్యాలి)...బ్లాకులు చేసేవాడుండాలి. డబ్బు ఎక్కువగా అవుతుందీ? సమితి తరపున అప్పుగా కొంత డబ్బు. ఇప్పించేస్తే? సమితి' లోను ల్లోంచి కొంత కేటాయించి. అదొక పరిశ్రమగా పెట్టిస్తే ఫరవాలేదు. కొంతభాగాన్ని సమష్టి వ్యవసాయ సంఘాలు భరిస్తాయి. ప్రజాభ్యుదయ పట్టికకింద. నిరుద్యోగ నిర్మూలన పథకంకింద. ఆ అప్పురాయించాలి. అవును....దీన్ని ఒక ప్రజోపయోగ కార్యంగా తలచి సమితిదీనికి కొంత అప్పుఇస్తుంది. దీన్నికూడా లాభదాయకంగా సహకారపద్ధతి మీద నడిపితే. ప్రజల్లో ఈ పత్రిక పాతుకుపోతుంది...ఇంటింటికీ అది ఉప్పులాగా అమ్ముడు పోవాలి.

"నేను తప్పకుండా సాధిస్తాను" అనుకున్నాడు అతను.

ఊబిని తాటిమట్టతో లాగేసున్నాడు. మరో రెండుగజాల వూబి వుంది—గజంవెడల్పు కలిగిన బడితెలమధ్య. బడితెలకు మధ్య.— బయట వూబి. లోపలికి రాకుండా. గొలిగి కంపను దిట్టంగా పేరుస్తు

న్నాడు. అడుగుకంటా పీలగా నొక్కేస్తున్నాడు. ఆకులూ. చిన్న చిన్న కొమ్మలూ అన్నీ ఏకమయి: గట్టిపడుతున్న చౌడు వూబిని. వాలు లోకీ, తీస్తున్న చోటికీ. బయటనుంచి రానీయడం లేదు. ఎండ వేడి తగ్గుతోంది. అతని చేతి కడియం కదలకుండా, మట్టితోపాటు చేతిని పట్టివుంది.

రెండు రాబందులు కాలవలో ఎగురుతున్నాయి. గాలి రివ్వవేస్తూంది. ఇసుక మెరవడంలేదు ఎండకు. బాగా దూరంగా తెల్లటి రాసి లాగా ఇసుక తిన్నెవుంది. నీలినీలి చారలున్న ఇసుకతిన్నెలు దగ్గరలో వున్నాయి. ఎదురు—కాలవపారుతున్న వేపున. మర్రిచెట్టు కాలవ గట్టులోకి వేళ్ళు తన్నింది. మరోసారి, సర్షాకాలంలో, పెద్దకాలవ వచ్చినప్పుడు ఆ చెట్టు కాలవలో కొట్టుకుపోతోంది...

రాఘవులు మళ్ళీ వొంగాడు. కాలవగట్టు సూర్యుణ్ణి అడ్డుకుని. దున్నపోతుకి నీడనిస్తోంది. దున్నపోతు క్రమక్రమంగా శక్తిని పుంజుకుంటోంది. గడ్డి పరకల్ని ఇంకాస్త బాగా నములుతోంది, ఈ వ్యక్తి తనని తీస్తాడన్న ధీమా, విశ్వాసం కనబడుతున్నాయి. దానికళ్ళల్లో. ఉండి ఉండీ, తనకోసం అవస్థపడుతున్న అతన్ని చూస్తోందది. నీళ్ళు కొద్దిగాతాగి, వూరుకుంది. దొన్నె అడుగున కొద్దిగా మిగిలివున్నాయి. చాలమటుకు కారిపోయాయి వూబిలోకి. కంపమండలు, వూబిలో గుచ్చేందుకు చివరివరకూ వొత్తుగా సరిపోతాయి. కొద్దిగా మాత్రం మిగిలి వున్నాయి. ఆ వైపు, వెనకగా పడవున్న పెద్ద దుంగలు రెండూ ఆఖర్ని వూబిలో పరిచి దారినిగట్టిపడ చెయ్యాలని అతని సంకల్పం.

ఒక ఆడకోతీ మగకోతీ సరసాలు ఆడుకుంటూ చేస్తున్న 'కిచకిచల' గోల అతని చెవుల్లోదూరి, అతను మర్రిచెట్టు వేపు చూశాడు... దొడ్డకోతులు. ఆడది మగదాన్ని అందకుండా ఆడిస్తోంది. అవి రెండూ చెట్టుమీదినుంచి తల్లక్రిందలుగా దూకుతున్నాయి. వొక చేత్తోనే కొమ్మనువంచి, ఆ కొమ్మకు వేలాడుతున్నాయి. ఒకదాని మీంచి ఒకటి దూకుతున్నాయి. కాని, ఆడది మగదానికి దొరకడం లేదు. ఏవేవో మాట్లాడుతున్నాయి...సాధించుకున్నట్టుతిట్టుకుంటు న్నట్టు...సరసాల్లాగా, ఆడది కల్లు మిటకరిస్తూంది, గర్రుమంటోంది

మగది వుట్టినే చూస్తూ కూచుంటోంది.....వుండివుండి అమాంతంగా ఎగురుతోంది. ఆడది తిడుతోంది—తక్కువ జీవన ప్రమాణాల మొగుడూ పెళ్ళాల్లా. మగది వొళ్ళు గీక్కుంటోంది....దిక్కులు చూస్తోంది. ఆడది నాలుగు కాళ్ళమీదా నిలబడి. తోక ఎత్తి గెంతు తోంది. రెండూ లుంగచుట్టుకుని కిందికి పడ్డాయి. రెండూ కూచుండి పోయాయి దగ్గిరసా. ఇంతలో ఆడది 'హుమ్మ'ని ఎగిరి. చెట్టుమీద కూచుంది. అది తనని చూసింది—దూరంగా మనిషిని అలాగే చూస్తోంది....సిగ్గుపడిందిలాగా వుంది. కోతులు మనుష్యులకన్నా తెలివి చూపెడతాయి. ఒకరోజున భేరీల నూతిదగ్గర వెంకన్న పెంచు కుంటున్న కోతి ....ఆ పడుచుపిల్ల దాని పసుపుకి విచిత్రంగా చూస్తోంటే. కన్నుకొడుతోంది. ఆ పిల్ల ఆదాటుగా తెలుసుకుని సిగ్గుపడి పైట సరి చేసుకుని. భయంగా చుట్టూ చూసుకుని వెళ్ళిపోయింది. దారినపోయే తన కదంతా ఆశ్చర్యమనిపించింది....

థాఫ్....థాఫ్....థాఫ్....అతను వూబిని బయటకు చిమ్ము తున్నాడు....గాస్....కస్—పట్....జట్....జట్....బాస్....అతను కంపను నొక్కివేస్తున్నాడు గోడలికి.

మళ్ళీ కోతులకోసం చూశాడు. కనిపించడంలేదు. అల్లరి లేదు. మర్రి చెట్టు గుబుర్లలో దాక్కుని వుంటాయి. వాటికి మొదటి సారి కలయికేమో! బాగా చిన్నవి...వాటికి వింతగా వుండివుంటుంది. (....అతనికి వెగటు కలిగింది) లేక ఎటోపోయి వుంటాయి...కోతులు కూడా కొన్నాళ్ళలో ప్రభుత్వాన్ని ఏర్పాటుచేసుకుంటాయి రామా యణంలో లాగా. అడవిలో ఇటువంటి చిద్విలాసాల్ని చూసే. వాల్మీకి. కోతి రాజ్యాన్ని గురించి రాయాలని. రామాయణంలో కల్పించి వుంటాడు. అంతా మనిషిపోలికే. మనుష్యుల్లాగానే. వాటి మెదడు మనిషి మెదడుకన్నా చురుకైందిట. కాని కొద్దికాలంలోనే పరిపక్వానికొచ్చి. అక్కడితో ఆగిపోతుందట. లేకపోతే.—వాటి తలల్లో. మనిషి మెదడుపెట్టి ప్రయోగంచేస్తే! ఆడకోతి కూడా నెలకో సారి రక్తస్రావం చేసుకుంటుందట (—అతనికి నవ్వు వచ్చింది.) ''ప్రకృతి!'' అనుకున్నాడు. ఆవులూ గేదెలూ రక్తస్రావం చేసుకోవు. కుక్కలికి కూడా ఆ వింతలేదు. కోతికే ఆ ప్రత్యేకత.

—పని వెనక బడుతోం దనిపించింది. వొంటినిండా రక్తాన్ని పుంజుకునేలా శ్వాపించాడు.

థాప్...థాప్...థాప్...థాప్...ఝష్ ... ఝష్ .... థాప్.... థాష్....

"దీని తల్లీ ముండామొయ్యా...హాయ్ ..హాయ్... హాయ్.... (థాప్...థాప్...థాప్...చాస్... ) నా కిదొక లెక్కా...హాంపట్.... హాప్...ప్రజాస్వామ్యానికీ...జై ... హాంపట్ ... రాఘవయ్యకీ... (థాప్...థాప్...థాప్...థా)"

ఇంకో గజం వూబి వుంది. వెనక్కి తిరిగి చూశాడు. ఒక పేద్ద జున్నుముక్కను. బ్లేడుతో, మధ్యనుంచి చివరికి, వారికగా, కొంతముక్కను కోసినట్టు. పలువరుసలో మధ్య పన్ను విరిగినట్టు. పసుప్పచ్చటి. తెలుపుదేరిన వూబిమీద, ఆకుపచ్చగా కంప మండలు.- మధ్యగా పకడ్బందీ చేశాయి. ఆకురాలి అందంగా వుంది—రంగు నీళ్ళు చల్లినట్టు, నీళ వాలుమీదికి పాకుతోంది

అతను పొద్దువంక చూశాడు. మరో బారెడు పొద్దుంటుందని లెక్క వచ్చిందతనికి.

"ఫరవాలేదు" అన్నాడు.

అతని నాలిక బయటికి వచ్చింది. పళ్ళతో గట్టిగా నాలికని నొక్కిపట్టాడు— శక్తంతా కండరాల్లో చేర్చేందుకు.

"ఎంతలావు వస్తాదయితే మాత్రం ఇంత ఇలా కష్టపడ గలడా? నా పట్టుదలకి ఇదికూడా ఒక పరీక్షేనా? చూడు నా తడాఖా..."

వూబి జారుతోంది. నీళ్ళు వస్తున్నాయి. ఇంకెంతో లేదు. పెద్ద పెద్ద ముద్దలుగా అడుక్కుంటూ చేతినిదింపి లాగేస్తున్నాడు. బాగా తొక్కుడూ. నీళ్ళూ కలిపిన మూలాన, మరింత జారుడయ్యింది. చింది, బనియనునిండా అవుతోంది. చేతినున్న కడియానికి పట్టి, చాడు గీస్తోంది. తను మండలతో అదిమిపట్టిన వాలుకి పక్కలనుంచి వాలులోకి జారుడుపట్టి కొంచెం జారుతున్నట్టు అనిపించింది—

...గాలిగిమండలు వొత్తుగా తొక్కితే సరిపోవు, పల్చగా పెడితే చేసినపని అంతా వృథా అవుతుంది—పక్కనున్న జారుడు వూబి అంతా వాలులోకి వచ్చేస్తే!

—పొందికగా పేరుస్తున్నాడు గొలిగిని. పక్కల్నా. ఈ వాలంతా నడచిన తర్వాత దున్నకి ఈ చివర్న గజం వూబీ ఏమంత కష్టమవదనిపించింది. దానిచేత దూకించవచ్చుననిపించింది. దాని కాలు పట్టు సడలిస్తే, ప్రాణభయంతో అదే గెంతుకుంటూ వస్తుందని లెక్క వేశాడు.

ఆయాసం వస్తోంది వుండి వుండి. బాగా వొగురుస్తున్నాడు రాఘవులు. తను ఈ పడ్డ యాతనంతా భార్యకి చెప్పుకోవాలనిపించింది మూడు నాల్రోజులు పోయింతర్వాత అత్తారింటికి వెళ్ళాలని నిర్ణయించుకున్నాడు. తన భార్యని చూడకపోతే తను వుండలేడు. ఇంత గండం గడచిన తర్వాత, ఇంతగొప్ప కార్యాన్ని చేసింతర్వాత, దీన్ని నలుగురికీ చెప్పుకోవాలి. ముందు—ముందు—అందరికంటే ముందు తన భార్యకి చెప్పుకోవాలి. "ప్రమీల ఇదంతా విని ఆదుర్దా పడుతుంది"

....కంప సరిపోతుంది. ఇంకా అయిదు నిమిషాలు పడుతుంది దీన్ని లాగడానికి. చివరకి తనే జయించాడు. అవతలిపక్కన వూబి మీద చాప పరుచుకుని కూచున్న చావుగాడి ముఖం వేలపడుతోంది. చావుగాడి వల గురితప్పి దున్నపోతుకి దూరంగా పడింది. వాడి చేతిలో చేవ చచ్చింది. కసికొద్దీ తననీ దున్నపోతుతోపాటు చంపాలనుకున్నాడు. కాని, చావుగాడే చివరకి వోడిపోయాడు. తను రాఘవులు!!! వెలుగుండగానే విజయగర్వంతో దున్నను బయటికి లాగాలి...

"ఏయ్యే...ఏయ్యే...ఏ...య్యే" అన్నాడు రాఘవులు.

"ఈఁ" అంది దున్నపోతు.

....మళ్ళీ అంది.

"నీ తస్సాదియ్యా—దారికొచ్చావు" అన్నాడు రాఘవులు. ముఖంమీది చెమట బిందువుల్ని తల విదిలిస్తూ దులుపుకున్నాడు. గొంతులో పేరుకుంటున్న తెమడను, దగ్గుతూ వూసేశాడు. తల గిర్రెత్తుతోంది. ఏ మాత్రం విరామం లేకుండా పని చేశానన్న ఆలోచన వచ్చి తనకి తనే ఆశ్చర్యపడ్డాడు. ఒక రోజంతా వొళ్ళు తెలియ

శుండా విద్రపోవాలనిపించింది. ఇంటిదగ్గర....తను, వెళ్ళేసరికి అందరూ ఎదురు చూస్తూంటారు. తన్ని బురదతోచూసి ఆశ్చర్య పోతారు. ఆశ్చర్యపోనీ...కాని, తను ఇదంతా కడుక్కోలేదు ఇప్పుడు. ఇదంతా తోముకుని, బట్టల్ని గుంజుకుని, ఇల్లు చేరే వోపిక లేదు తనకి,

"ఓసి దున్నపోతూ!!" అన్నాడతను శ్వాసను ఎగ పీల్చు శుంటూ, తెల్లటిబట్టను కప్పుకున్న దున్నపోతు,

మరో రెండు తట్టల మట్టివుంది,

నడుం నొప్పిగా వుంది.

దాన్నికూడా లాగెయ్యాలి...అతను శాస్సేపాగి తీద్దామను కున్నాడు. పనిలో పనిగా తీసెయ్యాలనికూడా అనిపించింది. బద్ధకాన్ని రానివ్వగూడదని. తూలయినా పడిపోవాలిగాని, ఇలా తల వొంచ గూడదని.

కాలువేసి, అణిచి చూశాడు.

కొంచెం కొంచెం దిగబడుతోంది.

—అతను ముందుకు వంగి, కాలవలో ఇసకను, పల్చ పల్చగా వున్నదాన్ని, గట్టిప్రదేశంమీది నుంచి, వాలులోకి లాగాడు. వూబి నుంచి బయటికివచ్చి, వూబిలోకి కాళ్ళతో నెట్టాడు ఇసకను, రెండుగజాల మేర ఇసకతీసి పోర్లించి పోశాడు,

దున్నపోతువేపు తిరిగాడు.

....కాస్సేపు కూచోవాలనిపించింది. కాని, ఎదురుగా దున్న పోతు. ఎప్పుడు వూబినుంచి బయటపడదామా, అన్న ఆతురతతో వున్న జంతువు. దీనావస్థలోవున్నది. శ్వాసిస్తోంది బాగా.

...కందకం తవ్వినట్టుంది.

....కాలవలో మరో కాలవలాగ

....తను చాలా శ్రమపడి చేసినదారి, దున్నపోతు తెలివయిన దయితే పీలుగానే రావొచ్చును. రాకపోతే, తను ఈడ్చుకొస్తాడు, బాడి, బయటకి తోలుతాడు.

అతని కళ్ళలో, వేడితగ్గిన ఎర్రటి సూర్యుడి వెలుగు మెరి

పింది. గట్టుమీద పొదల్లో పక్షులు గోల చేస్తున్నాయి. పచ్చిమందు తున్న వాసన రావడంలేదు. దూరంగా పొగలు తగ్గాయి. సాయంత్రం వర్షం కురిసేట్టుగా వుంది.

బనియను చెమట వాసన వేస్తోంది. భరించలేనంతగా చంకలు మండుతున్నాయి. కడుపులో ఖాళీ! బట్టతలమీద గురగురలాడు తోంది—ఏదో పాకుతున్నట్టు.

దున్నపోతు వుండి వుండి తలని అటువేపూ ఇటువేపూ తిప్పి. వెనక్కి చూస్తోంది. దానికి తొందర హెచ్చుతోంది. దానిముందు గడ్డి మిగల్లేదు. దానిమీద కందువా ఆరింది. వూబితో అంటుకుపోయిన గడ్డిపరకల్ని అది నాలికతో ఏరుకోలేదు. సగం కాలవగట్టు నీడలో దున్నపోతు మునిగిపోయి. దానివొళ్ళు చల్ల బడింది. చప్పుడు చెయ్యకుండా....అటుపక్క నీళ్ళు ప్రవహిస్తు న్నాయి—కాలవగా.

వాటికి రెండువేపులా పెద్దపెద్ద గుట్టలుగా వూబి. ఆ గుట్టల పక్కనా. గుట్టలమీదా పచ్చటి ఆకులు. బళ్ళమీద తెచ్చి. బళ్ళపళంగా ఎత్తి. పేర్చిననట్టు గుట్టలు.

రాఘవులు ఆలోచిస్తున్నాడు:

...దున్నపోతు అతని ఎదురుగా కదలకుండా నిలబడి వుంది. తను ఏం చెపితే దాన్ని తు. చ. తప్పకుండా చేసేదానిలాగా. తన దండ చేత్తో బట్టతలమీద రుద్దుకున్నాడు. చేతిమీదమట్టి తలమీద విది లించుకుంటే-పడింది. మళ్ళీ రుద్దుకున్నాడు. కొంతరాలింది...కొంత మట్టి అంటుకుని పేరుకు పోయింది.

పక్షులగోల ఎక్కువయిపోయిం!

అతనికి రొజ వినిపించింది. బాగా వింటున్నాడు. ఎలక్షన్లు జ్ఞాపకం వచ్చాయి....రేడియో బరబరలు. అతనిమీద నుంచి తేనె టీగల దండు. మబ్బులాగా పోతోంది. కదలకుండా నిలబడ్డాడు.

పొద్దుకిందికి జారుతోంది. వత్తి అయిపోతున్న ప్రమిదలాగా వుంది ఆకాశం—కొవ్వొత్తి అడుగున తగలడి పోతున్నట్లు. ఆఖరి శ్వాసలాగా....

వెన్నెల కొంచెంగా, అప్పుడే వస్తోంది. గుడ్డిగా వుంది. మసక గావుంది. నీళ్ళంతా పల్చగా వుంది. రాజకీయవాది ప్రమాణంలావుంది. పాలిపోయి వుంది. మాస్టారి ముందు కుర్రాడిలా వుంది. చాతకాని వాడులా వుంది. గమ్యంలేని ప్రజాస్వామ్యంలా వుంది. చుట్టూవున్న అడవి కీకారణ్యం చేస్తూంది రాత్రిని. తను ఇంటికి పోవాలంటే, కనీసం అరమైలయినా అడ్డదిడ్డాలుగా నడిచి వెళితే,—పుంతా, దారీ వస్తాయి.

ఎప్పుడో పొద్దుట పొలాన్ని వదిలిపెట్టి భోగిమండల కొసం బయటికివచ్చాడు. భోగిమండలదారిన భోగిమండలు పోయాయి. పొలం, జ్ఞాపకానికే రాలేదు. ఒకపూట జీవితాన్నంతా ఈ దున్నపోతు తిన్నది.

దున్నపోతు ఎదురుగా కనిపించింది

దున్నపోతులానే.

"వేలాది జనులైన ప్రజల్ని కదిలించి వెనుక లాక్కురా గలుగుతున్నాను...దీన్ని ఉపాయంగా బయటికి లాగలేనా?" అనుకున్నాడు పైకే.

దున్నపోతు తల అతనివేపు తిప్పింది—అతన్ని చూడ్డాని కన్నట్టు అతనేదో తనని గురించే అంటున్నాడు. వినాలన్నట్టు-చెవులు గాలికెరటాల్ని అందుకునేందుకు నిక్కబొడుచుకుని.

అతను చేతుల్ని గాలిలోకి గుంజుతూ విసిరాడు. పటపట మన్నాయి, పట్టుపట్టిన చోట. నొప్పిగా వున్నాయి భుజాలుకూడా. చేతి నెండుతున్న వూబిమట్టి చిదపలు పడ్డాయి మళ్ళీ తనమీద.

అతను దున్నపోతును ఉద్దేశించి అన్నాడు,—

"నీ ముందుతరాలన్నీ నాకు కృతజ్ఞతగా వుండాలి,"

అది కదల్లేదు,

అది వినలేదు....విన్నట్టులేదు.

....అది నెమరువేస్తోంది, నిశ్చింతగా నిలబడి వుంది-ఇంక తనకేమీ ఫరవాలేదన్నట్టు.

అతను దగ్గాడు. ఖంగుమంది గొంతులో. శ్వాసకోసం దగ్గును బలవంతంగా ఆపుకున్నాడు.

ముక్కులు మండుతున్నాయి. ఎక్కువగా. శ్రమతో గాలి పీల్చడంవల్ల ననుకున్నాడు. జలుబు చేస్తుందేమో ననిపించింది. తను మధ్యాహ్నం నుంచి తడిలో నానుతున్నాడు.

"పం దున్నపోతు!" అనుకున్నాడు

ఏ ఆలోచన మళ్ళీ దున్నపోతును బయటికి లాగడం మీదా మళ్ళింది. దున్నపోతు ఎడంవేపున వూబిబాగా లోతు వుంది. అది మొరటుగా ఒకవేళ అటులాగితే. ఇంతశ్రమా ఎందుకూ పనికి రాకుండా పోతుంది. పోనీ కంగారు పడి ఆదుర్దాతో గెంతినా. దాని ప్రాణాలు వూబిపాలయి పోతాయి. అది పూర్తిగా కప్పడి పోతుంది వూబిలో. అదృష్టవశాత్తూ కుడివేపుకి కదిల్తే. కొంతవరకూ సుఖం. అటు లోతును తను పూర్తిగా చూడలేదు. ఎంత వుందో.

రాఘవులు తను ముందు అనుకున్న విధంగా పనిని సాగిం చేందుకు నిశ్చయించుకున్నాడు. కత్తికోసం వెతికాడు. వేపదుంగను. అడుగువేపు సూదిగా పెన్సిలు మొనలాగా చెక్కాడు —మరో దుంగ మీద నిలబెట్టి. పచ్చిదుంగ బరువుగా వుంది .. పొడువుగా వుంది. ఏ మాత్రం అజాగ్రత్త అయినా దున్నపోతు ప్రాణం వూబికి అంకితం అవుతుంది. పొద్దుగూకినట్టు దాని జీవితం అంతమవుతుంది. సొంత ఆలోచనలులేని వాడి జీవితం ఎప్పటికీ భయానికీ, పేదరికానికీ దాని పత్వానికీ...అంకితం అయినట్టు. ఇది ఆఖరిజారుడు మెట్టు.... జాగ్రత్తగా దాటాలి ఇది ఆఖరి అంకంలో ఆఖరి సీను ముందునుంచీ పోషించుకొస్తున్న జిగీ, పట్టూ, సడలకుండా సాగనివ్వాలి.

అతను దుంగను భుజంమీద పెట్టుకుని. వాలులో అడుగు వేశాడు. వాలుచల్లగా వుంది. బురదనేలలో నడిచినట్టు నడుస్తున్నా డతను. అతని మోకాలివరకూ ఆ వాలు లోతులో కప్పడిపోయి. ఒక పెద్దయింటికి తీసిన పునాదిలో మెదులుతున్నట్టుగా వుంది. అతని భుజం మీది దుంగ. వూబిగుట్టలమీదుగా చూస్తే. బయటివాళ్ళకి కనుపించదు. దున్నపోతు వెనక్కి తిరిగి రావడానికి విశాలం సరిపోదేమోనని పించింది. మధ్యలో ఒకచోట. బడితె సులువిచ్చి. వూబి లోపలికి చొచ్చుకొచ్చింది. వాలువంకరబడిం దక్కడ.

రాఘవులు బరువుగా, జాగ్రత్తగా అడుగులు వేస్తూ దున్న పోతు వెనక్కి వెళ్ళి, దాని వుండులేని చట్టమీద చేత్తో రాశాడు. చల్లగా వుంది చట్ట. అది తోకని కదిపింది, తోక వూగుతోంది. దాని తోకకున్న మట్టిముద్దని, బలంకొద్దీ, కుడిచేత్తో చిదపబోయాడు. చిదపలేక, పట్టుదల ఎక్కువయి, దుంగని కిందకి దింపాడు. దాని తోక పట్టుకుని, చివర్న వున్నమట్టి వుండని, గురిగా దుంగమీద కొట్టాడు—విసురుగా తోక చివర్న ముద్దకట్టిన మట్టి. రెండుగా పగిలింది. దాని లోక కుచ్చంతా, ఆ మట్టిముద్ద చెక్కల్తో కిందపడింది. మొండితోక —పాములాగా వుంది. నల్లటి అల్లికర్రలాగా వుంది. యానగా వుంది. తోక చుట్టూ చిట్లం కట్టుకుంది చవుడు—ఆతను దాన్ని ముట్టుకోలేక పోయాడు—కాళ్ళని కూడా ఆ విధంగా తిని మేస్తుందేమోనని అనుమానం వేసిందతనికి, ఆతురత రెట్టింపు చేసింది. దుంగను చేతుల్తో ఎత్తిపట్టి. దాని వెనక కాలికి మూలగా దిగవేశాడు. ఆ దుంగ,—ఎనిమిదడుగుల వస్తాదులాంటి కండల మనిషి. దిగెయ్యాల్సినదనిపించింది. అతను లోతులో వుండడం మూలాన, బలంగా దుంగ పడటంలేదు. అంచేత వెనక్కి తిరిగివెళ్ళి. మరో బడితెను, జములుగా వున్న చోటినుంచి, పీకితెచ్చాడు రాఘవులు. దాన్ని ఉపయోగిద్దామని చూస్తూంటే, బడితెలాగిన చోట. వూబిమట్టి వాలులోకి జారకురావడం కనిపించింది. అతను మళ్ళి ఆచోటికి పరుగెత్తుకెళ్ళి మండల్ని భుజాల్తో అడ్డాడు. గుచ్చుకుంటు న్నాయి. వూబి, వాలులోకి అడ్డుపడేట్టుంది. వాటి దారిని మూసే సేట్టుంది, అతను బడితెను అడ్డంగా అడ్డం పెట్టాడు. భుజాన్ని తప్పించి. బడితె పుచ్చుకొని, మోకాళ్ళతో అడ్డుతూ,—మండల్ని. వూబినీ వాలులోకి దిగజారకుండా నరబోయాడు. తన్ను తను వందిం చుకున్నాడు. కొంతసేపటికి దాన్ని ఆపగలిగానని అనుకున్నాడు రాఘవులు.

పొద్దు గర్భంలో, తెలిమబ్బుల వెనకా, కొండలవెనకా పడి పోబోతోంది.

ఇంత జరిగిన విషయాన్నీ అతను పట్టించుకోవడం లేదు. ఆతని వీపూ, భుజాలూ, బనియనూ...అంతా బురదగా వుంది.

అతను బయటికివెళ్ళి మరో దుంగను తెచ్చారు. వాలు వెంట జాగ్రత్తగా నడిచి. కాళ్ళు అలిసి పీకుతున్నాయి.

వేపదుంగను మోసుకువెళ్ళి దున్నపోతు వెనక వాలుమీద. పూబిపైన. అడ్డంగా వేశాడు. మృదువుగా బరువుని అనిస్తూ తన బల మంతా దుంగమీద ఆనేట్టు కాలిని ఆదుముకుంటూ—మరో కాలు పూబిమీద వేశాడు తేలికగా. చిట్లం కట్టుకున్న పూబి గట్టిగానే వుంది పైపైన—దున్నపోతు చుట్టూ.

అతను అంతకుముందు. లోపలికంటా గుచ్చుకోని పెన్సిల మొనలాగా సూదిగా చివర్న చెక్కిన దుంగను,—చేతుల్లోకి లాక్కొని దున్నపోతు కాలిమూలగా దింపాడు. వాలువేపుకి విరగలాగాడు మట్టిని. అడుసులాగా వున్న మట్టిని. సగం పూబి, కిందికి బెల్లల్లా వాలులోకి పడింది...మళ్ళీ అక్కడే వెయ్యాలి...వాలులోకిదిగి, మళ్ళీ అదేచోట అదుక్కుంటూ దుంగను దింపి, లాగేడు. చేత్తో. దానికాలు పక్కన మట్టిని దొలిచాడు. చేతికీ, వేళ్ళకీ ఎముకలేవయినా తగిలి. గుచ్చుకుంటాయేమో ననుకుంటూనే: దాని కాలు చుట్టూ; తోకకి పట్టిన విధంగానే, గట్టిగా చౌడుపట్టి వుంది. అతను ఎంతోసేపు అలాగే చూడకుండా.—మళ్ళీ దుంగమీదికి ఎక్కి, పుందువేపున వున్న వెనక కాలు కూడా బయటపడేట్టు చేశాడు. వాలులో వున్న మట్టిని చేతుల్తో పొందికగా పట్టి బయటికి విసిరాడు.

తను చిక్కడిపోయినవేపు చూశాడు. అతని గుండెలు అవిసి నాయి. ఒక్కక్షణం విలబడి పోయాడు...తను దిగబడి పోతున్నాడు. గిలగిలా కొట్టుకుంటున్నాడు...అవతలివేపున చావుగాడు గేలం తన మీదకి విసురుతున్నాడు...వల పూతగా పట్టి విసురుతున్నాడు.... పెద్దగా భయంకరంగా....వికృతంగా...నవ్వు తున్నాడు .. వికృష్ట మయిన చావు—అతని కళ్ళు తిరగ పోయాయి...చేతిలో దుంగజారి పోతూండడం చూసి. తమాయించుకుని. బాగా తేరుకున్నాడు. అటు వేపు చూడకూడదనుకున్నాడు. తలను దించుకుని. పూబిమట్టిని వాలులోంచి విసురుతున్నాడు.

వాలుకన్నా అరడుగు ఎత్తులో వుంది దున్నపోతు కాలిగిట్ట.

దాని రెండుకాళ్ళ చుట్టూ మట్టిని తీసెయ్యాలి. దాని కాలిని అది కదుపుకోగూడదు. కాలే దానంతట అది కదలాలి...

....తను పడినవేపు వూబి జారుడుగా వుంది కుడివేపున గట్టిగా వుంది. అంచేత కుడివేపు దున్నపోతును మళ్ళిస్తే? కుడివేపు మళ్ళించాలంటే, తను, మళ్ళీ ఇటువేపుకు రావాలి. ఈసారి తను వూబిలో చిక్కడిపోతే ఇంకరాలేడు. అప్పటికి. తనకో కొంతశక్తి వుంది. ఇప్పుడు, చావును కోరుకుని. అటు వెళ్ళాలి—దాని గుప్పట్లో కావాలని ఇమడడానికి. ఉపాయ మాలోచించాలి. దున్నపోతును వెనక్కి తిప్పేందుకు 'క్రేను'లాంటిదున్నా బావుంటిపోను ఈ వెధవ దున్నపోతు కోసం అంతంత పరికరాల్ని ఎక్కడ తెస్తేడు?....ఇది వెధవ దున్నపోతా?

...తను అనవసరంగా దాన్నిహీనంగా చూసేస్తున్నాడు. ఇది చాలామంది మనుష్యులకన్నా నయం—తన దృష్టిలో అలా అని తెలిసినా, తనకి దానిమీదవున్న అలసభావం కొద్దీ, అది తన సహాయం మీద ఆధారపడబట్టి,—అనేస్తున్నాడు. అది పరాన్నజీవులయిన ఎందురో మానవులకన్నా నయమే! ఎంతోమంది హానిచేసేవారికన్నా. ఎంతోమంది వృట్టినే జీవితాన్ని వెళ్ళబుచ్చే అప్రయోజకులకన్నా. మోసపు బ్రతుకులవాళ్ళకన్నా. — మంచిది...తనకి మాత్రం అది. తన ప్రజలెంతో అంత కష్టపడి జీవించే వ్యక్తిలాంటిదే దున్నపోతు. అందుకే 'దున్నపోతులా కష్టించి పనిచేస్తాడు' అన్నపేరు వచ్చింది. కాని. దీని తలలో వున్న మెదడుకే ముడుతలులేవు. అందుకు కూడా ఇది పేరు పడ్డది.

బ్రహ్మన్న మొండితనంకంటే. తన మూర్ఖత తీసిపోయిందా?. సమానం!?! అతన్ని తనవేపు తిప్పకునేందుకు. తన కనుకూలంగా చేసుకునేందుకు తనెంత శ్రమపడ్డాడు! స్థానికంగా బ్రహ్మన్నకి ముఠాల్లో పేరువుంది, తనకి పెత్తనం కావాలనీ. ఆ పెత్తనాన్ని-పుచ్చుకుని, నల్లమీసాల్ని మెలేసుకుంటూ. ఉట్టినే అరుగులమీద కూర్చుని గడపాలనే తత్త్వం బ్రహ్మన్నది, ఎప్పుడో తన ముత్తాతల నాటి కథల్లో వూరినాయకుడిలా వుండాలని. కాని; ఈనాటి ప్రపంచంలో

నిన్నటికీ. నేటికీ, రేపటికీ.—ము త్తాతలయుగంలో వందయేళ్ళ మార్పు సునాయాసంగా జరిగిపోతోంది. అది తెలవడంలేదు బ్రహ్మన్నకి తనకీ తన ముతా పెద్దలకీ ఎవరూ ఎదురు చెప్పరాదని.... బలవంతమయిన చీమలయిపోయారు వాళ్ళంతా....తను చీలగొట్టి, వొక్కడొక్కడినీ హింసపెట్టి, ఆ తర్వాత తనకిందికి తెచ్చుకున్నాడు వాళ్ళని. ఇంకా ఎన్నెన్ని రకాల వ్యూహాల్ని పన్నాడు తను!....దీన్ని ఎలాగయినా సరే కుడివేపుకే తిప్పాలి....ఈ కాలిని చూడు బాగా తిన్నట్టు వుంది...మట్టిరావడంలేదు. కాలికి బాగా అంటగట్టుకు పోయింది. పోనీ దీన్ని వెనక్కి నడిపి స్తే!

—మహమ్మదు ప్రవక్త ఒకరోజున తన అనుయాయు ల్నందర్నీ వెంట బెట్టుకుని, ఒక పర్వతం దగ్గరికెళ్ళి,—

"రా—దగ్గరికి" అన్నాడట.

మహాత్ముడు మహమ్మదు ఆజ్ఞకి తలవొంచి అది కదలిరాక పోవడం- అతని శిష్యుల్ని ఆశ్చర్య చకితుల్ని చేసింది. దాంతో ఆయన అన్నాడట అందరివేపూ తిరిగి.—

"అదే దేవుడికీ, మానవుడికీ వున్న తేడా. ఇదే దేవుడాజ్ఞా పి స్తే ఈ పర్వతం కదిలి పరుగె త్తి వచ్చేది. కాని మానవుని ఆజ్ఞకు కదల్లేదు చూశారా! అంచేత దేవుడి ఆజ్ఞ మన మాటకన్నా గొప్పది అంచేతే ఆ విశ్వమూర్తికి మనం సాగిలపడాలి....

"....ఆ పర్వతం మన దగ్గరికి రాలేదు. పోనీ మనమే దాని దగ్గరి కెళదాం" అన్నాడు.

అలాగే దున్నపోతుని వెనక్కి నడిపి స్తే దీన్ని వెనక్కి తిప్పడం మాత్రం అసాధ్యం. వెనక్కి నడుస్తుందా? ముందు కాళ్ళ చుట్టూ కూడా మట్టి పెకలించి, వెనక్కి గెంతి స్తే? తన వుపాయం బాగుంది. కాని. దున్నపోతుకి అర్థమవుతుందా తన వుపాయంతను చెప్పినట్టువినడా! కీ. అలా చెయ్యడానికి యిది మనిషి కాదు. కనీసం అభినయించి చెప్పినా అర్థం చేసుకునే శ క్తి లేదు...ఇదిజంతువు... ఎలాగ?

అతను దాని రెండు వెనక కాళ్ళనూ వూబిలోంచి వేరు

చేశాడు. దుంగను అనరాగా చేసుకుని, కుడిపక్కగా వూబిలో కాలు దూర్చాడు. దున్నపోతుకి పక్కగా నిలబడి, వంగి, ముందుకాళ్ళ చుట్టూ మట్టిని లాగాలని. అతని గోళ్ళు నొప్పులు పుట్టాయి. మట్టి పై భాగమంతా ఎండిపోయి వుంది. గోళ్ళలో మట్టి దూరి, గోళ్ళకింద సున్నితమైన చర్మం రేగి, నొప్పిగా వున్నాయి వేళ్ళ మొనలు. అర చేతిలో వుండు. జ్ఞాపకం వచ్చి మండింది. గుర గరలాడింది.

దున్నపోతు మెడని అతను వంచిన నెత్తి మీద వాల్చ బోయింది. 'ఎహేవ్' అని అతను కంగారు పడుతూ చేతులెత్తి తన తల మీదుగా విదులించాడు. అది తల అటు తిప్పుకుంది. మళ్ళీ వెంటనే తెచ్చి, అతని తల మీద పెట్టబోయింది. దాని పాచిపోయిన రొచ్చు కంపు వానన.

అతను—'బాదేస్తా! తెలిసా!' అన్నాడు.

తలను ఎత్తి కోపంగా దాని వంక చూశాడు. మళ్ళీ అది తల అటువేపు తిప్పింది.

"ఇది నాతో సరసమాడుతూంది." అన్నాడు అతను ఎవళ్ళ తోనో చెపుతున్నట్టు, దాని వానన భరించలేక. 'రోత' అని. 'ధూత్' అంటూ వుమ్మాడు. అప్పు దప్పుడూ వుంది. తలని వంచినప్పుడు, తన చంకల్లో చెమట వానన, తనకే వెగటు కలిగిస్తోంది.

కుడి ముందుకాలు చుట్టూ చేతిని తిప్పుతూ, గిట్టవరకూమట్టిని తీశాడు. ఇప్పుడు చూస్తే పొడవాటి సోలలో దాని కాలును దూర్చి నట్టు వుంది. ఎడమ కాలి వైపు పోవడానికి అతనికి అమితమైన భయం వేస్తోంది. దాని ముందు వున్న దొన్నెని అవతలికి నెట్టాడు రాఘవులు. దుంగను బలంగా దాని కాలి పక్కగా, నిలువుగా దింపాడు—సాధ్యమైనంత తిన్నగా. గజం లోతు పోయింది. అడు గున గట్టిగా రాయి తగిలింది....

"పడినా మంచి చోటే పట్టుబడ్డావు" అన్నాడు దానిముందుకు జరుగుతూ.

...కాలు వేస్తే మోకాలు వరకూ దిగింది. దుంగను లాగి తన వెనక వేపు గుచ్చి, దాన్ని ఆనుగా చేసుకుని, దాని ఎడం కాలిని బయట పడేస్తున్నాడు...తీస్తున్నాడు.

...ఇది ఏమాలోచిస్తోంటుంది? ఇందాక తను విదిలించుకున్న తర్వాత. తిరిగి గొడవ పెట్టడం లేదు. మనసులో చిన్న ఋచ్చునని వుంటుంది. వీడు తనని అర్థం చేసుకోలేవడం లేదనుకుంటుంది. తన ఆప్యాయతా, విశ్వాసము వీడి ముందు వృథా అయిపోయాయనుకుంటుంది... మళ్ళీ దీనికో ఆప్యాయతా, విశ్వాసమూ కూడానా....దున్నపోతు!...విష్కారణంగా తన ప్రాణం పోను... ఏమో .... దాని మెదడులో సున్నితమైన భాగం ఈ క్షణంలో మేలుకోవచ్చును గదా! అటువంటప్పుడు మనుష్యుడిగా తనని చూసి. మానవులంతా యింతే....తెలివి తక్కువ వాళ్ళు అనుకుంటుందేమో! మహా మంచివాడిని తన భార్య రంకు రాక్షసుడిగా తయారు చేసినట్టు దున్నపోతులో ఇన్ని రోజుల బయటికి పోవాలన్న పెనుగులాట చిట్ట చివరకి ఈ సున్నిత భావాన్ని ఎందుకు కలిగించ కూడదు?.... ఏదో ఒకటి అనుకోనియ్యి....దీన్ని బయటికి తియ్యడం తనబాధ్యత. ఏ జీవి చిక్కులో వుండి తనకి కనిపించినా, తన సమర్థతనీ, తన ఆశయాల్నీ సవాలు చేస్తున్నట్టు. అంతే.

అతను బాగా వెడల్పుగా ఎడమ కాలు చుట్టూ చొటు చేశాడు. దున్నపోతుని పక్కలకి తిరగనివ్వకుండా. వెనక్కి కొడితేనే బావుంటుందని పించింది. ఒకవేళ అది వెనక్కి గెంతితే—మళ్ళీ ముందు కాళ్ళు దాని పొట్టకింది వూబిలో పడి. వాటిని పెకలించవల్సిన పని తగులుతుంది. అప్పుడు యింకోసారి తను వాటి చుట్టూ వున్న మట్టిని లాగాలి....

—దీన్ని వెనక్కి కొట్టాలి

. చుట్టూ చూశాడు తీగల కోసం-దాన్నెకి ముందుసారి తను కట్టుకు వచ్చిన యెలమంద తీగల కోసం. గడ్డిని కెలికితే, వూబి కంటుకుపోయి వున్నాయి—చిత చితల్లో. వీటిని మడిచి గజం బారుగా పట్టుకున్నాడు. అతను దున్నపోతుని. దాని స్వేచ్ఛకి తగు తయత్తతలో వుంచాలఃపించిదిది. ఆశేష ప్రజని ముందుకు నెట్టి. రథం మీద తను ఎక్కి, కొరడా పుచ్చుకుని వాళ్ళందర్నీ బాదుతూ వాళ్ళ గమ్యాన్ని చేరేలా చేస్తున్నట్టు మనసులో వూహించుకున్నాడు.

దున్నపోతుని తుఫాను రాక్షసుడిలాగా, అట్లాసులాగా, చచ్చిపోతున్న కీచకుడి అరుపులాగా, పిడుగుపాటులాగా—అదిలించాలన్న ప్రయత్నంలో వున్న రాఘవులు. అతను గట్టిగా దగ్గి, సకిలించాడు ఉపక్రమణికగా.

దున్నపోతు అతని వంక అర్థం కానట్టు చూసింది. పక్కలకి చూసింది తెలియక. అతను దాని తలను వెనక్కి నెట్టుతూ, పెద్దగా అన్నాడు 'హేయ్...హేయ్!' అది కదల లేదు.

"కదలవా?" అన్నాడు.

అతనికి ఎలక్షన్‌లలో కొట్లాటలు జ్ఞాపకం వచ్చాయి. అభ్యర్థులు నవ్వుకుంటూనే వుంటారు. కాని, అభ్యర్థుల అనుయాయులూ, అభిమానులూ దెబ్బలాడుకుంటూంటారు.

"ప్రజలు!!" అనుకున్నాడు అతను.

అతను ఎంతగా అరచినా, దానికి అతని గొంతులో కఠినత్వం ఏమాత్రం తెలిసినట్టు లేదు. అతని సంకేతం అది అర్థంగాక చూస్తూంది. పైన అడుక్కుంటున్న బిచ్చగాడు, వోటు అడుక్కుంటున్నవాడు వచ్చి భిక్ష అడిగితే, తెల్లబోయి చూసినట్టు.

మట్టి అతుక్కుపోయిన దాని కాళ్ళు, కదలిక లేకుండా, విటారుగా, కర్రల్లాగా నిల్చుని వున్నాయి. దానికింకా వూబిలో వున్నట్టే వున్నవా కాళ్ళు దాని కాళ్ళల్లో స్పర్శ చచ్చింది. అతనికి వోపిక చచ్చింది, కళ్ళు ఎర్రబడి పోతున్నాయి. అతనిలో నీరసం అంతా కోపంగా మారింది. తొందరగా దాన్ని బయటికి తీసి, తన కర్తవ్యాన్ని తను పూర్తిచేసి అక్కడి నుంచి పోవాలని...అతను..

చేతిలో వున్న ఆరు తీగల్ని గిరగిరా తన తల మీదుగా తిప్పి, దాని తల పక్కగా "ఛెళ్ళు" మనిపించాడు గాలిలో. అది అరిచింది ఎవళ్ళతోనో చెప్పుకుంటున్నట్టు. కళ్ళు దెబ్బ భయంతో మూసింది. ముసలితనాన్ని చూపింది జడత్వాన్ని తెచ్చుకుంది. మంకు పట్టు పట్టింది. మళ్ళీ రాఘవులు గాలిలో "ఛెళ్ళు" మనిపించాడు తీగల్ని. తిడుతున్నాడు దున్నపోతుని—అదితొందరగా కదలడంలేదని అతనికి ఆతృత బాగా హెచ్చింది, సూర్యుడి పాలిపోతున్న వెలుగు

ఆఖరి దశలో వున్నట్టని పించిందతనికి. చలి పెరుగుతోందప్పుడే. చల్లబడి పోతోంది నెత్తి మీద. వూబి చల్లబడుతోంది. గాలి చల్లగా వేస్తోంది. మర్రిచెట్టు పైభాగం మీదికి చిన్న చిన్న సూర్యకిరణాలు పడుతున్నాయి. అడవి మధ్య. లోతునేలలో వుండటం మూలాన, తనను చీకటి కమ్ముకుంటోంది. తెల్లగా ఆకాశం మీద మబ్బులు. దోరగా వున్న పడమటి కాంతిలో అవి రక రకాల రూపాలుగా మారుతున్నాయి. ఇంకెంతోసేపు ఎండ పడదనితోస్తోంది రాఘవులికి. మనుష్యులు పగటికి అలవాటు పడ్డవాళ్ళు. తనీ కానిచోట పొద్దుపోయే ప్పుడు వుండకూడదనిపించింది. పక్కన చేతి దూరంలో వున్న తాటాకు దొన్నె తీసుకుని, దున్నపోతుని పెడబొబ్బల్తో అదిలిస్తూ, దొన్నె మీద 'ఛాత్' మనిపించాడు తీగల్తో. దున్నపోతు కంగారు పడి, తలని విసురుగా కదిపింది. కాళ్ళని సగం సగం పైకెత్తింది. కాళ్ళు ముడుచుకోవడం లేదు దానికి. అతను వెనక్కి విరగబడ్డాడు. దాని తల విసురుకి ముఖం బద్దలయిపోయి వుండేదనిపించింది. అమిత మయిన కోపం వచ్చింది రాఘవులికి. బూతులు తిడుతూ, చేతి బలం కొద్ది తీగల్ని త్రిప్పి, 'ఛెళ్ళు...ఛెళ్ళు' మని దాని ముఖం మీద రాతిని బాదినట్టు, బాదాడు. అతని అరుపులు కాలవలో ప్రతిధ్వనిస్తు న్నాయి. ఒక్కసారిగా రౌద్రమూర్తి అయ్యాడతను.

"అంబా" అని అరిచింది దున్నపోతు. దాని నోరు వాసన వేసింది. అది కళ్ళు మూసుకుంది. తలను దెబ్బనుంచి తప్పించు కునేందుకు పక్కలకీ, పైకీ విసురుతోంది...రాఘవులు వూబిలో, అడుగు వెనక్కి వేస్తూ, తీగల్ని తిప్పుతున్నాడు. బయట మైదానంలో ఏనుగు ముందు నిలబడినంత భీరుత్వాన్ని పొందుతున్నాడతను. జువ్వు జువ్వుమని తీగలు గాలిలో తిరుగుతున్నాయి ...

ఒక పెద్ద నల్లరాయి గాలిలోకి ఎగిరినట్టనిపించింది రాఘవులికి. అతను అనుకున్నట్టు, దాని వెనక కాళ్ళు వాటులోకి పడ్డాయి. ముందు కాళ్ళు దాని పొట్ట కింద వూబిలోకి దిగాయి. కండువా ఎగిరి దాని కాళ్ళ కిందా, పొట్టకిందా చిక్కడి పోయింది.

"పోతే పోనియ్..." అన్నాడు "....కాని వెనక్కి బాగానే గెంతింది" అనుకున్నాడు తృప్తిగా.

రాఘవులికి దాని కాళ్ళ చుట్టూ వూబిని తవ్వాలని లేదు. అదొక విశ్వప్రయత్నం ఆవుతుంది యిప్పుడు. కాలం కలిసిరాదు. ఎలాగూ దున్నపోతు కొంచెం బలాన్ని తెచ్చుకుంది. దాని మంచి కోసం దానితో పోరాడడమే ఉత్తమం ఈ క్షణం—అనిపించింది. దాన్ని రక్షించడమే కాక, తన బాగు కూడా చూసుకోవాలి. తొందరగా తనీ ప్రదేశంలోంచి కదిలిపోవాలి.

అతను దాని మధ్య నుంచి, రెండు కాళ్ళ మధ్య, బోర కిందుగా, పొట్ట కిందికి దుంగను సర్ది, తోసి; 'ఏహె హే' అన్నాడు. మళ్ళీ తీగతో చేతికొచ్చినట్టు బాదాడు. శక్తికొద్దీ బాదుతున్నాడు. అతని చేతిలో పుండు బాగా నలిగి, అరచేతినుంచి రక్తం కారుతోంది. దున్నపోతు మోర ఎత్తి, బాధగా అరుస్తోంది. అది కదలడం లేదు. కదల లేని స్థితి. అమానుషంగా ముందు కొట్టిన నాలుగు దెబ్బలు తగిలి, దాని మూతి వుబ్బింది.

"నువ్వు కాదు...నీ బాబు వింటాడు నే చెప్పినట్టు. నేను రాఘవయ్యని—మొగుళ్ళకి మొగుణ్ని" అన్నాడు రాఘవులు; గట్టిగా శ్వాసించాడు.

బలంగా దాని మూపు మీద పెట్టు కొట్టాడు రాఘవులు. గుర్రుమని వినిపించిందతనికి. దున్నపోతు శరీరాన్నంతా. కండరాలన్నింటినీ స్వాధీనంలోకి తెచ్చుకుని,—వాలులోకి దూకింది.

దానిముక్కు వెంట రక్తం కారుతోంది. చుక్కలు చుక్కలుగా రక్తం. అది నిలబడలేక పోతోంది. పదిమందిచేత చెరబడ్డ ఆడదానిలావుంది. తన అవినీతి బాహాటంగా బయటపడ్డ మంత్రిలా వుంది. తనకి భయపడుతోంది—అది.ఎర్రగా చూస్తోందది.దాని కళ్ళు బెదురుగా వున్నాయి. దానిగిట్టలు వాలులో, వూబిలో కొంచెంకొంచెం దిగబడ్డాయి. వాలు వైశాల్యం అది పట్టీపట్టనట్టుగా వుంది. అది వాలులో చతికిలపడితే పడిపోవచ్చు. అలాగ పడిపోతే, తను మాత్రం ఎంత యాతనపడినా, దాన్ని రక్షించలేడు. ఎన్ని కాసరాలు చేసినా దాన్ని బయటికి తీయడం అవదు.

"నడువ్....యెనక్కి" గర్జించాడు రాఘవులు.

తీగలు గాలిలో రివ్వుమని తిరుగుతున్నాయి. అతను ఓవేపుకు మూలని నుంచున్నాడు. దున్నపోతు బెదిరి, తనమీద పడుతుందేమో ననిపించింది. మరింత గట్టిగా గర్జించాడు రాఘవులు. అది తలని, పగబట్టినట్లు వూగించింది. పెంకెతనం స్పష్టమవుతోంది. దాని ముక్కు వెంట రక్తం కారుతోంది బొట్లుబొట్లుగా.

మళ్ళీ తీగలు 'ఛెళ్ళు' మన్నాయిదాని— కొమ్ములమీద. దాని ముందు, దుంగకదుల్తోంది, తలమీద పడటానికి రాఘవులు దాన్ని కదిలించి బాగా ప్రక్కకి తోసేశాడు. అది మళ్ళీ ఎగిరింది-వెనక్కి. వెంటనే మళ్ళీ 'ఛెళ్ళు' మన్నాయి తీగలు గాలిలో, అది వెనక్కి ఎగురుతోంది.

....అది నిజంగా తను చెప్పినట్టు చేస్తోంది. తన మాటల్ని. ఆలోచనల్ని అర్థం చేసుకున్న మానవాకారంలాగా. తను దున్నపోతుని నడిపిస్తున్నాడు!

....దానికష్టం, తనకష్టం కన్నా ఏమంత ఎక్కువయింది కాదనిపించింది రాఘవులికి. నిర్దాక్షిణ్యంగా మళ్ళీ, రక్తం కారుతున్న ముఖంమీద, కొట్టాడు. అది అరుస్తూనేవుంది....దాని అరుపులు శపిస్తున్నటు ఆకలితో అలమటించి చచ్చిపోతూ, బాధలతో క్రుంగి చచ్చిపోతూ, బికారి మనుష్యులు అరుస్తున్నట్టు, మూలుగుతున్నట్టు, శపిస్తున్నట్టు అది తలని తప్పించుకోబోయింది. కళ్ళు గట్టిగా మూసుకుంది. వాలులో దానికి తల తిప్పుకునేందుకు చోటులేదు. దాని కొమ్ములు అది తిన్నగా నిలబడితే, వాలు గోడలకి తగిలీ తగలకుండ వున్నాయి. అది మాత్రం కొత్తరకమైన బాధతో గుర్రుమని అరుస్తోంది.

"నిన్ను బయట పడెయ్యడానికే నిన్ను కొట్టేది....బాధించేది ....నాకేమీ సరదాకాదు....నీయమ్మ....వురుకు బయిటికి...."

వరస వరసగా గాలిలో జివ్వుమని తిరుగుతూ 'చెళ్ళు' మంటున్నాయి తీగలు—కొరడా దెబ్బల్లాగ.

"నీకు గడ్డికోసి, తెచ్చి, వేశాను. నీళ్ళుపెట్టాను....నీవొళ్ళు చల్లబరిచాను...నీకుపట్టిన జెలగల్ని వదిలించాను. నిన్ను ఎలాగ

యినా బయటికి లాగాలని చూస్తున్నాను....''అతను ఆవేశంతో అంటున్నాడు. మరో చేతితో లావాటి దుంగను మోసుకొస్తున్నాడు.

....మరో బారెడు, బారెడే. బారెడులో దున్నపోతు వొడ్డుకి చేరుతుంది. అది వూగులాడుతోంది—నిలబడలేక. రాఘవులికి దాని స్థితిని చూసి జంకు కలిగింది. మొదట్లో వున్నంత వికృష్టస్థితికి వచ్చిందిప్పుడు. చివర్న. అంత ఎత్తుగా వున్నచోట. వెనకవించి ఎక్కలేదు. ఒకవేళ తనుగట్టిగా బాదితే వంగని కాళ్ళని విరగ్గొట్టుకుంటుంది. అది ఎక్కేచివర్న. ఏటవాలుగా మట్టిపొయ్యాల్సింది—అనుకున్నాడు.

....తను బయటికి వెళ్ళడానికికూడా దారిలేదు.

—అతను వెనక్కి తిరిగిచూశాడు. దున్నపోతు అప్పటివరకూ నిలబడ్డచోట పిమ్మెంటు చేసినట్టు నున్నగా వుంది. అది అక్కడ లేకపోవడం—హిందూ దేవాలయాల మంటపాల మీద నందిని తీసేస్తే వున్నట్టు, సమాధులమీద బొమ్మల్ని తీస్తే వున్నట్టు వుంది. వెలితిగా వుంది. ముఖ్యమైన చిత్రంలో, అతిముఖ్యమైన రంగును వదిలేసినట్టు.

—అతనుపైకి చూశాడు. చందమామ వెలుగు బాగా వచ్చేస్తూంది. ఇంకా రాత్రి రాకపోయినా, చందమామ బాగా పెందరాలే వెన్నెల ప్రచారాలు మొదలు పెట్టాడు. దున్నపోతు నలుపుని వెక్కిరించే, తెల్లటి వెన్నెల, కోట్ల నక్షత్రాల మధ్య చంద్రుడు, అశేష ప్రజానీకం మధ్య రాఘవయ్య అతనికలా అనుకుంటే తృప్తి అయింది.

—తను బయటికి వెళ్ళడం ఎలాగ? ఎలాగ? ఎలాగ?

....పక్కన వూబిమీద ఎక్కివెళితే, మళ్ళీ దిగబడతాడు తను. అదొక ఆలస్యం, పొద్దుపోతుంది, వెన్నెలనీడ, అప్పుడే పడుతోంది. ఎలాగ?.... ఏమీ తోచడంలేదు...తన తలలో ఉపాయాలు ఇంత తక్కువయాయా? ఏమయితే అవనీ. ఈ దుంగని ఆసరాచేసుకుని—అని.

అతను వాలు పక్కగా పేర్చిన మండల గోడమీదికెక్కి, నడిచి,

బయటికి వచ్చేశాడు.

తూలాడు. వూబిలో కాలు ఇరుక్కుంది. లాక్కున్నాడు. బయటికి చేరాడు.

తాటి మట్టను పుచ్చుకుని,—

దూర దూరంగా ఇసకను, వాలులోకి జారుస్తున్నాడు. కూచుని చేతుల్తో తోస్తున్నాడు. రక్తం కారుతున్న చోట మెత్తటి దుమ్ము అంటి, కట్టడింది.

అతని ఆలోచనలు — ఇంటివేపు.

దున్నపోతు ఎక్కువగా మూలుగుతున్నట్టు వినిపించిందతనికి. తను కొట్టిన దెబ్బలకి చచ్చిపోతుందేమో ననిపించింది...ఊబిలో నుంచి పైకితెచ్చి, ఓట్ట చివరకి తను చంపితే మాత్రం ప్రయోజన మేమిటి? తను అన్ని దెబ్బలు అంతగా కొట్టకుండా వుండాల్సింది. తాతిని కొట్టినట్టు కొట్టాడు. ఆ బలం ఉపయోగించి, గొడ్డలి పుచ్చు కుని పుల్లలు నరికితే, బండిపుల్లలు నరికేవాడు....పాపం!....

"ఏయ్యా...ఎయ్యా" అన్నాడు.

అది బదులు పలుకుతుందనుకున్నాడు.

మళ్ళీ అన్నాడు అతను.

"అంబా" అన్నట్టు అంది అది. ఏదో తల్చుకుంటూ ఏడుస్తు న్నట్టు అనిపించింది రాఘవులికి. దున్నపోతు దీనమైన మూలుగు అతను వినలేకుండా వున్నాడు.

చాల ఇసకను నెట్టాననిపించి, రాఘవులు లేచి నిలబడ్డాడు. తనచుట్టూ. కాలవ హద్దులవరకూ, అంతా పరీక్షగా చూశాడు. ఎక్కడా ఏమీ కదలడంలేదు. తనొక్కడే ఇక్కడ —అనిపించింది. దున్నపోతుని బయటికి నెట్టేసి, తనూ తొందరగా ఇక్కడి నుంచి పోవాలనిపించింది—మళ్ళీ మళ్ళీ.

వొడ్డునవేసిన పొడవాటి దుంగని తీసుకుని, కంపమీదుగా, జారిపోతూ, సర్దుకుంటూ నడిచి,

వాలులోకి, దున్నపోతు పక్కగా, ముందుకి దూకాడు— మెల్లగా.

....ఎముకలు జ్ఞాపకం వచ్చాయి.

దున్నపోతు తలవేలేసింది. అతను దాని మూతిని స్పృశిం చాడు. చేతికి రక్తం వెచ్చగా తగిలింది. కంగారు పడ్డాడు. సమూదా యించుకున్నాడు. దానిమీదికి వంగి, దాని ముచ్చెనగుంటలో ముద్దు పెట్టుకున్నాడు. అతని మూతికి తెల్లటి పొట్టు అంటింది. మనుష్యుల తలలో చంద్రులాంటిది. చేత్తో మూతిని తుడుచుకున్నాడు, వూశాడు. పీదుకున్నాడు, దాని తలనిమిరాడు. ఆయాసంతో దాని డొక్కలు లేచి పడుతున్నాయి. అది రొప్పుతోంది. అతను దాని శరీరాన్ని నిమురు తోంటే, అది మూలుగుతూ చెవుల్ని ఆడించింది.

"నడు" అని కేకేశాడు అకస్మాత్తుగా.

"మార్చ్" అని యుద్ధరంగంలో తయారుగా లేని సైనికుల్ని హెచ్చరించినట్టు.

అది బాగా చెదిరిపోయింది. శరీరాన్ని స్వాధీనంలోకి తెచ్చు కునేందుకు చర్మాన్ని కదిలించింది.

అది తలయెత్తింది. కొంతవరకే పూర్తిగా ఎత్తలేకపోయింది. పెళ్ళిలో వుండి వుండి ఒక్కసారి బాజాభజంత్రీలు అందుకున్నట్టు. అతని చేతిలో తీగలు గిర్రుమని తిరుగుతున్నాయి—దానిముందు.

అది మొండికేసింది. దాని ముక్కువెంట పడుతున్న రక్తపు బొట్టు వాలులో ఎర్రగా వూటలో కలిసి పాకుతున్నాయి. అతని పాదాల కిందికి ఆ ఎర్రదనం వస్తోంది.

అతను, తీగల్ని ఎంత శబ్దం వచ్చేలా తిప్పినా, అది కదలడం లేదు. ఉండి వుండి కళ్ళు మూస్తూంది. తలనికూడా కదిపేస్థితిలో లేదది....సత్యాగ్రహం జ్ఞాపకానికొచ్చిందతనికి. చెడిపోయి, వూరు లేనిచోట ఆగిపోయిన స్టేట్ బస్ జ్ఞాపకం వచ్చింది. ప్రభుత్వంలో జడత్వం జ్ఞాపకం వచ్చింది. లంచంతినే వాడి టేబిలుమీది ఫైలు జ్ఞాప కాని కొచ్చింది.

—అతనికి కోపం వచ్చింది. జాలివేసింది. కర్తవ్యం ఎదుట నిలబడింది.

అడవిలో నక్కలు అరుస్తున్నాయి. గుంపులుగా, గోలగా

అరుస్తున్నాయి. కీచురాళ్ళ ఉమ్మడిగా గోల. ఇంకా వేటి వేటివో అరుపులు. పక్షులు. రాత్రవుతున్న మూలాన హడావిడి పడుతున్న ప్రాణికోటి. ప్రతిసారి రాత్రయేప్పుడూ. ఇదంతా కొత్తగా కనపడు తుందేమో వాటికి. ప్రతిరాత్రీ వాటికొక పండుగేమో। జంతువులికి రాత్రంటే ఎక్కువ ఇష్టం. జంతువులన్నీ వొకటి...మనుష్యు డొక్కడే వొకటి. మనుష్యుడు వాటన్నింటి మధ్యనుంచీ పారిపోయి వచ్చి. పిరికిగా. తన బుద్ధి శక్తి కొద్దీ బ్రతుకుతున్నాడు....ఇది రాముడు వాలిని చంపడంలో వ్యక్తమవుతుంది. బలమైన వాలిని రాముడు ముఖాముఖీ పోరాడి చంపలేక. చాటునించి బాణాన్ని ప్రయో గించి చంపాడు. అప్పట్నుంచీ అటువంటి బాణాలో. తుపాకులో. ఏవేవో ఉపయోగించుకుంటున్నాడు. మనుష్యుడు. జంతువిరోధి. మనుష్యుడు. రాత్రవుతోందంటే అలవాటు లేనిచోట బ్రతకడానికి. మరీ భయపడతాడు.

"....ఇది ఇక్కడే ఇలా వుండిపోవాలనుకుంటూందా?" అనుకున్నాడు కపిగా రాఘవులు.

ఇంకా చావుగాడు వూబికి అటువేపు కూర్చుని. ఈ పెనుగు లాటని ఆఖరి నిముషంలో. వోరగా. వొంటికన్నుతో చూస్తూ ఆనం దిస్తున్నట్టు.—అతనికి అనిపించింది. ఏమయినా ఇది తొందరగా బయటికి రావాలి....బ్రతకాలి...చేతిలో తిరుగుతున్న తీగలు. దాని వీపుమీద పడ్డాయి—అతని అరుపుల్తోనూ. ఆర్భాటంతోనూ. బాధను వోర్చుకోలేక వణికిం దది....దున్నపోతు. అతన్ని పడదోసుకు ముం దుకు రాబోయింది. వెంటనే రాఘవులు. అదర్దాగా. చేతిలో తీగల్ని వదలి. రెండు చేతుల్తోనూ. తన చేతిలో దుంగతో దాని కొమ్ముల్ని బలంగా వెనక్కి తోశాడు. అది తలవంచి ముందుకొచ్చేందుకు ఎదురు తిరిగింది—రైలింజనులాగా. అతను దున్నపోతు కింద నలిగి పోయేందుకు సిద్ధంగాలేడు. అతనిలో నీరసం పూర్తిగా కపిగా మారింది. అదుపు తప్పుతున్న దున్నపోతుని దారిలో పెట్టాలి. దున్న పోతు గొర్రె పొట్టేలులాగా టాకీవేసింది—దుంగకి వెనక్కి జరి గింది. ఇక మీదుగా. తను పొర్లించిన వాలులో కాళ్ళవేస్తూ. ఎగురు

తోంది. అదలా ఎగురుతుందన్న ఆలోచన వచ్చే ఆలా చేశాడు. లేదా. తనమీదపడి తొక్కేస్తుంది. జంతువు! అయితే అది బలమైన దున్నపోతు అవటం మూలాన ఈ మాత్రమయినా కదలగలిగింది. ఇక్కచిక్కినదయితే తను కదపగలిగేవాడు కాదేమో! దాని శ్వాసా రక్త ప్రసరణం పోటీ పడుతూంటే దున్నపోతు వూగులాడుతోంది. దాని వొళ్ళంతా, తెల్లగా, సున్నంపూసినట్టు వుంది—చౌడు అంటుకుని. కాళ్ళమట్టితో చేసినట్టు—తడిగా. అదిగింజుకుని. వెనక్కి గెంతి కాలవలోకి వెళ్ళింది....

"హమ్మయ్య!" అతను ఆ పిడుగుపాటులాంటి కదలికను చూస్తూ, వెనక్కి విరగబడుతూ, మహాశ్చర్యంతో అన్నాడు.

....తనకి విజయం లభించింది. ఈరోజు యుద్ధభూమిలో యముడు పరారయినాడు. అతని వాహనం—దున్నపోతు, మనుష్యుడి సాయంతో అతన్నే ఎదిర్చి బయటపడింది. శత్రువుల మూకల్నీ యమకింకరుల్నీ. తనచేత సున్న తీగల్తో చావబాదాడు. దేవకన్యలు దున్నపోతుని అదృశ్యరూపాల్తో హెచ్చరించి నడిపాయి. విజయం తనది. అఖండ భారతావనిని. ప్రజావీకాన్ని గెల్చినంత సంతోషం ఒక కావి పనిని పూని ఫలవంతం చేసినట్టు. ఎత్తయిన శిఖరాన్ని గుంజి. వంచి. మెలిదిప్పినట్టు. ఆహాహా...దున్నపోతు! ....రాఘవులు అలానే నిలబడిపోయి. నోరు తెరిచి, విజయగర్వంతో పురాణ కాలపు మల్లుడు అరచినట్టు—గట్టిగా అరిచాడు. ఆ అరుపు తేలికగా మూడు ఫర్లాంగులదూరం వినిపించాలి. యాభై సెకనులు సైరనులా మోగి, ఆగిందది.

ఆయాసంగా వూపిరి పీల్చుకున్నాడు. దున్నపోతు ఇంకా తనని దిక్కరిస్తూ నిలబడివుంది, పోటీపడే వుద్దేశ్యంలో వున్నట్టు తలవిల్చి.

అతను నిలబడ్డాడు....నిలబడ్డాడు.... చూశాడు.... చూశాడు.

అతను వాలులోకి వెనక్కి పరుగెత్తికెళ్ళి, దొన్నె అందుకున్నాడు. దున్నపోతు తొక్కేసిన, మోటుగా చివిగిన పల్చటి కందువాను తీసుకున్నాడు. సరాసరి కాలువలోకి పరుగెత్తాడు.

...ఇప్పటికి తను దున్నపోతును వూబిలోంచి తీయగలిగాడు. దాన్ని బయటకి చేర్చాడు. ఇప్పుడు ఆ నలిగిపోయిన ప్రాణాన్ని

హరించి పోకుండా కాపాడాలి. దాని ముక్కువెంట బొట్టు బొట్టుగా రక్తపు చుక్కలు పడుతూనే వున్నాయి.

అతను దొన్నెలో కందువాను మడతలుగా పెట్టి—పరిచేసి. దాని నిండా నీళ్ళుపట్టి తెచ్చేందుకు ముందుకువురికాడు. వుండి వుండి తూలిపడేందుకు సిద్ధంగావున్న దున్నపోతువంక. బెదురుబెదురుగా చూస్తున్నాడు. అతని వొళ్ళు గురగురలాడుతోంది. చిమచిమలాడుతోంది. దొన్నెని కాలువలోపెట్టి. దోసిళ్ళతో నింపుకున్నాడు. చల్లబడి పోయాయి నీళ్ళు. అతను దున్న స్థితిని. దొన్నెలో నీళ్ళు నింపుతూ. చూస్తోంటే కంగారు పుడుతోంది. బ్రతుకుతుందో లేదో అన్న అధైర్యం కలగనారంభించింది.

....దొన్నెను పుచ్చుకుని పరిగెత్తి దున్నపోతు దగ్గరికి చేరాడతను. తోచక. దాని ముఖంమీదా. తలమీదా దాన్ని బోర్లించాడు.

...రాఘవులు మళ్ళీ నీళ్ళల్లోకి పరిగెత్తాడు.

... మళ్ళీ దొన్నెనిండా నీళ్ళు పట్టాడు—లోపలి కందువాను బాగా సర్ది.

....దాంట్లోంచి నీళ్ళు కారిపోవడంలేదు.

....దున్నకి పక్కగా నిలబడి. దొన్నె కిందపెట్టి. పక్కలకి వొరిగి పోకుండా కాళ్ళమధ్య పట్టి దోసిటితో దున్న తలమీద నీళ్ళు జల్లుతున్నాడు.

...దున్నపోతు చచ్చిపోవడంలేదు. కాని అతనికి ఇంకా చావు గాడు ఆ చుట్టుపక్కలే కని పెట్టుకూర్చున్నట్టుఅనుమానం.

రాఘవులు బురదగా వున్న కందువాని దొన్నెలోంచి తీసి. దున్న చెవుల్లో నీళ్ళు పిండాడు. అది వూగులాడుతోంది—తాగిన వాడిలాగా. జ్వరతీవ్రతలో వున్న వాడిలాగా. శివాలు పూనుతున్న వాడిలాగా దెబ్బలు తిన్న పిల్లాడు నిద్రపోతూ ‘వెక్క’ పడుతూన్నట్టు దాని శ్వాస దాని ముఖమంతాకంది వుబ్బివుంది. దాని మూపు మీద బొబ్బ తేలింది. దాన్ని చూస్తోంటే. జాలి పుట్టుకొచ్చింది... దొన్నెలో కందువా ముంచి దాని వొంటిమీద నీళ్ళు పిండుతున్నాడు. దాని ముచ్చెన గుంటమీద జల్లుతున్నాడు....అది అభ్యంతరం పెట్టడంలేదు.

బొమ్మలా; కదలకుండా. మొదటిసారి బయటికి గెంతినప్పటిలా. అలానే వుండిపోయింది...అతను కందునాను మరీ మరీ తడుపు తున్నాడు....చచ్చిపోదన్న ధైర్యం వచ్చింది. కాని కుప్ప కూలుతుం దేమోనని భయం,

అది కిందపడితే. తను తిరిగి దాన్ని లేవగొట్టలేడు. తన బాధ్యత ఇంతటితోనే అయిపోలేదు. ఇక్కడ వదిలేస్తే, ఏతోడేలుకో ఇది ఆహారమవుతుంది. దీన్ని బయటకి తీసి. వాటిని పిల్చి—దీనిని అందించినట్టు అవుతుంది. కనీసం నక్కల గుంపయినా దీన్ని బెది రించగలదు—ఇటువంటి స్థితిలో...సిరికి సమితి ప్రెసిడెంటుని బి. డి వో. లు బెదిరిస్తూంటారు, చేతకాని మంత్రుల్ని శక్రెటరీలు దబాయి స్తూంటారు. ప్రజాస్వామ్యంలో ప్రజల పాలనలో,—అధికారానికి. ఉద్యోగుల వ్యక్తిగతమైన పరపతితో కూడిన ఆడ్డంకులు:...ఏ ర క్తపింజేరో, దీన్ని రాత్రికి కాటువేస్తే:...

....దీన్ని ఎలాగయినా కాలవ వొడ్డుమీదికి ఎక్కించాలి. అక్కడ వదిలేస్తే ఫరవాలేదు. ఎలాగోలాగు అడ్డబడి పొలాలలోకి వచ్చేస్తుంది. లేకపోతే ఇక్కడే, ఇలాగే నీరసంగా ఉండిపోయి. కాలవ వొడ్డు తనంత తను ఎక్కలేక, నీరసంతో చచ్చిపోతుంది. అతను బయటికి తీసిన ప్రయోజనం వుండదు. తను ప్రయోజనంలేని పని చెయ్యడం అర్థంలేదు. అంచేత ఏమయినా సరేదీన్ని కాలవగట్టు ఎక్కించాల. ఈ పరిస్థితిలో ఇది గట్టు ఎక్కలేనిమాట నిజం. కాని. తన సాయంతో ఎక్కలేదా? ఈ వేడిమీదే దీన్ని ఎక్కించకపోతే, ఇది ఎక్కలేక నాలుగు రోజులవరకూ ఇలా ఇందులోనే వుండి పోతుంది....ముందు, దీని కాళ్ళకి పట్టిన చవుడును వదిలించాలి, కాళ్ళలో కదలికని తెప్పించాలి....ఇది ఇలా మూలుగుతూనే వుం టుంది.

అతను దొన్నెలో నీళ్ళలో కందువా తడిపి, దాన్ని, దాని కాళ్ళనీ కందువాతో పైనుంచి కిందికి జారేస్తున్నాడు. హాస్పిటల్లో దుమ్ముపట్టిన పుండును టించరు దూదితో తుడిచినట్టు—దానికి అతని సేవ, దాని పుండుమీద మట్టి పోయేట్టు కడిగేశాడు, వెన్నెల్లో పుండు ఎర్రగా వుంది. అంతగా కుళ్ళువాసన వేయడంలేదు.

—అతనికి జంతువులభయం ఎక్కువయింది.

—మళ్ళీ దొన్నె నిండా నీళ్ళు బట్టి తెచ్చాడు. దున్నమీద దోసిల్లతో తీసి చల్లాడు. కొంత నీటితో దానిపొట్ట కడిగాడు ఇలా చేస్తే—దానికి కొంత ఉపశమనం కలుగుకుందని. దాని వొంటి మీద ఆప్యాయంగా చేత్తో చరుస్తున్నాడు. కాని, ఇంకా అది వొగురు స్తూనే వుంది...దాని మూతిమీద నీళ్ళు జల్లాడు. కడిగేందుకు జంకు పడ్డాడు. రక్తం బొట్లుగా పడటంకాదు. దాని కాళ్ళమీదనీళ్ళు చల్లాడు అది కళ్ళను మూసుకుంది... మర్రిచెట్టుమీద పెద్ద చప్పుడయింది. అతను నిలబడిపోయాడు— దాన్ని ఆకళించుకునేందుకు. పగలు. తను చూసిన దొడ్డ కోతుల అల్లరి అనిపించింది.

దున్నపోతు కొయ్యబొమ్మలా నిలబడివుంది. బొమ్మ. పెద్ద గాలికి—పడిపోనా వద్దా అన్నట్టు. కాళ్ళకున్న చౌడుమట్టిపోగా. దాని కాళ్ళు గరుకు గరుకుగా వున్నాయి. వాటిని ముడుచుకొనే ఇంక ఆశ ఎంతసేపట్లోనో లేదు. అతని బనియనుమీద కూడా బురద నీళ్ళు పడి అది ఎప్పటికీ తెల్లబడదేమో అనిపించింది. చెమట వాసన ఎక్కువై పోతోంది.

— దేశంలో అందర్నీ ఇలా కష్టపడి పని చేయించాలనుకున్నా డతను. కష్టపడితేనే గాని, జీవితానికి అర్థం తెలియదు. కష్టపడి సంపా యించుకున్న పది పైసలతో తిన్న తృప్తి,—అడుక్కుతిని ఆర గించడంలోనూ దబాయించి లాక్కున్న రూపాయిలోనూ, అందరికీ చదువుకోవడం ఒక అర్హత ఎలాగయిందో కష్టపడి పనిచేయడం ఒక అర్హతగా చెయ్యాలి. ఈనాడు ప్రభుత్వం యుద్ధంలో పనిచేసి వచ్చిన వాడికెలాగ ప్రత్యేక సదుపాయాల్ని కల్పిస్తోందో, అలాగే తనసిద్ధాంతీయ పాలన వస్తే కష్టపడి సంపాయించుకుంటున్న వాడిని ముసలితనంలో పిలవనంపి, వ్యవసాయ క్షేత్రాల మేనేజరు పెద్ద రైతుగానే ఉద్యోగాలు వేయించాలనుకున్నాడు. తన దేశానికంతా పరిచయముయి. సారధ్యం వహించిన రోజున. ప్రజాస్వామ్యాన్ని వ్యవసాయ ప్రజాస్వామ్యంగా మార్చివేస్తాడు. ఇది భారత రాజ్యం కాదు. వ్యవసాయ రాజ్యం అంటాడు. ప్రపంచ రాజ్యానికి, ప్రపంచ సంస్కరణలకీ తన విదేశాంగ విధానాన్ని నమూనా చేస్తాడు...

దేశంలో అందరికీ దినసరి తిండిని కేటాయించి సంతృప్తిగా కలిగిస్తాడు. కావలసినన్ని యోగ్యతల్నీ, సుఖాల్నీ కల్పించి యిస్తాడు.

....ఎప్పటి భూసంస్కరణలు!! ఇంకా అమల్లోకి రాలేదు.... శాసనాల్లో చేసుకున్ననిక్కచ్చి, ఆచరణలో వుండదు. న్యాయమూ, ఆచరణా—ఫ్రెంచి గిలెటిన్ అవ్వాలి అప్పుడు అదీ ప్రభుత్వం, ఆ ప్రభుత్వానికి తను జోహార్లర్పిస్తాడు,... తనే అలాగ తయారు చేస్తాడు.తను రాఘవయ్య! తను నాయకుడు! తనుస్వయం ప్రతిభతో తయారయిన నాయకుడు! తనమీద ఎవరిప్రభావమూ పడలేదు. తను వొకళ్ళ అనుయాయుడు కాదు. తన సిద్ధాంతాలు! తన ఆశయాలు, నచ్చినవాళ్ళు అంతా తనవెంట వస్తారు. తిండికి మొహం వాచి! అలానే వుంటామని పాత దనానికి సాగిలపడేవాళ్ళు ఎంతమంది వుంటారు! అర్థంకానివాళ్ళూ, స్వార్థపరులూ, బద్ధకస్థులూ దూరంగా వుంటారు. తను నిర్మిస్తున్నది పిరమిడ్ వ్యవస్థ!!

—దున్నపోతు తేరుకుంటున్నట్టు వుంది. తొందరగా తేరుకుంటే బావుండను. దొన్నెలో నీళ్ళు అయిపోయాయి. ఇంతవరకూ దానిమీద పోసినవి చాలు....పొద్దుపోతోంది, ఇంకనయినా దీన్ని వొడ్డు ఎక్కించేసి, దాని ప్రాణానికి దాన్ని వదిలి, దాని వ్యక్తిత్వాన్ని దానికి వదిలేసి, తనదారిన తను పోవాలి. తండ్రి కొడుకుని పెంచి, తన బ్రతుక్కి తను వుపయోగపడేలా చేసి, వదిలేసినట్టు. ముందు దీన్ని నడిపించాలి, నడుస్తుందా? వెనక్కి నడవగలిగింది, పైకి మాత్రం ఎక్కలేదా? పైకి ఎక్కేప్పుడు పక్కకి తూలిపడిపోతుందేమో! (అతను కాలవ గట్టుకేసి చూశాడు. దున్నపోతుని. గట్టు ఎక్కిస్తూ చూశాడు. ఎక్కలేదన్న అనుమానం.) మనిషయితే మోసుకు పోను తను. పెద్ద జంతువయిపోయింది. శరీరాని కెక్కువ పని చెపుతోం దిది....తీగల్ని దీనికొమ్ములికి కట్టి లాగుతూ వెళితే వస్తుందేమో! ఇది దున్నపోతు....మడ్డిది. అలా వస్తుందా? ఇందాకా కంప మోపుని లాక్కెళ్ళినట్టు, దీన్నీ లాక్కుంటూ వొడ్డుని ఏటవాలుగా ఎక్కుతో-జాలువెంట! అదేమంచిది అంతేగాని, తను తోలితే నడవదిది. ఊరికే బాదడం తప్ప, ప్రయోజనం వుండదు...

అతను తీగలకోసం చూశాడు. ఇప్పటివరకూ దానిని తోలుకుని వచ్చిన తీగలు. నలిగిపోయి, చిట్లిపోయివున్నాయి. ఇంకా తీగలుండాలి-మోపుల్ని విప్పిన చోట.

గబగబా వెళ్ళి వెతికాడు—వెన్నెట్లో.

పాములు జ్ఞాపకం వస్తున్నాయి తీగల్ని చూస్తోంటే.

కాళ్ళు నొప్పి. తిరగనివ్వీలా లేవు.

కొడవలీ. చెప్పులూ, అల్లికర్రా వొక్కచోట వున్నాయి.

తీగల్ని ఏరి. జములు చేశాడు-బారుగా. ఒక చివర్ని పుచ్చుకట్టి జారుముడి వేశాడు... కాని, జారుముడి, గట్టిగా దున్నపోతుని లాగేప్పుడు జారిపోతుందనిపించింది. సున్నటి తీగలవి. నూలు తాళ్ళలా. సున్నగా. లోహపు తీగల్లావున్న పచ్చితీగలు. వాటితో. దానితలకి ఏనుగు బంధపు ముడిని వెయ్యాలని.

....తను దీనికి డాక్టరవుతున్నాడు. బాధి, స్వస్థత తెచ్చాడు. మహానీరసంగా వున్నదానికి శక్తిని తెచ్చిపెట్టాడు. నడవలేని దాన్ని నడిపిస్తున్నాడు...ఇంతేనా ఏనుగుముడి?...ఇంతే.

—అతను వెళ్ళి. కొడవల్నీ. చెప్పుల్నీ. అల్లికర్రనీ పుచ్చుకున్నాడు. దున్నపోతు తలకి కట్టిన తాళ్ళని చేతుల్లోకి తీసుకున్నాడు. మూడుగజాల లోపు తీగలు.

"దా—దా—దా" అన్నాడు లాగుతూ.

....తనకాళ్ళే తనకి పట్టివ్వడంలేదు. ఇందాకా కొడవల్నీ. చెప్పుల్నీ వంగి తియ్యాలంటే నడుంనొప్పి పెట్టింది. మోకాళ్ళు వంగలేదు.

"రావెహె నీ తల్లీ ముండామొయ్య" అన్నాడు విసురుగా వెనక్కి తిరిగి.

అది కదలడంలేదు. తన బుజాలు నొప్పి పెడుతున్నాయి లాగుతోంటే.

దాని డొక్కలు శ్వాసకు పెద్దగా కదుల్తున్నాయి.

"వస్తావా....రావా?" అన్నాడు విలబడిపోయి.

వెనుక, దాని చట్టలమీద, తీగతో రెండు దెబ్బలు వెయ్యా

లనుకున్నాడు. చేతుల్లో వాటిని అక్కడే వదిలి, అతను ఆదాటుగా వంగి, తీగల్ని పుచ్చుకున్నాడు. దున్నపోతు చూస్తోంది...బెదిరింది వొక్కసారిగా...బందం వేసినప్పుడు, ఎగిరి పరిగెత్తినట్టు. పరిగెత్తింది—ముందుకు తిరిగి.

"దీనికీ దారి తెలుసునే" అనుకున్నాడు రాఘవులు, అది పరిగెత్తుతున్న ధోరణిచూసి. కాని నీరసంచేత పడిపోతుందేమోనని శంకించాడు.

అదే వూపులో ఇంకా వొడ్డుదరికంటా పరిగెత్తిద్దామని, చొంగలు కక్కుతున్న దున్నపోతుని అరుపుల్తో భయపెట్టబోయాడు.

"నీ తల్లీ ...నీ యమ్మా...వురకవే...వురుకూ .... వూబిలో పడగలవా!...నీ మొగుడెవడు తీస్తాడని?...ఇంకెప్పుడన్నా పడతావా? నీరం...మొగుడొచ్చి తీస్తాడీసారి....విన్ను వెంకాయిగాడి కివ్వా....

"నడు నీ తల్లీ"

అసభ్యమైన తిట్లు ఇప్పటివరకూ తను ఉచ్చరించినవి.

అది ఎగబడుతోంది. ముందు కాళ్ళకీ, వెనక్కాళ్ళకీ బంధం వేసినప్పుడు, పరుగెత్తే గొడ్డులాగా, నీళ్ళకడ్డం బడింది....ఆగిపోయింది....

ఎన్నాళ్టికి నీటిలో;....పారుతున్న నీటిలో అడుగుపెట్టాననా?

....అతను ఇంకా అరుస్తున్నాడు. కాని, అది కదలడంలేదు. ఇంకో ఆరుగజాలు పోతే, వొడ్డున గొడ్లు నడిచినడిచి పడ్డ జాలు వెంట పైకెక్కాలి.

....అది ప్రవహిస్తున్న నీటిలో కానాలవి విలబడి పోయినట్టు విలబడింది. అతనికి ఏం చెయ్యాలో అర్థమవడంలేదు. చివరకి, చేతిలో వున్నవి వొడ్డుమీద పడవేసి.—

దానిమీద నీళ్ళు జిమ్మాడు—రెండు వేపుల్నించీ.

దాని ముఖంమీద చిమ్మాడు.

కాలవ అట్టే లోతులేని మూలాన వొక్కోసారి, నీళ్ళకింద ఇసక దాని వంటిమీద పడేది. బాగా వొంగాల్సివస్తూంది.

వొంట్లో అతనికి కీలుకీలూ నొప్పే.

ఇంటికిపోయి. ఈ నొప్పులన్నీ పోయేందుకు 'సారా'తెప్పించు కుని తాగాలనిపించింది. 'సారా' తాగి, మత్తుగా నిద్రపోవాలని బాగా తినేసి వొళ్ళు తెలియకుండా నిద్రపోవాలని. తన గది చుట్టుపక్కలకి ఎవరూ రాకుండా చెయ్యమనిచెప్పి. నిద్ర కంకితం అవాలని. ఆఫీసు రూముపక్క తన ప్రశాంతమయిన పడక గది!

...రేపటికి పొద్దెక్కిన తర్వాత మెలకువ వస్తుంది. ఎక్కడి కక్కడ నొప్పులన్నింటినీ చేత్తోరాసి ఏదో అదృశ్య శక్తి తీసేసినట్టు వుంటుంది—వొళ్ళు. ఇప్పుడు చేసిన తతంగమంతా కలలాగా అని పిస్తుంది రేపటికి....

పది పదిహేను రోజుల్నుంచి తను, సమితి కాగితాలే చూడ లేదు. సమష్టి కమిటీల లెక్కలు ముగించలేదింకా, బ్యాంకు తనఖాలు చాలా వాటిమీద సంతకాలు పెట్టాలి. సమితి వూళ్ళోంచి ప్లైపిస్తు రోజూ వచ్చిపోతున్నాడు. ఈ 'ఆహార సమస్యావారం' పుణ్యమా అంటూ తనకి తీరిక చిక్కలేదు. చర్చించిన విషయాల్లో సగం అమలు జరుపగలిగినా జిల్లాకంతా సమృద్ధయిన పంట పండుతుంది. సమష్టి వ్యవసాయానికి ఈ ఏడాది మరో రెండు ట్రాక్టర్లూ, ఒక నీటిఇంజనూ తెప్పించాలి. బయటనుంచి తీసుకోవాల్సి వస్తుంది. బ్యాంకులో డబ్బు మిగలదు. గోపాలరావుగారిని కలవాలి. తప్పకుండా ఇస్తాడు. ఆయన కేమీ అసూయగాని ద్వేషంగానీ లేవు తనమీద. తను మెచ్చుకుంటు న్నాడని విన్నాడుకూడా-తను. దాచుకుంటే ఏముంది ప్రయోజనం— ఆ డబ్బుకి? వడ్డీ వస్తుంది. ఉపయోగపడుతుంది, ఎంతమందికో జీవ నాధారమవుతుంది. కావలిస్తే ఆయనకి రెండు ట్రాక్టర్లని తనఖా పెట్ట వచ్చు.... ఎలాగోలాగు చెయ్యవచ్చు...

....కాని, దున్నపోతు! ఇక్కడ వొదిలేస్తే దున్నపోతు ఏమవుతుంది? నెమ్మదిగా వొడ్డుమీదా. పుంతలవెంటా మేస్తూ తెల్లారే సరికి ఒక అరమైలు వస్తుంది. తెల్లారివెతికి దీన్ని తీసుకెళ్ళి తన పొలంలో కట్టెయ్యాలి, బాగా మేపాలి-వారం రోజుల్లో ఇది కోలు కోవాలి-గాయపడిన సిపాయిల్ని మేపినట్టు మేపాలి...దీన్ని తప్ప కుండా సమితి తరపున పెట్టుకోవాలి ఇది ఒక మనిషిని పోషి స్తుంది—ప్రజారోగ్య రక్షణకి తోడ్పడుతుంది. ఐ స్త్రీలో చైతన్యమంతా

బండికెత్తి ఒకతను దీనితో తోలేస్తూంటాడు. చాలా బాగుంటుందీ పద్ధతి. వూరుకొకదున్న పోతయితే—బావుంటుంది. చిన్నవ్యూళయితే అక్కరలేదు....సమితిలో నాలుగయిదు పెద్ద వూళ్ళు. దున్నపోతు ఆ పనికి మాత్రం బ్రహ్మాండంగా వుపయోగపడుతుంది. వందమంది ఆరోగ్యప్రచార ఉద్యోగులపెట్టు అవుతుంది ఈ దున్నపోతు.

అతను దున్నపోతును 'ప్ఫ ప్ఫ ప్ఫ ప్ఫా' అని అదిలించాడు తోకని పట్టుకుని. అది ఒక్క గెంతు గెంతి మళ్ళీ ఆగింది. మళ్ళీ అన్నాడు. మళ్ళీ అలానే వొక్క గెంతు.

...తన గొంతుక నొప్పి పెడుతోంది. ఎండలో పని చేసి చేసి, ముఖం బాగా 'గావు' కొట్టుకుంది. కనీసం మంచినీళ్ళయినా తాగలేదు తను. ఎప్పుడో పొద్దుట తిన్న అన్నం. అన్నింటినీ మర్చిపోయి. అన్నింటినీ వదిలి ఇదొక మహత్కార్యంగా నెరవేర్చాడు తను. ఇది ఎవరు చెప్పుకునేందుకు పనికొస్తుంది? ఏ వీరకార్యంగా లెక్కవేస్తారు ఎవరయినా.

—"రాఘవయ్య దున్నపోతొకటీ...వూబిలో పడుంటే బయటికి తోలుకొచ్చాడంట. మీరు యిన్నారా?" అంటారు.

"కాశీకి యెళ్ళి కోడిగొడ్డు తెచ్చాడంట" అంటాడొకడు.

...అంతే. అలానే వుంటుంది అందరకీ. వాళ్ళకిదంతా తెలిస్తేగా! తెలిసినా; దున్నపోతుని అంత కష్టపడి తియ్యడమేమిటి-అనేస్తారు. అదీ నిజమే కొంతవరకు. ఏది ఏమయినా దానిపట్ల తన అభిప్రాయం మాత్రం తగ్గదు. అది వొక జీవి. అంత మాత్రమే. అది కష్టాల్లో వుంది. అది తనకి కావాల్సింది. కష్టాల్లో వున్న వాళ్ళని ఆదుకుంటాడు తను. వాళ్ళ కోసం పోరాడుతాడు తను. అలానే ఈ జీవిని రక్షించడం కోసం కూడా పోరాడాడు. ఆ కార్యక్రమం సందర్భంలో ఎంతో అనుభవం ఎన్నో ఆలోచనలు. ఎన్నో అడ్డు గడిచాడు తను. అలా విరాళల మధ్య హోరా హోరీ పోరాటం....!....! అంచేత తను ఇంత అవస్థపడి దున్నని బయటికి తీసినందుకు గాను కించ పడడు. ఎవరూ గాధగా చెప్పుకోక పోయినా. తనకి మాత్రం ఇది ఒక గర్వించదగ్గ అనుభవంగా మిగిలిపోతుంది. తన మనస్సు

స్థిమితపడుతుంది. ఆమాత్రం చాలు. పైగా.....దీనితో తనొక కొత్తరకం కార్య క్రమాన్ని ప్రారంభిస్తున్నాడు...

అతను అంతట్లోనే అరిచాడు.—

"నడవదేరా...నిలబడింది!"

అతని చేతిలోని తీగలు చురుక్కుమని దాని చట్టకి కిందుగా తొడమీద తగిలాయి. అది అరుపూ—మూలుగూ కలసిన ధ్వనితో. పీరసంగా గెంతింది. కప్ప గెంతుతున్నట్టు. రెక్క విరిగిన పక్షి గెంతినట్టు—అతను దాని వెనకే; తీగల్ని చప్పుడు వచ్చేలాగా గాలిలో తిప్పుతూ—

జాలు ఎదురుగా నిలబడింది.

ఏటవాలుగా. వొడ్డు మీదికి పోయేందుకున్న ఆ దారినిఎక్కనా వద్దా అన్న భావం దానిలో.

తల కిందికీ పైకీ వొగుర్పుతో కదిలిస్తోంది. దెబ్బలకి జడిసి. తప్పించుకునేందుకు మాత్రమే పరుగు లంకించు కుంటున్నట్టుగా వుందది. దాని మొండి తోక చలనం లేనిదిలాగా వుంది.

అతను జాలు వెంట పైకి చూశాడు. ఏటవాలుగా ఎనిమిది గజాల వొడ్డు వుంది. వుమ్మెత్త మొక్కలున్నాయి జాలునిండా.

...ఎలాగోలాగు దాని మంచితనం కొద్దీ అది ఎక్కేస్తే బాషండును. తను కొట్టలేకపోతున్నాడు. చేతులు పుళ్ళు పడి పోయాయి. తెల్లగా చచ్చుబడి పోయాయి. సుమారో వారంరోజులు ఏ పని చేసేందుకూ పనికిరానిక అవి. జాలులో ఎక్కాలంటే. దున్నపోతు యిప్పటికన్నా ఇంకాస్త ఎక్కువ శక్తిని వుపయోగించాలి. కాస్త ధీమాగా ఎక్కాలి. కాలవలో బల్లపరుపు యిసక మీద. అవక తవకలు లేనిచోట. దీని యిష్టం వచ్చినట్టు గెంతింది. కాని. యిప్పుడెలా గెంతగలదు!.... అది పడిపోతేనే వచ్చే బాధంతా. పడి పోయిగాని దొర్లిందంటే తప్పకుండా చచ్చిపోతుంది. దాని జీవం కాస్తా ఈ కాలవలో కలిసి పోతుంది. అంటే. ఇంకా చావుగాడు దీన్ని కనిపెట్టుక్కూర్చున్నాడన్న మాట....

అతనికి చావు జ్ఞాపకం వచ్చేసరికి పౌరుషం వచ్చింది. తన్ను

కూడా కాస్తలో ఈ 'చావు' తన వలలోకి పట్టేందుకు, ప్రయత్నించింది. అంచేత, ఏమవనీ దీన్ని చావకుండా చెయ్యాలి; చచ్చిపోయిందో, అది తన అహానికి తీరని దెబ్బ. తన ప్రయత్నాలన్నింటికీ తీరని లోటు,

అతను దాన్ని, ఆ వుద్దేశంతోనే, అదిలించాడు.

చంద్రుడు సగం వున్నాడు. వెన్నెల బాగా కాస్తోంది. వెన్నెట్లో కాలవ; కాలవలో రాఘవులూ, దున్నపోతూ. చంద్రుడికి మబ్బులు అడ్డు రావడం లేదు.

అతను దున్నపోతు తోక మీద చెయ్యి వేశాడు. అది కదిలింది. దాని శరీరం కదిలింది. దాని కాళ్ళు కదిలాయి నీళ్ళు కదిలాయి. అది కాలును ముడవడానికి ప్రయత్నిస్తోంది. గెంతకుండా నడవడానికి. గెంతకుండా, తన ఎదురుగా వున్న చిన్నపాటి కొండలా వున్న వొడ్డును ఎక్కడానికి.

అతనిలో ఆతృత బాగా హెచ్చుతోంది-తొందరగా ఇంటికి పోయి బడుకో వాలిని. కాని, తాగాలని లేదు. తాగితే శాసనాన్ని వ్యతిరేకించినట్టవుతుంది. తాగకపోతే రెండు మూడు రోజులికిగాని, ఈ నొప్పులు తీసేట్టు లేవు. తాగితే మాత్రం తప్పు లేదనిపించింది. డాక్టరు సలహా మీద తీసుకున్నట్టు. మందుగా వాడాలి సారా కాకుండా, 'చిగురు' వాడాలనిపించింది. తనంతటి వాడు! అలవాట్లకి అతీతుడు. అయినా తాగకూడదు...కాని, తాగుతాడు.

....రాత్రి పడిపోతోంది. రాత్రి పడుతోంటే, ఈ అపరిచితమైన ప్రదేశంలో వుండవద్దని మనస్సు హెచ్చరిస్తోంది. కొండ గుట్ట మీద బజారు తనని చంపేందుకు రావడం, వొంటరిగా వున్నందు వల్ల బెరుకుగా వుంది. ఈదురుగాలి, చలి వేస్తోంది. జ్వరం వచ్చేట్టుగా వుంది.

—ఇదొక గ్రహపాటు తనకి. ఎప్పుడో నాలుగేళ్ళ క్రితం ఒకసారిలాగే, నీటి ఎద్దడి యేర్పడి వూళ్లో అంతా చికాకుగా వుంటున్నప్పుడు, చీకటి రాత్రి వరిపొలానికి నీరు పెట్టేందుకు వెళుతూ తన పెద్ద కొడుకు 'రాముని తోడు కోసమని వెంటబెట్టు కెళ్ళాడు. అప్పటి

వరకూ తన కొడుకు మనస్సులో,—పెంచడంలోనో, పరిస్థితుల వల్లనో కలిగిన విస్తరణని చూడలేదు. అర్ధరాత్రి...వర్షం చెండాడుతోంది. బట్టలు తడిసిపోయాయి, రాముూ వణుకుతున్నాడు. పళ్ళు గిట్ట కర్చుకు పోయాయి. తను ఆ విధంగా ఎనిమిదేళ్ళవాడిని వెంట తెచ్చినందుకు బాధ పడుతోంటే, తన కొడుకు అన్నాడు.—

"నాన్నగారూ...."

"బాబూ!" తన హృదయం ఘోషిస్తోంది—పసివాడిని ఇంత చీకట్లో, వర్షంలో, బురదలో ముళ్ళదారుల్లో. అర్ధరాత్రివేళ అవస్థల పాలు చేసినందుకు.

"బాగా కష్టపడితే బాగా సంపాయించుకోవచ్చు. బాగా సంపాయించుకుంటే, ఇంకా బాగా మంచి పోషకాహారాన్ని తినొచ్చు. నాన్నగారూ, అందరూ యిలా రాత్రుళ్ళూ పగళ్ళూ కష్టపడితే, సుఖంగా తినొచ్చుగా—"

తన కొడుకు! అతని కివన్నీ ఎలా తెలిశాయి! అనేకమంది మీసాలు నెరిసిన వాళ్ళకి తెలవని జీవిత రహస్యం—తన కొడుక్కి తెలిసింది. తను ధన్యుడు....తన కొడుకొక్కడే కాదేమో ఇలా ఆలోచించేది; తన కొడుకు తరం వాళ్ళు అంతా అంతేనేమో!

—"నాన్నగారూ! మా స్కూలు లైబ్రరీలో ఒక పుస్తకం వుంది. అందులో నాకో రకం ప్రజల పద్ధతి నచ్చిందండీ! చెప్పమంటారా!" తన కొడుకులో ఎంత సౌశీల్యమూ, సంస్కృతీ వున్నాయో! "....మీకు అయిదు నిమిషాలు వినే ఓపిక వుంటే, చెప్తాను" అన్నాడు ఒక రోజున—హైస్కూలు కెళ్ళిన మొట్టమొదటి ఏడాది అది.

"నీ యిష్ట మొచ్చినంత సేపు చెప్పు. నేను వింటాను" అన్నాడు తను నవ్వుతూ.

తనని వొంటరిగా చూసే, తగిన సమయాన్ని ఎన్నుకుని మరీ తన దగ్గిరికి వస్తాడు ఎప్పుడూ, ఒకరకం ఆత్మీయతా, వొకరకం సిద్ధాంతాల కలయికా తమ మధ్య వుంది.

మనుష్యుడు తన స్వార్థంకోసం మాత్రమే సంఘజీవి అయ్యాడట. సంఘంగా వుండకపోతే, ఏ క్రూరమృగాలో తమని వొక్కొక్కళ్లా

క్కుళ్ళనే తినేస్తాయని భయపడి, మనుష్యలోక జాతిగా తయారయారు. తర్వాత, అలా రకరకాల జాతులు పుట్టి, వొకజాతి కొక జాతి భయపడి అవి పోరాడుకుంటూ వచ్చాయి. ఆ గుంపులు విస్తరించుకుంటూవచ్చి, క్రూరమృగాల్ని ఒకళ్ళుగా ఇద్దరుగా ఎదిరించ గలిగిన స్థితికివచ్చి, కుటుంబాలుగా విడిపోయాయి. అప్పటినుంచీ సొంత ఆస్తనీ, సొంత కుటుంబం అనీ, జ్ఞాతులికి ఆస్తిని సుఖంగా బ్రతికేందుకు వప్పజెప్పాలనీ, అందుకు సలుగురినీ వొప్పించడం, శాసనాలు చేసుకోవడం....నాగరికత. ప్రభుత్వం....ఇలా ఇవ్వాళకి ఈ పద్ధతి రూపొందింది. ఇది ఎన్నాళ్ళుంటుందో తెలియదట.

"అయితే అటువంటి ఆదిమజాతులు ఇప్పటికీ ఈ నాగరికతకి దూరంగా వున్నవి కొన్ని వున్నవట. ఎస్కిమోలలో కొన్ని తెగలకి సొంత ఆస్తి అంటేనే తెలియదట. అందరూ కలిపి పని చేస్తారు.... వేటాడుతారు. తెచ్చుకున్న దాంట్లో ఎవళ్ళకి కావలసింది వాళ్ళు తిని, తృప్తి పడతారు. ఆనందంగా కలిపి డ్యాన్సులు చేసుకుంటారట. కాని, పాశ్చాత్యులు వెళ్ళి, అక్కడ వ్యాపారం చేసుకోవడం మొదలెట్టిన తర్వాత వాళ్ళ నాగరీకబుద్ధులు కొన్ని నేర్చారట. అక్కడి వాళ్ళకి, దాంతో, వాళ్ళలో వాళ్ళకి అసూయలు రావడం, డబ్బు దాచుకోవడం, పదార్థాల్ని దాచుకోవడం; ఇటువంటివి చేస్తూ వస్తున్నారట.

తన కొడుకు తనకి ఉపన్యాస మిస్తున్నాడు—

అతడు వక్త. తను శ్రోత.

"నాన్నగారూ, నా దృష్టిలో మనదేశమంత వెనక చూపు దేశం మరోటి లేదండీ. ఈ దేశానికి మొదట్నుంచీ ఒక మతం. ఆ మతంలో ఎక్కువ తక్కువలు తెలుపుకునేందుకు కులాలు, ఆకులాల్లో మళ్ళీ ఉపకులాలు. సాటిమానవుల్ని వెలివేసి వూరిబయటికి పంపడం. నామటుకు నాకు ఒక కులంవద్దు. ఒక మతంవద్దు. నేను ఒక ప్రాంతం వాడినని చెప్పుకోలేను. నాక్కావలసిందల్లా అందరూ సుఖజీవనం చెయ్యగలగడం చాలు నాన్నగారూ నాకు...

"... ఇంతే నేను చెప్పాలను కున్నది?"

తనలోంచి జీవితాన్ని పొందిన తన కొడుకు మాటలవి. తన రక్తంలో జీర్ణించుకుపోయిన భావాలు, తనలోంచి వెలువడ్డ కుళ్ళ

కోశాల్లో కూడా అవరించుకుపోయి వుంది వుండాలి. పైగా తన పెంపకం తీరో;

తన పెంపకంలో వచ్చిన భావాలివన్నీ. ప్రజాభ్యుదయాన్నీ, జీవితాభ్యుదయాన్నీ దృష్టిలో పెట్టుకుని చిన్నప్పటినుంచీ పిల్లల్ని పెంచితే,—ఇలానే పెరగడం; మంచితనాన్నీ. తాజాతనాన్నీ అల వర్చుకోవచ్చు. —సరి. పిల్లల్ని ప్రభుత్వం అనేది ఒక నిర్దిష్ట పథకం చొప్పున పెంచాలి. అడవిలో విచ్చలవిడిగా పెరిగే చెట్లవగూడదు- వాళ్లు ఒక వావీవరసా లేకుండా పెరిగే పద్ధతి—పెరిగినవి పెరుగుతాయి. కొన్ని కార్చిచ్చుకు కాలిపోతాయి. ఒకదాని నీడపడి అనేకం అణగారి పోతాయి. ఆలోచించి చూస్తే—పిల్లలకి చక్కటి విద్యా బోధన ఏర్పాటుచేస్తే కొద్ది ఏండ్లలో దేశాన్ని అనుకున్న విధంగా మార్చి అభివృద్ధి పరచవచ్చు. చిన్నతనంలో మనస్సులోపడ్డ బీజాలు మొక్కలై.చెట్లయి పళ్లుకాస్తాయి. దేనికయినా ఒక పథకం వుండాలి. ప్రజాస్వామ్యం అంటే అడవి పెరిగినట్టు. ఇష్టం వచ్చినట్టు పెరగాలని కాదే:

—తీతువుపిట్ట కాలవమీదుగా ఎగురుతూ అరిచింది. రాఘవులికి ఆ ఏకాంతంలో ఆ రకం కూత ఏవగింపు కలిగించింది గుండె భయంతో జలదరించింది. ఉలిక్కిపడ్డాడు.

చుట్టూ చూసి. వెన్నెల్ని చూసి ధైర్యం తెచ్చుకుని; అతను దున్నపోతుని అదిలించాడు. తీగల్తో దాని చట్టమీద కొట్టాడు. ఒక తీగ తెగిపోయింది. తెగివచ్చి. కాలికి తగిలింది. దున్నపోతు ఈ సారి అరవలేదు. దాని కాళ్ళు ముడుచుకోవడం లేదు. అది జాలుమీదికని ఎగిరింది కప్పలాగా...బోదురు కప్పలాగా...దానంత కప్పలాగా. జాలులో దాని కాళ్ళకి పట్టుదొరక్క,—

...పడిపోయింది....

...కాలవలోకి వొరిగి దభీలుమంది.

...అతని మనస్సు పెళపెళమంది. అది విలకడ తప్పింది. ఒక్కసారిగా మొద్దుబారింది.

ఇంక దాన్ని తియ్యలేనన్న నైరాశ్యం—అతని ముఖంలో.

కాని. మొండితనం.

మొండితనం ఇంకా మొండికెత్తింది.

అది పడీపడగానే, తీగల్తో మళ్ళీ బాదాడు.

అది బలవంతంగా కాళ్ళని ముడుచుకుని, లేవాలని

దాని కాళ్ళు ఏ మాత్రం ముడుచుకోవడంలేదు. ఆయాసం విపరీతమయింది. రోజుల తరబడి నిలబడిన కాళ్ళలా కర్రల్లా అయిపోయాయి.

దాని గిట్టల దగ్గిర మాత్రం వంగుతోంది. వాటితో తడిఇసక మీద పట్టు చిక్కించుకుంటోంది. కాలిపోయిన చేతులు, కాలిపోయిన ఇంట్లోంచి వచ్చే బీభత్సంలో, పట్టు దొరక్క అల్లాడినట్టు, ప్రసవ వేదన, భయంకర ప్రసవవేదన, ప్రమీల ప్రసవం...

రాఘవులు మతి స్తిమితం తప్పి అరుస్తున్నాడు...

"లేస్తోంది...లేస్తోంది...దీని తస్సాదియ్యా...అలాగే.... లేలేలే....కాలిగిట్టలంట పట్టుచిక్కుతోంది...పట్టుపట్టింది...పట్టో... (బాదాడు తీగల్తో)....లేస్తోంది...లెగెహే"

దాని ప్రయత్నం భయం. అరుపులు. మూలుగులు. అతని కేకలు. నీళ్ళలో కెలుకుడు. దాని తోక పట్టుకున్నాడు. కాళ్ళని లాగుతున్నాడు.

....లేచిందది. పడిపోయిన రైలు ఇంజన్ని—నిలబెట్టి పట్టాలమీద పెట్టినట్టు.

ఇంతదానికి విశ్రాంతి యివ్వగూడదనిపించింది అతనికి.

"నడువ్!" అని గద్దించాడు.

"నడుస్తాను వుండు..." అని వాడిపోయినవాడు గొణిగినట్టు, అది గుర్రుమని అంది. రొప్పుతోంది.

అతను తీగల్తో బాదాడు మళ్ళీ. బాదేప్పుడు అది కనిపించడం లేదతనికి. తన నిశ్చయం మాత్రమే.

అది వొడ్డుమీది జాలుమీదికి గెంతుతూ పరిగెత్తి ఎక్కింది.

"హమ్మయ్య"

అతను బూతులు తిడుతో-ఇంకా పరుగెత్తించాలని.

ఇంకా పరుగెత్తుంది-ఉమ్మెత్తచెట్ల మధ్యనుంచి.

గుర్రం-పిరమిడ్‌ను ఎక్కుతున్నట్టు. శిధిలమయిన పిరమి

ద్మ. నగానికి పైగా పరిగెత్తిందది...వెనక కాళ్ళు బిగిదీసుకుని. పోనివ్వకపోతోంటే. సాగనీయకపోతోంటే.—నిలబడింది. అతను దానితో పరిగెత్తలేక వొగుర్చుకుంటూ ఎక్కాడు. అతను 'సొలి' తీర్చుకుంటున్నాడు. కిందినుంచి తనతోపాటు కొడపలీ, చెప్పులూ తెచ్చుకున్నాడు. బరువుపాటి చెప్పులు. తడిసి బరువెక్కిన చెప్పులు. అల్లికర్రనీ.

తెల్లకొంగలు అతని మీదినుంచి ఎగిరిపోయాయి—నాలుగు. అతన్ని దాటిన తర్వాత, అవి కబుర్లు చెప్పుకుంటున్నట్టుగా కరకర లాడుతూ ఏమిటో ఉచ్చరిస్తున్నాయి.

దున్నపోతుకూడా ఆయాసం తీర్చుకుంటోంది.

పొద్దుపోతోంది.

....తెగింపులేక పోతేనూ, సాహసం లేకపోతేనూ. ముఖ్యంగా ప్రజాబాహుళ్యం మధ్య వున్నవాడి జీవితానికి వ్యక్తిత్వ లోపమొస్తుంది. తనకి మాత్రం మొదట్నుంచీ ఈ పంథా ప్రవర్తన వుంది. ప్రాణాలు మదుపుపెట్టి, కావాలన్న విషయాన్ని సాధించాలి. అనుకున్న పనిని పూర్తి చెయ్యాలి....స్వాతంత్రాలకోసం పోరాడిన వాళ్ళూ, సమాజాల్ని సంస్కరించిన వాళ్ళూ, అందరూ ఇంతటి పట్టుదల గలవాళ్ళే. లేకపోతే సామాన్య మానవులకన్నా ఎత్తున నిలబెట్టే ఆ స్థితి, వాళ్ళకి వచ్చివుండేదేకాదు.........వెన్నెలవడంవల్ల తనకి కొంత మెరుగిచ్చింది. లేకపోతే దీనికర్మ మరోలావుండేది. సాయంత్రానికల్లా తియ్యాలనుకుంటే, ఇంత ఆలస్యం అయింది. తను వూబిలో చిక్కడి వుండకపోతే ఈపాటికి ఇంటికి వెళుతూ దారిలో వుండేవాడు....వూళ్ళోకి పందాలకెళ్ళిన జనం ఇప్పుడిప్పుడే తిరిగి వస్తూంటారు. ఆడపిల్లలు 'చిన్నీ చిన్నీ' ఆడుకుంటూంటారు. చిన్నప్పుడు, వాళ్ళు ఆటలో వెనక్కి వస్తున్నప్పుడల్లా, పల్లేరుకాయల్ని విసిరి, తను ఏడిపించేవాడు వాళ్ళని. అది చిన్నతనం...

"ఇంక కదులు" అన్నాడతను.

అది వెనక్కి తల తిప్పబోతూ, చూపింది.

దానిమెడ స్వేచ్ఛగానే కదపగలుగుతోంది.

"....ఈ దున్నపోతుకి స్వేచ్ఛగా అడవులవెంట తిరగడం

కావాలా. శుభ్రమైన మేతపడేస్తే సంతృప్తిపడి పడి వుంటుందా?'
అనుకున్నాడతను.

ఇది దొడ్లోవుండి నాగలి దున్నిన దున్నపోతుగాని, వరద గొడ్డు కాదనిపించింది అతనికి. వరదగొడ్డుకు మరీ మూర్ఖత్వం వుంటుంది. పొలం పాకల చుట్టూ తిరుగాడిన దున్నపోతు అని స్పష్టమయిందతనికి. ఇది అడవిదున్నేమీ కాదనీ, స్వేచ్ఛకోరదనీ తట్టిందతనికి.... శుభ్రమైన మేతపడేస్తే, చక్కని వసతి కల్పిస్తే ఎక్కడికీ కదలకుండా కొట్టం చుట్టూ తిరుగుతూ విశ్వాసంగా బ్రతుకుతుంది. దానికి కావల్సింది కాస్త మంచిమేత.... అంతే. ఆ మాత్రం మేత పడేస్తే కొట్టం పక్కన కదలకుండా పడుకుంటుంది. కష్టపడి, కావలసినంత పనిచేసి పెడుతుంది. తిడితే వూరుకుంటుంది. కొడితే పడుతుంది. అలా కొట్టం చుట్టూ దాన్ని వదిలేసి తిరగనివ్వడమే స్వేచ్ఛ అనుకుంటుంది....

"యూ-డర్టీ-బఫెలో—" అని అతను తీగల్తో, వుట్టినే కసిగా, దాని వెన్ను తిన్నగా బాదేడు.

అతను అంట్లా కొడతాడని అది అనుకోలేదు.

అరవలేని స్థితిలో చొంగ కక్కుతూ ఎగిరింది.... పకిపోబోయి ...నిలబడింది. దయాదాక్షిణ్యాలు వదిలిన అతని వంక తల గభాల్న వంచి చూపించింది. బుస్సుమంది ఆబోతులాగా.

"ఏదీకావ్...! నీకు పౌరుషంకూడా?" అన్నాడతను. గద్దించాడు. "...విరగదీసి పోగులు పెడతాను..." అన్నాడు కాస్సేపాగి గొణుక్కున్నాడు.

అది వెనక్కి పడదోసుకు వస్తుందేమో పగకొద్దీ—అన్న ఆలోచన వచ్చిందతనికి. ఉమ్మెత్తచెట్లమధ్య నిలబడడం అతనికి కష్టమనిపించింది ప్రీతలూ కప్పలూ. నత్తలూ:......పాములూ ఆ ఆకులు దట్టంగావున్న నీడల్లోంచి, వెన్నెట్లోకి రావడానికి కదుల్తాయనీ, కాళ్ళమీద పాకుతాయేమోననీ. దున్నపోతు తొందరగా వొడ్డుపెకి, చెంకమీదికి చేరేందుకు ఇంకా బాదితే చచ్చిపోతుందేమోననిపించింది. తన బొంగురుపోతున్న గొంతుతో అరిచే-దానిని మిగిలిన మరో

రెండుగజాల ఎత్తూ ఎక్కాలనిపించింది. ఈసారి పడితే మాత్రం తనలో గుండె పత్తికాయలా పగుల్తుంది. తను తట్టుకోలేడు.

—అతనికి దాన్ని అదిలిస్తూనే ఏదో వొకటి గొడవ చెయ్యాలనిపించింది. లేకపోతే పుట్టినే నిశ్శబ్దంలో వుంటే. ఏదో వొక పిరికితనం ప్రవేశిస్తుందనిపించింది. అతను పిచ్చిగా రాగంతీస్తూ అనేస్తున్నాడు...పాటలాగా రాగం తీస్తున్నాడు. తాగినవాడు, మతి తెలియక ఏదో పాడేస్తున్నట్టు.

వీరుడి ననుకుంటూ...ప్రజాయోధుడిననుకుంటూ; వచ్చిన —నీకీర్తి: పట్టణం మధ్య స్తంభంలో రాసుంది. నీకెంత పేరు వచ్చిందో చూశావా బ్రదర్! చేతగాని 'అభ్యుదయ పెనుగులాట ప్రపంచం' అంతా; అభ్యుదయాన్ని సాధించలేని ప్రయోజకత్వంతో; నీకెంత సహాయం చేశారో సూడు! (అతను గట్టిగా నవ్వాడు) నీకోసం కట్టిన స్తంభం శిల్పం అధునాతనమైన కట్టడాల్లో అగ్రశ్రేణిదట. అంచేత బ్రతికున్న సౌందర్యారాధకులంతా, వచ్చి చూసి-పోతుంటారు. గొప్పగా చెప్పుకుంటున్నారు. నీ ఆత్మకు శాంతి వస్తుందా? నీకాకీర్తి అంటుతోందా? నీకు కనిపిస్తుందా లేదా?....ప్రపంచమంతా ప్రజల మయమని, మనుష్యులంతా ఒక జాతియని; అంటూ చెప్పుకునే చరిత్ర పాతాల అఖరి సమస్యల సమయంలో;

నీదేశ ప్రజల్ని, పౌరుల్ని:

ఎందుకు రక్షిస్తున్నావో, ఎలారక్షిస్తున్నావో నీకు తెలియదులే. అయినా,

మరోదేశ ప్రజలని పదిమందిని చంపి; వాళ్ళ పెళ్ళాల్ని—పిల్లల్ని—అనురాగాల్ని. జీవితాల్ని - తుంచి...నువ్వు వచ్చావు. వాళ్ళకి, వాళ్ళ వాళ్ళు విజయస్వర్గం అలంకరిస్తారు. నువ్వు మాకు విజయస్వర్గం అందించావు. వేలాదిది, లక్షలా. కోట్లాది స్వర్గాలున్నాయిలే. (అతను గట్టిగా నవ్వాడు, నవ్వుకున్నాడు)...ఈ రాష్ట్రం వాడు ఆ రాష్ట్రం వాడిని చంపితే-విచారణ. ఆదేశం వాడిని ఈ దేశంవాడు చంపితే ఏమిటి? అహంకారంతో ఈ జిల్లావాడు ఆ జిల్లా వాడిని; ఈ సమితి వాడు ఆ సమితివాణ్ణి; ఈ కుటుంబంవాడు ఆ కుటుంబంవాణ్ణి;నేను...విన్న...; చంపడంమే....; చంపుకోవడమే

....భాయీ:నీ — వాటా... :...నీ జీవితం...నువ్వూ... నేనూ!!; ఎంతలో నువ్వెంతటివాడవో; ఆలోచించుకున్నావా!; పీరుగినసుకుంటూ...

అతను తను రాగం తీస్తున్న దానికి అనుగుణంగా చేతుల్నీ కాళ్ళనీ కదుపుతున్నాడు. శరీరాన్ని కూడా. అతని శరీరమంతా— అతని బనియనూ. పంచె నిండా అంతా మట్టీ. బురద. చేతులు మాత్రం బురద లేకుండా. చిన్న చిన్నగా అర చేతులు ముడుతల రేఖలతో-నిండి. ఎర్రగా వున్నాయి. అరచేతులు వెన్నెల్లో. మరీ తెల్లగా. అసహ్యంగా వున్నాయి. రెండు చేతుల్లోనూ రెండేసి ఎర్రటి పుళ్ళు...అతను ఆ వెన్నెల్లో ఆ రూపంతో, ఆ దున్నపోతు వెనక. పాతకాలపు గొల్లకాపరిలాగా వున్నాడు. అతను ఇంకా పాడుతూ కదులు తున్నాడు. దున్నపోతు అతను అలా పాడుతున్న కాస్సేపటికి తల తిప్పి—

అతన్ని చూస్తూంది రొప్పుతుంటూ.

కాస్సేపట్లోనే తన్ను తాను తెలుసుకుని. అతను నిలబడి పోయాడు. తను ఆ విధంగా అరుస్తూ. నోటి కొచ్చింది పాడడం ఎవళ్ళన్నా వింటే. చలచి త్తపు మనిషిగా భావిస్తారనిపించింది. ఆదిమ మానవులూ, గిరిజనులనే వాళ్ళూ; కష్టపడి పని చేసి. రాత్రులు ఇటువంటి వినోదం కోసమే, జానపద నృత్యాలు చేసుకుంటారని తట్టిందతనికి.

—ఒక్కసారే పూరేళ్ళు రెండూ లేచి. రెక్కల్ని టప టపా కొట్టుకొంటూ, ఎగిరిపోయాయి. అతను వులిక్కి పడ్డాడు.

"ఎహేయ్య...హేయ్య" అన్నాడు.

దున్నపోతు తల ముందుకు చాచి, విదిలించి, కదల్లేదు. అది తల విదుపుతూంటే. దాని తలకి కట్టిన తీగలు కాలికింద పడడం గమనించాడు రాఘవులు. దాని గిట్ట రెండు చీలికల మధ్య తీగ చిక్కుకుంది అది ఎగిరేందుకు వీలుగా లేదు.

"ఇదొక ఆలస్యమా మళ్ళీ?" అన్నాడు.

దాని ముందుకు వెళ్ళి తియ్యాలంటే, కొట్టడానికి వస్తున్నా డేమోనని బెదిరి పడి పోతుందేమోనని. అటుపడినా. ఇటుపడినా.

కిందకి జారి పడుతుంది. ఏదోలా యుక్తిగా చెయ్యాలి. దానికాళ్ళలో తీగలు బయటికి రావాలి. తీగలు కట్టిన ఉపయోగమే లేదు. అంచేత దానికి వినిపించేలా కొడవల్నీ, చెప్పుల్నీ, కర్రనీ కింద పడేశాడు. తన చేతిలో కొరడా తీగల్ని విదిలించి పడేశాడు. కొడవలితో ఒక్క దెబ్బ దాన్ని కట్టి వుంచిన తీగల మీద వేస్తే, అవి తెగిపోయిం దున్నపోతు ఎగిరేందుకు స్వేచ్ఛ వస్తుంది. కాని, కొడవలిని చూస్తే, అది తప్పకుండా బెదిరిపోయి, ఎగిరి, కాలవలోకి దూకుతుంది. ముందు మచ్చిక చేసుకుని ఎలాగోలాగు, తీగల్ని దాని గిట్టలకింద నుంచి లాగాలి...

'ఏయ్యే ఏయ్యే' అనుకుంటూ దగ్గరగా వచ్చాడు సంశయిస్తూ. అతను వస్తూంటే అది బెరురుతూ చూస్తోంది. తట పటాయించాడు. దాని చట్ట మీద చనువుగా చెయ్యి వేశాడు. నున్నగా వుంది చట్ట. అక్కడక్కడా వెంట్రుకలు-తక్కువగా వున్నాయి. చట్టమీద మృదువుగా రాస్తున్నాడు. దాని చట్ట తీగ దెబ్బలకి చిట్లింది. రక్తం గడ్డ కట్టింది చారికలు పడి. చేతికి అంటుతోంది...అతను భరించలేక పోయాడు అది పడుతున్న బాధని తల్చుకుని. చేత్తో నిమురుతున్నాడు...ఎలాగోలాగ ముందుకు వంగి, దాని కాళ్ళలో తీగల్ని లాగాలని ప్రయత్నం. కొమ్ము విసురుతుందేమో, దానికున్న చికాకుకొద్ది-అనే భయం. అతనిలో సంశయం తర్వాత, వెంటనే కలిగే ధీమా, తిరిగి వచ్చింది. అతను దానికి పక్కగా అడుగు వేసి, రిక్క వేస్తూ, ముందు కూచుని దాని కాలు కదుపుతున్నాడు.

—అది తీక్షణంగా, జాగ్రత్తగా అతని ప్రవర్తన గమనిస్తోంది....అదిరుపాటుగా అతను కొడతాడేమోనని దాని అదుర్దా.

"తియ్యహ...కాలు" అన్నాడు. మోటుగా కాలును పక్కకి తోస్తున్నాడు. అది చేస్తున్న అలస్యానికి విసుగుపుట్టింది. అయినా ఏం చెయ్యడానికి, ఇంకోదారీ కనిపించడంలేదు. "తియ్యి .. కాలు" అన్నాడు సానునయంగా. అది వినిపించుకుంటున్న ధోరణి కనపడలేదు.

పెడబొబ్బ పెడదామనిపించింది భయపెట్టడానికని. కాని, గెంతు

తుందేమో! గొంతు బొంగురుపోయింది. తను కకేలుపెట్టే స్థితిలో లేదింక.

చేత్తో, కాలిమీద చంకికిందగా చరిచాడు. దెబ్బ చిన్న దయినా 'పెళ్ళు'మని ధ్వనించింది. వూబిలో కూరుకుపోతున్నప్పుడు, అతను పట్టుకున్న దున్నపోతు శరీరపు భాగంలోనే—అ దెబ్బ. దున్నపోతు కాళ్ళు విరిగిన పందెపు గుర్రంలా ఎగిరింది. ఒక కాలు పూర్తిగా విరిగిన పెద్దమిడుతలాగ, కొండచిలువ మంటలమధ్య నుంచి బయటకి దూకినట్టు. అతను ఆ హఠాత్పరిణామానికి కంగారుపడి, ఎటు తప్పుకునేందుకూ వీలుకాక, పక్కకి తూలాడు...

"బాబోయ్!" అని అరిచాడు.

....అతనివీపుమీద పడాల్సిన దాని ఎడంకాలు. అతని కుడి కాలుమీద పడింది. అతని కుడికాలు పాదంమీద. అతని కుడికాలు పాదానికి మధ్యగా. గునపంతో పాదం మీద బలంగా గుద్ది. భూమి లోకి దించేస్తున్నట్టు బాధ.

"బాబోయ్!" అన్నాడు బొంగురు గొంతులో, హీన స్వరంతో—రాఘవులు.

అది కదలలేదు. కదలలేని స్థితిలో నిలబడింది.

భరించలేని బాధ దాన్ని అతను గట్టిగా తోసేస్తే, కాలవలోకి పొర్లుకుంటూ పడి, చచ్చిపోతుంది.

అతను చేతుల్తో బావు బలంలాంటి శక్తిని వుపయోగించి, దాన్ని తనమీదనుంచి, తోసేద్దామనుకున్నాడు ... బావనీ—అను కున్నాడు.

...అది బరువంతా కుదించుకుని, మళ్ళీ ఎగిరింది. పక్క నుంచి లేస్తున్న అతని బట్టతలమీద 'పెఠీ' మని, మళ్ళీ 'ఫెడీ'మని, దానివెనక కాళ్ళు రెండూ తగిలాయి. అతని కాలు తిమ్మెరెక్కి పోతోంది.

"అమ్మా!" అని అతను వొత్తి గిల్లాడు

తల దిమ్మెక్కిపోతూంటే, వెంటనే తలమీద బొప్పులులాగా కదుములు వుబ్బుకొస్తూంటే—రెండుచేతుల్తోనూ; చెవుల్నీ తలనీ అదుముకుంటూ, తల వుమ్మెత్త చెట్లమీదికి వేలేశాడు. పొదిపొది

గరుకు నేల మీద అతని ముఖం. తలమీద చర్మం పగిలి, కారుతున్న నెత్తురు పాదంనుంచి బొటబొటా కారుతూన్న రక్తం. అతని తలలో ఏమీ కనిపించని రూపం. కదుల్తూ కదుల్తూ...నీళ్ళలో అలల్లాగా. తలమీదా, చెవి వెనకా, నొసటి పైగానూ—కుదుముల్లాగా. దున్నపోతు డెక్కల దెబ్బలు పూర్తిగా అమరినాయి. కాలు తిమ్మిరితో ముడగదీసుకుపోయింది. ఎవ్వరూ కదలని, ఊరికి ఎంతో దూరాన్న ఒక్కడే....ఒక్కడే నేలమీద వాముకుపోయి, దేనికో మొకరిల్లు తున్నట్టు వాలిపోయాడు....

వెన్నెల. కీచురాళ్ళ ధ్వనులు. అడవిలోంచి వక్కల కూతలు గాలికి, మనుష్యులతలల్లా కదులుతున్న పొదల చివుళ్ళు.

...పదినిమిషాలు—పధకొండు—పన్నెండు. పన్నెండునిమిషాల తర్వాత. అతను వళ్ళీ తను ఆయి చుట్టూ చూశాడు. తలని ఒక చేత్తో, పట్టుకుని, చూడుకునే ప్రయత్నంచేశాడు.

—దున్నపోతు కాలవ వొడ్డు మీద పచ్చిగడ్డి మేస్తూంది. అది నములుతున్న చప్పుడు అతనికి వినిపిస్తూంది. చంద్రుడు ఇందాకటి లానే వున్నాడు. వెన్నెల ఇందాకటిలానే కురుస్తూంది. అవతలివేపు అడవి ఎప్పటిలానే వుంది. కాని, దున్నపోతు మేస్తూంది...దున్నపోతు మేస్తూంది. వూబినుంచి బైటపడింది...తనులాక్కొచ్చాడు. ఎప్పటి రాత్రిలానే ఈ రాత్రి ఈ ప్రదేశంలో ఏ కొత్త మార్పు జరగకపోవచ్చు. దున్నపోతు మాత్రం గొప్ప మార్పును గ్రహించి వుంటుంది—వూబికీ, పచ్చికకీ మధ్యగల భేదంలోనూ, దాని జీవితం లోనూ. దున్నతుట్టకు ఆకలి వేసిస్తూంది...

—అతను కూచుని ఇవన్నీ చూస్తున్నాడు.

కుడికాలు దగ్గరగాలాక్కుని బాధా వోర్పూ నిండిన కళ్ళతో పెద్దగా పుండు పడినచోట—దున్నపోతు తొక్కిన చోట—చర్మం చిరిగిపోయిన చోట, చేత్తో చర్మాన్ని సర్దుకున్నాడు. కాలిపిక్కల్ని తిమ్మిరి పోయేందుకని వొత్తుకున్నాడు. పాక్కుంటూ వెళ్ళి కొడవలి లాంటి చేత త్రిపి, బరువయిన చెప్పుల్ని. అల్లికర్రవీ ఒకచేత తీసు కున్నాడు. మరో చేత్తో తలమీద బొప్పికట్టిన చోట్లను తడుము కున్నాడు.

ఇంక తను చెయ్యాల్సిందేమీలేదు-ఇప్పుడు.

....రేపు తప్పకుండా దీన్ని తనే వెతుకుతాడు.

అతను నెమ్మదిగా నెమ్మదిగా లేచి నిలబడ్డాడు. అన్నిచోట్లా కోసి. కుట్లు. కుట్టి. బాండేజి చేసినట్టున్న—వొళ్ళు తొందరగా ఆ ప్రదేశంనుంచి బయటపడాలన్న అదుర్దా అతన్ని కదిలిస్తోంది.

"ఎంతలో ఎంత జరిగింది...చచ్చిపోయేవాణ్ణి...!దానిదేమీ తప్పులేదు...అది దున్నపోతు నేనే ఇంకా స్త జాగ్రత్తగానూ, మెలకువగానూ ప్రవర్తించాల్సింది!" అన్నాడు తనలో తను.

అల్లికర్ర వూతంగా. కాలు ఈడ్చుకుంటూ; వొడ్డు ఎక్కి. దారి చూసుకుని, ముందుకు నడుస్తున్నాడు. కుడిచేతి బంగారు కడియం బరువుగా తోచింది, దారి వెంటబడి. తూలిపోకుండా మెల్లిగా నడుచుకుంటూ వెళుతున్నాడు.

"అనుకున్నపని చేశాను...చాలు. ఇంక నిద్రపోగలను."
అన్నాడు....గట్టిగా.

వెన్నెల వచ్చుటిచలకలు తిన్నటి నలిగిన దారి. ఇంటికి చేరగలనన్న ధైర్యం. ఏదో సాధించిన తృప్తి''

———




సరిగ్గా సంవత్సరానికి, సొంతానికి, సంసారపక్షమైన ఒక చిన్న గ్రంథాలయం కూర్చుకోడానికి ఘనమైన ఉపాయం హెచ్. ఎల్. పి. —అదే ఇంటింటా స్వంత గ్రంథాలయం ప్రణాళిక :

## ఏమి చేయాలి? ఏమేమి వస్తాయి?

మీరు చేయవలసిందల్లా ఒక్కటే :

నెల నెలా రు. 7-50 చొప్పున వరాసాగ్గా 12 నెలలు కట్టండి. అంతే. అంతకుమించి మరేం చేయక్కర్లేదు.

ఇక చూచుకోండి దానిఫలితం.

(1) మీరు కట్టే ఆ మొత్తం రు. 90 కు రు. 136 ల ఫలితం ముడుతుంది. ఫక్తు రు. 100 లకు దేశంలో పెద్దపెద్ద సంస్థలన్నీ ప్రచురించిన సుమారు 3,500 ఉత్తమ తెలుగు పుస్తకాలు, 400 కు పైబడి ఇంగ్లీషు పుస్తకాల (Jaico & Orient Paper Backs) జాబితాలనుండి మీయంతటమీరుగా ఏరికోరుకునే మంచిపుస్తకాలువస్తాయి.

(2) రూ. 20 లకు పైగా విలువ చేసే పదిపుస్తకాలు - మా ఉచిత పుస్తకాల పెద్ద జాబితానుండి మీ అంతట మీరుగా ఎన్నుకునేవి- అదనంగా, ఉచితంగా వస్తాయి.

(3) రూ. 6 లు ఖరీదుచేసే మా మాసపత్రిక 'పుస్తక వపంచం' సంచికలు ఆ 12 నెలలూ మీకు మా ఖర్చుతో వస్తాయి.

(4) వీటన్నిటికీ ప్యాకింగ్ రవాణాలకు దాదాపు రు. 8-50 దాకా అయ్యేఖర్చులు మేమే భరిస్తాము.

(5) రు. 1-50 ఖరీదుచేసే మా పెద్ద క్యాటలాగు [illegible] ఉచితంగా వస్తుంది.

అంటే - ఈ రూపేణా మీరు కట్టే మొత్తానికి పైన-అందులో సగానికి సగం అదనంగా వస్తుంది. దీన్నే గనక లెక్కగడితే మీకు సగానికి సగం (50 శాతం - 50%) లాభమన్నమాట.

## ఇక ఇవి అందే విధానం :

మొదటి నెల చందా రు. 7-50 కట్టగానే-

(1) మీరు ఏరి కోరుకునే 4 ఉచిత పుస్తకాలూ.

(2) ఆ నెల 'పుస్తక ప్రపంచం' పత్రికా.

(3) 3,500 తెలుగువీ - 400 పైగా ఇంగ్లీషువీ పుస్తకాల జాబితాలున్న కేటలాగులూ.

(4) మీ ఖాతా వివరాలు మీకై మీరు వ్రాసి పెట్టుకోవానికి రికార్డు పుస్తకమూ - వెంటనే అంది తీరుతాయి.

## 6 నెలలు చందా కట్టేసరికి ?

మా తెలుగు, ఇంగ్లీషు పుస్తకాల క్యాటలాగుల్లోనుంచి మీరు ఏరి కోరుకునే రు.45ల పుస్తకాలూ, మరి 3 ఉచిత పుస్తకాలూ అందుతాయి.

## 12 నెలలు పూర్తి కాగానే ?

మరో రు. 55 ల పుస్తకాలూ, మరో 3 ఉచిత పుస్తకాలూ అందుతాయి.

ఈ 12 నెలలూ - నెలనెలా మీకు 'పుస్తక ప్రపంచం' పత్రిక మీ యింటికి విధిగా వచ్చి వాలుతుంది.

పై వాటికయ్యే పోస్టేజీ, రవాణా ఖర్చులన్నీ మేమే భరిస్తాము.

## గడువు పూర్తయ్యాక మా టేమిటి ?

12 నెలలో పూర్తిచేస్తే మీకు కొన్ని యావజ్జీవిత సదుపాయాలు కలుగుతాయి.

(1) యావజ్జీవితమూ మా పంపిణీ పుస్తకాలన్నిటి పైన

10% కమీషన్; రు. 20 లకు పైబడ్డ ఆర్డర్లకు అదనంగా రవాణా ప్యాకింగ్‌లు ఉచితం.

(2) అవసరమైనప్పుడు రు. 50 లు మించకుండా పుస్తకాలు నెలదాకా అరువుమీద మా వద్ద తీసుకోవచ్చు.

(3) 'పుస్తక ప్రపంచం' చందాలో కూడా 10% తగ్గించబడుతుంది.

(4) ఉత్తరోత్తరా వచ్చే పెద్దా,చిన్నా క్యాటలాగులన్నీ ఉచితం.

(5) "ఇంటింటా స్వంత గ్రంథాలయాలు" ఇంట గల వారి పేర్లు ఛాయాచిత్రాలతో సహా, పలువురికి ఉపయోగించగల విధంగా తీర్చిదిద్దిన సువర్ణ గ్రంథంలో నమోదుచేయబడుతాయి.

## పోతే, ఎప్పుడైనా ఏదైనా అవాంతరం వస్తేనో? లేక, అసలు మానేస్తేనో?

మీకేం నష్టముండదు. చందాదారులు ఒకవేళ ఎప్పుడైనా, ఏ కారణంచేతనైనా అర్థాంతరంలోనే చందా మానివేయదలిస్తే నిరాక్షేపణగా మానివేయవచ్చు. అప్పటికి వారు కట్టిన సొమ్ము వారికి పుస్తకాల రూపంలో ముట్టితీరుతుంది. కాకపోతే ఈ లెక్కలో, వారికి అంతవరకూ పంపిన ఉచితపుస్తకాలూ, 'పుస్తక ప్రపంచం' సంచికల ధరా, రవాణా ఖర్చులు మినహాయిస్తాం.

## నేడే మీరు చందాదారుగాచేరి-మీ 4 ఉచిత పుస్తకాలూ ఈ క్రింది పదింటినుంచి ఎన్నుకోండి :



F. 95. బ్రాహ్మణీకం-ఇతర కథలు : చలం

F. 96. సత్యరాజాపూర్వదేశయాత్రలు:(నవల) కందుకూరి వీరేశలింగము

F. 97. పాడుపు కథ : (నవల) కె. పి. బాబు

F. 98. ఏదిసత్యం, ఏదసత్యం : (నవల) పి. ఆనందారామం

F. 99. ఆడ బ్రతుకు: (నవల) పురాణం సూర్యప్రకాశరావు

F. 100. సప్తవర్ణాలు: (నవల) పవని నిర్మలప్రభావతి
F. 101. పద్మపూజ: (కథలు) : అను. కె. రమణారెడ్డి
F. 102. Sringaramanjari: H. R. Aiyar
F. 103. I Take This Woman: Rajindersingh Bedi
F. 104. Svetlana: Martin Ebon

**చందాకట్టే విధానం :**

(1) మా 10 ఉచిత పుస్తకాల జాబితానుంచి మీకు నచ్చిన 4 పుస్తకాలు ఎంచుకుని, క్రింది కూపనులో ఆ నంబర్లు గుర్తుపెట్టండి.

(2) పూర్తిచేసిన కూపనూ, మొదటి నెల చందా రు. 7-50 మనియార్డరూ-

"ఇంటింటా స్వంత గ్రంథాలయం" ప్రణాళిక,
ఆంధ్రప్రదేశ్ బుక్ డిస్ట్రిబ్యూటర్స్,
రాష్ట్రపతిరోడ్డు, సికింద్రాబాద్-అనే చిరునామాకు పంపండి.

(3) తరువాత నెలనెలా రు. 7-50 వంతున ఆయా నెల ఆఖరులోగా చందా మొత్తం రు. 90 పూర్తి అయేదాకా పై అడ్రసుకు పంపుతూ వుండాలి-అంతే.

---

ఆంధ్రప్రదేశ్ బుక్ డిస్ట్రిబ్యూటర్స్, రాష్ట్రపతిరోడ్డు,
సికిందరాబాదు వారికి—

అయ్యా, మీ 'ఇంటింటా స్వంత గ్రంథాలయం' ప్రణాళికకు నన్ను ఒక చందాదారుగా చేర్చుకొనగోర్తున్నాను. మొదటి నెల చందా రు. 7-50 లూ మనియార్డరుద్వారా పంపినాను. తొలి విడత ఉచిత పుస్తకాలు నాలుగూ ఈ క్రింద గుర్తించిన (✓) నంబర్లవి పంపగోర్తున్నాను. మీ నిబంధనలకు బద్ధుణ్ణి.

[ ] F 95 [ ] F 96 [ ] F 97 [ ] F 98
[ ] F 99 [ ] F 100 [ ] F 101 [ ] F 102
[ ] F 103 [ ] F 104

పేరు.................................... ఇట్లు,

చిరునామా.............................. ........................

ఊరు................................ తేదీ.................

ఊబిలో దున్న



రచయిత:
వినుకొండ నాగరాజు

రెండే రెండు పాత్రలు - ఒకటి మహత్తు.
రెండోది అహమత్తు.
ఆరున్నరగంటలలో అసాధ్యాన్ని సాధించిన
అసహాయశూరుడి కథ.
ఊబిలో కూరుకుని ప్రాణం వొదిలేస్తున్న దున్న-
దబ్బు చెడి ధాయంగల విస్మపాలై
దాన్ని ఉద్ధరించిన రైతన్న-
గూఢార్థ స్ఫురన్నపలం।


యం. శేషాచలం అండ్ కో
మచిలీపట్నం - మద్రాసు - సికింద్రాబాదు
POCKET BOOKS EMESCO
116